

# విషయానుక్రమణిక

## జూలై, 1948

# గాంధీమహాత్ముని

# ఆత్మకథ

## ప్రథమ ద్వితీయ సంపుటములు

[చతుర్థ ముద్రణము]

శతావధాని వేలూరి శివరామశాస్త్రిగారి అనువాదము

ఖద్దరు బైండు

సంపుటము 1-2 వెల రూ. 5-0-0 లు;

తపాలచార్జి రూ. 0-9-0 లు.

ఆంధ్రగ్రంథమాల,

పోస్టుబాక్సు 212, మదరాసు 1.



కల్లైకట్టు

చిత్రకారిణి : శ్రీమతి సుశీలా యావల్కార్

(ఇటీవల ఢిల్లీ 'మార్క్స్ హోటలు'లో జరిగిన చిత్రప్రదర్శనములో ప్రదర్శితమైన నీటి
రంగులచిత్రమునకు ఇది ఛాయాచిత్రము)




సంపుటము 25 | జూలై, 1948 | సంచిక 7

సర్వధారి జ్యేష్ఠము

# మధుర పండితరాజము

అనువాదకుఁడు:

శ్రీ పింగళి లక్ష్మీకాంతం

## ౧. భ్రమరగీతి

పండ్ల రుచులును బూవుల పరిమళములు - తెలియఁగలవార లెందఱో కలరు గాక
పూవుఁదేనెల తీపిని బోల్చి చూడ - దక్షు లెవ్వార లోక మిళిందమ్ము గాక?

వికచనళినీమనోహరభ్రమితముండు - కుముదినీకేళిలోలుఁడౌ భ్రమరరాజు
కాలవశమునఁ బరదేశగతి లభించి - అడవిమల్లెల తేనెకై యాససేయు.

తీపు లూరంగ మాధ్వీక మాస్వాదించి కైపుగొంటివి మధూకమ్మునందు
వికసితదళకళన్మకరందమునఁ జొక్కి శయనించితివి సరోజమునయందు
ప్రసవగుళుచ్ఛసారభవాహినీనిమజ్జనము సల్పితివి రసాలమందు
మృదుశరావయవపరిష్వంగపారవశ్యమ్ము నొందితివి వాసంతియందు
నీదు సౌభాగ్య మిట్టిది కాదె భ్రమర - ఎట్లు మఱచితి వద్దాని, నెట్టు లిచటఁ
కుటజముల ప్రాలి క్రీడింపఁ గోరుచుంటి - వేటి కింత దురావేశ మిపుడు నీకు?

తొలఁగి చనుమోయి మధుకరా! దూరమునకు - సురభిళం బంచుఁ గేతకీసుమము చేరకు;
అచట లవమేని మధువు లభ్యమ్ము కాదు - అది యటుండఁగ ధూసరం బౌను మేను.

పరిమళముఁ, సువర్ణమును పద్మపు భ్రాంతి ఘటింప, ముగ్ధబం
భర మొక కేతకీకుసుమమధ్యదళమ్మునఁ వచ్చి వ్రాలఁగా
హరి హరి! పూదుమారమున నంధము లయ్యెను నేత్రముల్, గఱుల్
చిరిగెను ముండ్లచే, నిలువలేదు, తొలంగనులేదు నెచ్చెలీ!

భ్రమర మొక్కండు పరిఫుల్లపద్మగృహము-చొచ్చె మధులోభమున, వెన్కచూపు లేక
అక్కటక్కట! యెంత దురంతమయ్యె-మంచుతాఁకున నది ముకుళించుకొనియె.
రేయి కడచనుఁ, దెల్లవారెడిని తూర్పు-అరుణుఁ డుదయించు, హసియించు నబ్జలక్ష్మి
అనుచుఁ గోరకబద్ధమై నళి తలంచు-నంతలో దంతి కమలిని నపహరించె.
ఆఁకట నలంగి, కింశుక మనెడి భ్రాంతి-నావులించిన శుకముఖమందుఁ జొచ్చి [మొందు.
తనదు నవివేకమును దూరుకొనుచు, బ్రతికి-బయటఁబడఁ గొట్టుకొనుచుండె భ్రమర
పద్మవనమున రాత్రుల బంధనమ్ము-దంతి కటదానమునఁ గర్ణతాడనమ్ము
చంపకసుమమ్మునఁ బ్రాణసంశయమ్ము-భ్రమరమున కొక్కయెడను భద్రమ్ము లేదు.
తుమ్మెదా! చూడవా యేమి, తూర్పుదెసను-చదల వెలుఁగుచున్నాఁడు చంద్రముఁడు;
వారిజమ్మింతకే నిద్రఁగూరియుండు-చనకు మచటకు నిష్ప్రయోజనము తుదకు.

పటగతపద్మరూపమును, వర్ణమునుఁ మది మెచ్చి గొప్ప, ము
చ్చట పడి వచ్చి వ్రాలె నొక చక్కని భృంగకుమారరత్న; మ
చ్చట రసముఁ, మృదుత్వమును, సౌరభముఁ గనరామి సిగ్గు మి
క్కుటమయి, మోము వంచికొని, ఘూర్ణిలుచుఁ జనియెఁ యథాగతిఁ
సమదకరీంద్రగండమదసారవివర్ధితసత్త్వముల్, దళత్
కమలరజోంగరాగపరికల్పితగాత్రపరీమళమ్ము లీ
భ్రమరము లిప్డు దైవపరిపాకము చాలమిఁజేసి నింబవృ
క్షములను, జిల్లెడుంబూదలఁ గాలము పుచ్చుచునుండె దీనతన్.

నందనోద్యానమందారనవగుళుచ్ఛ-సౌరభపరాయణమ్మైన షట్పదంబు
గడ్డిపూవుల మూర్కొను గతికి వచ్చె-విధివిడంబన యేమి గావింపలేదు?
ఇచట వాసంతహైమంతఋతుమహాధి-పత్యమేళనద్వైరాజ్యవశత నేమొ,
కుందమునఁగాని, మాకందమందుఁగాని-కాలు మోపదు తుమ్మెద కలఁతఁజెంది.
కోమలలవంగలతపయిఁ గూర్మి మాని-పూలకొమ్మల లాలించు బుద్ధి యుడిగి
విసరెఁ గొంగ్రొత్తమధురకవిత్వగీతి మావిమొగ్గను జూచిన మధుకరమ్ము.
మంజుగళి గీతి వినిపింప మధుకరమ్ము-మాలతీ! తాల్చెదేల కుట్మలపు ముద్ర?
ఎవ్వ రనుకొంటి? శిరసా వహించు నితని-దానవిధులైన నందనోద్యానతరులు.
పారిజాతమ్ము తనకంటెఁ బడెడువఱకె-ద్రుమము ద్రుమమునఁ దిరుగు మధువ్రతమ్ము;
భారతకవిత్వరుచి పట్టువడెడువఱకె-ఇతరకావ్యాలు తడవు సాహిత్యవటువు.

---

# కథాసాహిత్యం : పంతులుగారు

శ్రీ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి

ఆంధ్రాభ్యుదయవిధాత శ్రీ వీరేశలింగంపంతులు గారి కథాసాహిత్యంగురించి ప్రత్యేకంగా నాలుగు మాటలు చెప్పదలచినాను.

ఆయనకథారచనను స్థూలంగా మూడు విభాగములు చేసి ఇట్లా చెప్పవచ్చును: ౧. నవలలు, ౨. పెద్ద కథలు, ౩. చిన్న నీతికథలు.

ఆయననాటికి ఇప్పుడు బహుళప్రచారంలో ఉన్న కథానిక ఎక్కువ వ్యాప్తిలో లేకపోయినా ఆ లక్షణాలు ఆయనకథల్లో అక్కడక్కడ కనబడతాయి.

ఒకరకమైన చమత్కారంతో, మౌలికమైన సంవిధానకౌశలంతో నడిపిన నవలలు రాజశేఖరచరిత్ర, సత్యరాజాపూర్వదేశయాత్రలు, సత్యవతీచరిత్ర మొదలైనవి.

పూర్వకథలను, ఇతరవాఙ్మయపు వింతకథలను తీసుకుని తమ రచనాసౌష్ఠవంతో తమ లక్ష్యాలను వ్యంగ్యంగా చూపిస్తూ నడిపిన పెద్ద కథలు చంద్రమతీచరిత్ర, కురంగేశ్వరరక్తచరిత్ర మొదలైనవి.

పిల్లలకు కేవలం నీతులు నేర్పడానికి పుట్టిన చిన్న చిన్నకథలు ఆయనవాచకపుస్తకాలలో సైతం ఎన్నో ఉన్నవి.

ముఖ్యంగా పంతులుగారి కథాసాహిత్యంమాట తలపెట్టేసరికి తెనుగుజాతి కంతటికీ చప్పున జ్ఞాపకం వచ్చేవి రెండు గొప్ప రచనలు—౧. రాజశేఖరచరిత్ర ; ౨. సత్యరాజాదేశయాత్రలు.

పంథొమ్మిదో శతాబ్ది చివరి ఖండంలో తల విరియబోసుకుని తెనుగుగడ్డమీద వికటనాట్యం చేసే దుష్టశక్తులమీద, దుర్మతాలమీద గురి చూచి మోపెట్టిన రెండు శతఘ్నులు ఈ నవలలు రెండూ.

అవి కొట్టిన దెబ్బలు అప్పటివారికే కాకుండా ఇప్పటి మనకే కాకుండా, ముందుతరానికికూడా అవకి తాక ఉన్నచోట గుండె బీటువారేలా తగులుతుంది.

ఈ సత్యం ఆయనకథాసాహిత్యమంతటా సుస్పష్టంగా కనబడుతుంది.

పంతులుగారికి రాజీ అనేదీ, మోమోటం అనేదీ, మెత్తబడటం అనేదీ కలలో వార్త.

ఆయనకంటబడ్డ ఏ దురాచారమూ ఆయన అవహేళనాగ్నికి ఆహుతి కాకుండా తప్పించుకుపోలేదు.

రాజశేఖరచరిత్రకథ కల్పించడంలో ఆంగ్లప్రసిద్ధరచయిత ఆలివర్ గోల్డ్‌స్మిత్ రచించిన నవల 'వికార్ ఆఫ్ వేక్‌ఫీల్డ్' (Vicar of Wakefield) ప్రోద్బలం ఉన్నదని పంతులు గారే పీఠికలో వ్రాస్తూ, దానికీ దీనికీ విశేషసంబంధంలేదనీ, దీనిలోని విషయాలన్నీ నూతనాలే అనీ వక్కాణించారు.

ఎరిగినవారు చెప్పితే తెలియవలసిందేగాని సహజంగా ఈ నవల చదువుతూ ఉంటే అన్యగ్రంథం దీనికి ఆధారం అన్న సంగతి స్ఫురించదు.

తెనుగుజాతి ఆచారవ్యవహారాలు, విశ్వాసాలు సూటిగా చిత్రించి తెలుగునేలలో మొలిచినట్టు ఈ నవల రచించారు పంతులుగారు.

ధవళేశ్వరంలో సిద్ధాంతి, రాఘవాచార్యులూ మొదలైన వందిమాగధులతోనూ, ప్రసాదరావు, భైరవమూర్తి మొదలైన బంధువులతోనూ, హరిశాస్త్రులు, బైరాగి మొదలైన సిద్ధులతోనూ ప్రారంభమైన రాజశేఖరుడుగారి దురదృష్టం కాలినడక కాశీప్రయాణపు దారిలో దొంగలు కొట్టడంతో ముందుకు సాగి, పెద్ద

కూతురు రుక్మిణీమరణంతో ఎదిగి, సౌభద్రాదిరాజు స్నేహంతో బలపడి, తాను జైలులో పడడంతో విజృంభించి, చిన్నపిల్ల సీతను ఎత్తుకుపోవడంతో చివరి మెట్టెక్కి పిఠాపురంలో కొడుకు సుబ్రహ్మణ్యంమీద పడిన చౌర్యఆరోపణతో పరమావధికి వెళ్లింది.

ఈ కథాగమనం నల్లరాతినైనా కంట తడి పెట్టించే ఉచ్ఛతరకరుణస్థితిని కల్పించింది. తుదిని నిర్వహణసంధిలో—త్రోవలో మిత్రుడై అనేకసాహాయ్యములు చేసిన రామరాజుగారు మారువేషములలో తిరిగే పెద్దాపురం మహారాజు గారనీ, నల్లచెరువు వద్ద జువ్విచెట్టుకింద చూచిన యోగీశ్వరుడు జైలులో కనుపించిన దొంగ మంచిరాజు పాపయ్య అనీ, చిన్న సీతతో వచ్చిన యువకుడు సుబ్బారాయుడు మొగవేషంలో ఉన్న రుక్మిణి అనీ, రుక్మిణిమొగుడు నృసింహస్వామిమృతివార్త అబద్ధమనీ, ధవళేశ్వరంలో స్వర్ణయోగం చేసిన బైరాగి పిఠాపురంలో నీలాద్రిరాజై, తుదకు తుంటరి పద్మనాభమైయున్న మనకు కనబడేటప్పటికి పంతులుగారి కథానిర్వహణచాతుర్యానికి ఆశ్చర్యచకితులం అవుతాము.

హిందూజాతిని—అందులో తెలుగువారిని పట్టుకొని పురాణజ్వరంలా పీడించే అంధవిశ్వాసాలను బహిరంగానికి ఈడ్వడానికి పంతులుగారు ఈ కథను బాగా ఉపయోగించుకొని తెనుగుజాతికి అద్దంలో ముఖం చూపించారు.

హరిశాస్త్రిలుగారి భూతవైద్యపు హంగామా, సిద్ధాన్తిగారి జాతకాల బనాయింపు, అంజనాల మాయానాటకం, నాటువైద్యుల బూటకపు వేషాలు, బతికున్న మనుషులు దయ్యాలై పీడించడం, కోరలమ్మ గుడిదగ్గర సోద, బూడిదబైరాగుల బంగారుయోగపు వంచనా, రాజమంత్రి దంతకథలూ, గ్రహణస్నానాలూ, పెద్దాపురంలో కొంపలుకాల్చే గ్రహం, దాన్ని మాన్పడుని వీరదాసు అమ్మవారికిచ్చిన తాఖీదూ, మతాధికారుల 'జులుం' ఎన్ని అనర్థాలకి దారితీసి రాజశేఖరుడిగారి పతనానికి మూలకారణము లయ్యాయో పంతులుగారు స్ఫుటంగా నిరూపించారు.

ఇంత ఎందుకూ — సుబ్రహ్మణ్యంతో నటిమీ సముపుకొమ్మతో కాల్చిన మచ్చా, పురాణపుస్తకంయ్యమీద వ్యాసులువారు కూర్చోవడం సైతం పంతులుగారి దృష్టిని తప్పించుకు పోలేకపోయినవి.

శిల్పదృష్ట్యా చూచినప్పుడు—ఇందులోని రాజశేఖరుడిగారి ఇంటివర్ణనం, ధవళేశ్వరపు గోదావరి రేవూ, అమ్మలక్కల లోకాభిరామాయణం, రుక్మిణికి ఎరుకత చెప్పిన సోది మొదలైనవి చిత్రకారుని కుంచె తగిలి రూపం పొంది సజీవంగా ఎదుటికి వచ్చి నిలిచినట్టు మనకు సాక్షాత్కరించి పంతులుగారి పరిశీలనాలోకజ్ఞతలకు ప్రమాణములుగా గోచరిస్తవి.

ఆధునికాంధ్రసాహిత్యనిర్మాత శ్రీ గురజాడ అప్పారావుపంతులుగారికి రాజశేఖరచరిత్రమీదా, ఈయనరచన లన్నింటిమీదా ఎంత గౌరవం ఉన్నదీ కన్యాశుల్కం బాగా చదివినవారికి తెలుస్తుంది.

పీఠికలో శ్రీ వీరేశలింగంపంతులుగారి సాహిత్యకృషిని విశేషించి ప్రశంసించి నాటకంలో పాత్రల ముఖానకూడా రెండు సారులు ఈ ప్రగతిశీలుని ప్రసక్తి తెచ్చారు.

గిరీశం ప్రియశిష్యుడు వెంకటేశానికి పుస్తకాల జాపితా చెబుతూ రాజశేఖరచరిత్ర రాసుకోమన్నాడు.

మరోచోట గిరీశం అంటాడు: "నా దెబ్బ చూడు. ఈవేళ శేం జేస్తానో! వీరేశలింగంపంతులుగారు కన్యాశుల్కంవిషయమై రాసిన ఉపన్యాసం పైకి తియ్. మామగారికి లెక్చరివ్వడానికి కత్తి కటారీ నూరాలి".

ఇంతే కాకుండా రాజశేఖరచరిత్రా, కన్యాశుల్కం జోడించి జాగ్రత్తగా చదివితే పంతులుగారు రాజశేఖరచరిత్రలో చేసిన మూఢాచారాల ఖండనం అప్పారాయకవికి ఎంత ప్రోద్బల మిచ్చిందో స్పష్టపడుతుంది.

| | |
|---|---|
| సిద్ధాంతులు | బనాయింపులు |
| బైరాగులు | స్వర్ణయోగాలు |
| దయ్యాలు | మాంత్రికులు |

ఛాందసుల కూడుకట్లు తప్పులో పడిరుగక్లు.

ఉభయరచనలకూ ఒక్కరకమైన పుష్టిని కలిగిస్తూ ప్రవర్తిల్లినవి.

చావని రుక్మిణిభర్త దయ్యమై భార్యను పీడిస్తే అసలు ఆడదేకాని లుబ్ధావధాన్లు రెండవభార్య తాలూకు మొదటిభర్త లుబ్ధావధాన్లను గొంతు నులుముతాడు. రెండింటికీ ఫలితం ఒకటే—అక్కడ హరిశాస్త్రులికీ, ఇక్కడ పూజారి గవరయ్యకీ ఒక తృణం ముట్టాలి. అంతే. బస్.

రాజశేఖరచరిత్రగురించి చెప్పవలసింది ఒక్కటే మాట ఉంది.

తెలుగుజాతి, వాతావరణం, మన స్వత్వాలూ ప్రస్ఫుటంగా కనిపించే కథాకావ్యాల్లో దీనికి సాటి ఐనది మరి లేదేమో అనిపిస్తుంది.

రెండవ నవల సత్యరాజాపూర్వదేశయాత్రలు. జాతిఅజ్ఞానంమీద ప్రయోగించిన గొప్ప అపహాస్యకావ్య (Satire) మిది.

పంతులుగారు దీని ఆధారంగూర్చి ఎక్కడైనా ప్రసంగించినారో లేదో తెలియదుగాని జోనాథన్ స్విఫ్టు (Jonathan Swift) వ్రాసిన 'గల్లివర్స్ ట్రావల్స్' (Gulliver's Travels) అనే గ్రంథం దీనికి ఆధారంగా కనబడుతుంది. కవి దీనిని గూడా ఒక జాతిలోని కుటిలవిభేదాలను, సంకుచితదృష్టిని హేళన చెయ్యడానికి ఉపయోగించాడు.

పంతులుగారు రేఖామాత్రంగా దీనిని అనుసరించి కథాపాత్రలను, వాతావరణాన్నీ మిక్కిలి నేర్పుగా భారతీయంచేసి, స్వదేశీయమూర్ఖమతాల్ని, విశ్వాసాల్ని బహిర్గతం చెయ్యడంలో అద్వితీయమైన ప్రజ్ఞావిశేషం చూపించారు.

ఇందులో ఆడుమళయాళం, లంకాద్వీపం అనే రెండు భాగాలున్నాయి.

మొదటిభాగంలో పంతులుగారు హిందూ స్త్రీల పారతంత్ర్యాన్ని చమత్కారంగా తలకిందులు చేసి ఒక దేశాన్ని కల్పించి (పుక్కిటి పురాణాల్లో వింటూన్నదే) అక్కడి పురుషుల పరాధీనతను, స్త్రీల సర్వాధికారాన్ని చూపించి దాంతో పురుషపరువ హృదయాలకు తగిలే దెబ్బను అద్భుతంగా చిత్రించారు.

విజయనగరం 'కాపురస్థుడు' పత్రి సత్యరాజాచార్యులు అనే మాధ్వబ్రాహ్మడు స్వదేశంలో దూరదృష్టపు ఉయ్యాలల్లో తనివితీర ఊగిఊగి హఠాత్తుగా దక్షిణాదియాత్రలు చెయ్యడానికి బయలుదేరి చెన్నాపట్నంలో 'దుడ్డు తీసి అన్నం వేసే సుబ్బరామయ్యర్ గారి అన్నసత్రంలో' ద్వాదశిపారణమహోత్సవం నెరవేర్చి, అరసపాలెగూడులో గిలగిల తన్నుకొని, మెల్లగా బైటపడి, ఉండిఉండి ఉన్నట్టుగా ఆడుమళయాళంలో వెళ్లి పడ్డాడు. అక్కడ ఉండి లోకాతీతమైన తన అనుభవాలను గ్రంథస్థం చేశాడు.

పాపం, సత్యరాజాచార్యులు రంధినగరంలో అడుగుపెట్టేసరికి ఇద్దరు రాణిపోలీసులు అతన్ని పట్టుకున్నారు. కాని పరమదయాళువైన జైలుఅధికారిణి ఘాంఢీభంగిగారికి అతిథి ఐ సురక్షితుడయ్యాడు.

ఆ దేశంలో మూర్ఖులైన పురుషులకు చదువు చెప్పడం, స్వేచ్ఛగా తిరగనివ్వడం మహా నేరతప్పు. కనుక ఆ దేశపు పత్నులు తమ మగలనూ, మగబిడ్డలనూ కఠినమైన రాజకీయోద్యోగాల్లోకి రానివ్వక బుద్ధితో సంబంధము లేని వంట చెయ్యడం, అంట్లుతోమడం, పిండి విసరడం వంటి సుకుమారకృత్యాల్లోనే నియోగించి ఆదరిస్తారు.

అక్కడ దొరతనంవారు సంఘసంస్కారబుద్ధితో పురుషజనోద్ధరణానికి ఒక మగపాఠశాల స్థాపించారు. కాని అది 'సమాజపు గొప్ప తిరుగుబాటు' అయినందువల్ల ఎవరూ హర్షించకపోయినా శ్రీమతి ఘాంఢీభంగిగారి ప్రోత్సాహంమీద సత్యరాజా చదువుకోడానికి వెళ్లేవాడు.

ఇతనికి పాఠశాలలో ఒక్కడే సహాధ్యాయి ఉండేవాడు. అతని పేరు ఖాఢీఫోడ్. అతడు కూడా రోజూ పనిగా బడికివెళ్ళక నోములనీ, వ్రతాలనీ తరచు ఎగగొట్టేవాడట.

ఆ దేశంలో మగవాణ్ణి ఎంతో సుఖపెడతారు. తమ పురుషుల్ని అన్యులు చూడకుండా ఘోషా (గోషా) లో ఉంచుతారు. అంటే పత్నులు కార్యాలయాలకి వెళ్ళేటప్పుడు భర్తలను తమ తాహతునుబట్టి చక్కని విశాలమైన ఇనప్పెట్టెలలోనూ, కర్రపెట్టెల్లోనూ ఉంచి తాళంవేసి వెళ్లుతారు. సాయంత్రం వచ్చి తాళం తీసి దయగా వంటలూ అవీ చేసుకోమ్మంటారు.

పురుషుల్ని ఏమీ ఇబ్బందిపెట్టరు. కాని అది, సోమ వారాల్లో కందిపిలక, పెండలంముంపపూజలు, పన్నికల్లు రుబ్బురోలువ్రతాలూ మాత్రం చెయ్యాలి.

మగపిల్లలకు 'పంఢీ వేఢీభూఢీ'లోని పద్యాలు చక్కగా బోధిస్తారు. అంటే ఇంచుమించు మన కుమారీశతకం వంటిది.

సత్యరాజు నూటు పద్యాలు చదివి తెలుగను వాదంకూడా చేశాడు. దాని ధోరణి ఇలా ఉంటుంది:

"పురుషుండును గార్దభమూ
స్థిరముగు దండనము లేక చెడిపోదు రిలన్"

... ... ...

"అతివలకు స్వేచ్ఛ భూషణ మైనయట్లు
పురుషులకు లజ్జయే మహాభూషణమ్ము"

... ... ...

"ప్రతిదినంబును పురుషుండు పత్నికంటె
ముందుగా లేచి నదిలోన మునిగి జలము
కలశమున దెచ్చి నిజపత్ని కాళ్లు కడిగి
తాను శ్రీపాదతీర్థమ్ము త్రాగవలయు."

పత్ని లేని మగవాడు ౨౦ ఏండ్లకు పైబడిన వాడైతే ముక్కు కత్తిరిస్తారు. గడ్డం, మీసం తీయిస్తారు. అంతే.

జుట్టు తీయించకపోవడానికి కారణం-పత్నులకు కోపం వచ్చినప్పుడు వీరిని పట్టుకు తన్నడానికని కొందరు గిట్టనివారు కల్పిస్తారుగాని మనం నమ్మనక్కర లేదు.

స్త్రీలు నగలు పెట్టుకోరు. పురుషులకే ఇస్తారు. వారు జుట్టు దువ్వుకు పెట్టుకోవడమేకాకుండా మీసం, గడ్డంగూడా దువ్వుకు పెట్టుకుంటారట.

స్త్రీల వినోదానికి కొద్దిగా భోగపురుషులుండడం ఆ దేశానికి అట్టే కళంకం అనవక్కరలేదు.

పత్ని పోతే భర్త సంతోషంగా సహగమనం చెయ్యడం ఆ దేశంలో ఉన్న ఉత్తమాచారాల్లో ఒకటి.

అక్కడ అశాంతి కలిగించే పెద్ద ఉద్యమాలేవీ లేవుగాని, పురుషవిద్యావిషయంలో సంస్కారవాదులకూ, సనాతనవాదులకూ ఒకప్పుడు గొప్ప ఘర్షణ జరిగింది. అక్కడి రంఢీమతాధిపత్ని శ్రీ శ్రీ శ్రీ జగద్గుర్వ్ ఆదిజంఘామంఘారంఘా దేవిగారు విజయంచేసి వ్యవహారం చక్కబెట్టచూచారుగాని సంస్కారవాదులు అవిడగారి శ్రీముఖాలు ఖాతిరీచెయ్యకపోవడం వల్ల చేయునది లేక శ్రీవారు సురక్షిత 'తిరోగమనం' సాగించారు.

సంస్కారులకూ, సనాతనులకూ ఒక సభలో వాదోపవాదాలు చెలరేగి సనాతనసమాజప్రతినిధి శ్రీమతి గంఢీదంఢీగారు చేయించిన సభలో సత్యరాజు బుద్ధి గడ్డి తిని పురుషాభిమానంతో వారికి వ్యతిరేకంగా మాటలాడేసరికి ప్రతిపక్షులు చితకకొట్టి ఆస్పత్రిలో పారేస్తే గురుకటాక్షంవల్ల ఎట్లాగో తేరుకుని స్వదేశం చేరుకున్నాడు.

రెండో భాగం లంకాద్వీపం :

దీన్ని పంతులుగారు దేశీయుల జ్యోతిశ్శాస్త్ర పురాణవిశ్వాసాలమీద మోపెట్టారు.

హఠాత్తుగా సత్యరాజు ఒకసారి లంకాద్వీపంలో వెళ్లిపడగా ఒక భూతంవంటి వ్యక్తి పిల్లి కూనలా ఇతన్ని ఆటకోసం తీసి తండ్రికిస్తే అత డీ కొత్త జంతువును తన యజమానికి కానుకగా ఇచ్చాడు.

సత్యరాజును మొదట పట్టుకొన్న భయంకర విగ్రహం నాలుగేండ్ల కుర్రరాక్షసుడు. ఆ భయంతో ఈ మానవుడు స్పృహతప్పి మెల్లగా తేరుకుని రెండు

చేతులు మారి మూడోచేతిలో స్థిరపడి స్తిమితపడ్డాడు. ఆ యజమాని పేరు మహాకాయుడు.

లంకాద్వీపం కేవలజ్యోతిషభూమి. అక్కడ ఏ విషయం నిర్ధారణ కావలసివచ్చినా 'నీచమైన' హేతువాదం అవలంబించకుండా అక్కడివారు ప్రశస్తమైన శాస్త్రసహాయంతో నిర్ణయిస్తారు.

ఇద్దరు పురాణవేత్తలు ఇతన్ని చూచి బాగా ఆలోచించి కలియుగానికి చెందిన హ్రస్వాంగుడని ఒకరూ, అంగుష్ఠమాత్రశరీరులైన వాలఖిల్యమునుల సంతతివాడని ఒకరూ నిర్ధరించారు.

కాని జ్యోతిశ్శాస్త్రపారంగతులు నలుగురు తమ శాస్త్రజ్ఞానమంతా వినియోగించి ఇతడు మనుష్యుడే అని తేల్చారు.

మహాకాయుడిగారి యిల్లు ఇతన్ని చూచే తీర్థప్రజలతో నిండిపోయింది. ఇంత జనాకర్షణనూ ఊరికే పోనివ్వడమా అని ఈ వింతజంతువుకు దేవతాత్వం కల్పించి మహాకాయుడుగారు మన దేశభక్తుల్లాగనే బాగా డబ్బూ, పలుకుబడీ చేసుకోవడం ప్రారంభించాడు.

దీనికి పంతులుగారు పెట్టిన ముద్దుపేరు 'ప్రసాదమతం'. అక్కడ అందరికీ కామరూపం ఉండడంవల్ల నేరాలు 'లావుగా' జరగడానికి వీలుంది.

ఒకసారి మహాకాయుడితోకూడా వాలఖిల్యుడు న్యాయస్థానానికి వెళ్ళడం జరిగింది.

ఖరుడు న్యాయాధికారి. ఒక 'కేసు' విచారణ జరుగుతోంది. ప్రహస్తుడి భార్య కైకసి వజ్రహస్తుడితో వ్యభిచరించిందని అభియోగం. ఉండీఉండి వజ్రహస్తుడు హఠాత్తుగా ప్రహస్తుడై పోయాడు. ఇద్దరు ప్రహస్తుల్ని, కైకసిని విచారణచేసి నిజం తేల్చాలి.

న్యాయాధికారి నిజంగా ఎవడు ప్రహస్తుడో చెప్పమని 'మహా' ప్రాధేయపడ్డాడు.

'నేరస్థులు' చెప్పలేదు. అతడు విసిగి వృశ్చికరోముడు మొదలైన 'నిలయవిద్వాంసుల్ని' జ్యోతిషశాస్త్ర తేల్చివెయ్యమని ఆజ్ఞచేశాడు.

తన పని అయిపోయింది. ఏం చేస్తాడు మరి? న్యాయపీఠంమీదనే పండితుల నిర్ధారణ అయేలోగా ఒక్క కునుకు తీశాడు.

జ్యోతిషికులు అష్టేమీనమేషాలు లెక్కించి ముగ్గురు ఒకలాగూ, ఇద్దరు మరోలాగూ చెప్పారు. అధికారి న్యాయంప్రకారం లౌకికరీత్యా అధికసంఖ్య మాట పాటించాడు. నిరపరాధికి 'శిక్ష' పడింది. నిజమైన దోషి వజ్రహస్తుడు పరారి అయిపోయాడు.

ఈ 'కేసు' ఇంత సౌభాగ్యోపేతంగా తీర్పు అయ్యాక దూషణుడి నగలపెట్టె ధూమ్రాక్షుడు అపహరించాడనే అభియోగం విచారణకు వచ్చింది. జ్యోతిష పండితులందరూ ఏకగ్రీవంగా ధూమ్రాక్షుడు దొంగ అన్నారు. అతడు 'మొర్రో, ఎరగ' నన్నాడు. శాస్త్రజ్ఞుల మాటకు తిరుగుండదు. నూరు 'సువర్ణాలు' అపరాధం విధించారు. వెంటనే సభ్యుల్లో ఉన్న త్రిశిరుడు తానే తమాషాకు ధూమ్రాక్షు వేషంతో దొంగిలించానని చెబుతూ అపరాధం చెల్లించి ధూమ్రుణ్ణి విడిపించాడు.

జ్యోతిశ్శాస్త్రసహాయంతో లంకలో ఇంత న్యాయపాలనం జరగడం సత్యరాజు చూశాడు.

జ్యోతిశ్శాస్త్రం వట్టి 'జూటా' అన్న నవీనులకీ, శుద్ధనిజం అనే సనాతనులకూ రగడ పెరిగింది. సభలు జరిగాయి. వాలఖిల్యుడు అగ్రాసనాధిపతి. కోపం వచ్చి ఒక ఉపన్యాసకుడు అధ్యక్షుణ్ణి మింగేశాడు. మనవాడు రెండు భూగోళాలంత రాక్షసగర్భగోళమంతా తిరిగితిరిగి తుదకు నాసారంధ్రంలోంచి సురక్షిత 'తిరోగమనం' సాగించి బైటపడ్డా చుక్కలవలె, కర్పూరపు ముక్కలవలె ఇతని కీర్తి లంకలో పాకిపోయింది. త్రిజట ఇతని కీర్తి విని మోహించి దానిద్వారా అంతఃపురానికి రప్పించుకొని తన్ననుగ్రహించమంటుంది. నా కంత శక్తి లేదని వేడుకుంటాడు. విసికి పెట్లో పెడుతుంది. అక్కడ మత్కుణాసురునితో యుద్ధం. మనది ఎప్పుడూ ధర్మపక్షంగనక సత్యరాజు జయించాడు.

పెట్టెలకు దాని హిడింబిద్వారా ఊరుబయటికి ఈడ్వబడి ఒక పెద్దకోతిదయవల్ల భారతభూమి చేరుకుంటాడు

దీనినిబట్టి పంతులుగారు కేవలసంఘసంస్కర్తా, పండితుడే కాకుండా తలుచుకుంటే ఎంతటి కళా సృష్టి చెయ్యగలరో విశదమవుతుంది.

ఆయన హాస్యప్రియత్వం ఈ రచనలో విశృంఖలవిహారం చేసింది.

ఆడుమళయాళంలో శ్రీమతి గంభీదంభీగారు చాలా నిష్ఠాగరిష్ఠురాలని చెబుతూ ఇట్లా అంటారు: "ఆమెకు గల భక్తియుం నింతింత యని చెప్ప నలవి గాదు. దేవతానివేదనము చేయక కల్లయిన త్రావదు. మాంసమైన తినదు. వేయేల? దేవతాసమర్పణము చేసియే వ్యభిచరించును."

లంకాద్వీపపు జ్యోతిషికులకు వృశ్చికరోముడు' ఖడ్గరోముడు అని పేర్లున్నవి. దీనికి పంతులుగారు చెప్పిన కారణం ఇది. వారు రోమకసిద్ధాంతం బాగా అవగాహన చేసుకున్నవారట!

దేశయాత్రలకు బయలుదేరిన పత్రి సత్తిరాజుగారు చెన్నాపట్నంలో బండివాడితో 'అతిగడుసైనవాడు' 'ముక్కాలురూపాయి' ఉక్కారుంగోలు రెండు' ఇస్తానని ఖచ్చితంగా బేరం చెయ్యడం బారిష్టరు పార్వతీశం లాలూకు మద్రాసు ప్రవేశమహోత్సవానికి విఘ్నేశ్వరపూజలా పనిచేసింది.

భాగశాబక బ్రాహ్మణకుమారసమరోపాఖ్యాన వర్ణనం, ఇద్దరు ప్రహస్తుల భార్యాసంవాదం మొదలైన హాస్యపోషకాలు.

పురాణవిశ్వాసాలను వెక్కిరించడానికి భాగశాబక బ్రాహ్మణకుమారసమరోపాఖ్యాన ఫలశ్రుతి, మత్కుణ సురవిజయకథ, మత్కుణమహామంత్ర వర్ణనం సముచితంగా [illegible]

[illegible] విద్యావిషయంలో [illegible] పల్లుదోవ [illegible] లంకకు వచ్చే ఆంజనేయమూర్తిదయవల్ల' సత్యరాజు స్వదేశం చేరుకున్నాడని అజ్ఞానుల దంతకథలమీద ఒక్కదెబ్బ కొట్టి ఈ కథను ముగించారు.

తమ కాలం, తమ ఆందోళనాలూ ప్రతిఫలించేలాగు ఆడుమళయాళంలోనూ, లంకాద్వీపంలోనూ రెండుసభలు చేయించి రెండింటిలోనూ తలఃనితలంపుగా పంతులుగారే ప్రవేశించి వాదించడం చిత్రంగా గమనించదగ్గ విషయం. [ఇంకా ఉంది



# ఆంధ్రవాఙ్మయము - రొమాన్సు

శ్రీ సరిపెల్ల విశ్వనాథశాస్త్రి

ధర్మార్థకామమోక్షము లను చతుర్విధపురుషార్థములను సంపాదించుటయే మానవజీవితముయొక్క ముఖ్యోద్దేశమని మనవారి ఆశయము. ధర్మానికి, మోక్షానికి ప్రమాదం లేకుండా అర్థకామాలను యథాసంభవముగా సమకూర్చుకొని అనుభవించడమే మన సంస్కృతికి పరమార్థము. శృంగారాన్ని రసచక్రవర్తి అన్నారు. కావుననే శృంగారవతి యగు మోహనమూర్తితో కూడియే త్రిమూర్తులు మన ధ్యానపీఠాన్ని అలంకరించారు. ఆ మూర్తిత్రయానికి అతీతమయి, రసస్వరూపిణి జగన్మాత విలసిల్లుచున్నది.

ఆదికవి వాల్మీకిహృదయము మోహముగ్ధమయిన పక్షిజంటలో ఒకదానిని వ్యాధుడు కొట్టగా వేయి వ్రక్కలయింది. అతని శోకం, శ్లోకమయి రామాయణమంత గాథ అయింది. ఆ వాల్మీకి సీతావియోగఘట్టంలో రామునిలో ప్రవేశించి "అపి గ్రావా రోదితి"—చెట్టూ పుట్టా కరిగేటట్టు అతికరుణంగా విలపించాడు. ఆ కన్నీటితో పంచవటీతీరాన గోదావరి పొంగింది. పంపాసరస్సు కలుషితమైపోయింది. వనదేవత వాపోయింది. రామదూత అంజనీపుత్రునిలో ప్రవేశించి, పాపము అనక, పాపము కాదని సమర్థించుకుంటూ, సీతాన్వేషణతత్పరతహేతువుగా సర్వవిధాలా నగ్న శృంగారాన్ని అర్ధరాత్రి రావణాంతఃపురవర్తినుల వర్ణనపట్ల అవలంబింపగలిగాడు. ధర్మబద్ధమయిన రసపిపాస ఉపాదేయము, ఆస్వాద్యము అన్నారు ఋషులు.

రొమాన్సు అనే పదం శృంగారపరంగా తరుచు వాడుతున్నారు. రసపరంగా, ఆనందపరంగా, సౌందర్యపరంగా, నవ్యవిలాసరచనాపరంగా, అద్భుతపరంగా కూడా దాన్ని వాడుతున్నారు. ఆంగ్లనిఘంటువు ఇన్ని స్వరూపాలు ఆ పదాని కిచ్చింది. లాటిన భాషాపరంగా ఈ పదం వాడుకలోకి వచ్చింది. ఇది మనకు పశ్చిమలనుంచి దిగుమతి అయింది. ఇట్టి భావముల పేటికలను రొమాంటిక్ వాఙ్మయము, గద్యలు, నవలలు అన్నారు వారు. దీని కత్యంతసన్నిహితమయిన పదము రసము అని మన మనవచ్చును. రసమయమయిన యీజగత్తులో శృంగారము రసాధిదేవత కావుననే "**Love is God, God is Love**"—ప్రణయమూర్తి ఈశ్వరు డన్నాము. రసములన్నియు ఆస్వాద్యాన స్థలో ఫలస్వరూపంలో ఆనందజనకములే, రసమయములే, శృంగారతుల్యములే. ఈ తత్వదృష్టితోనే రొమాన్సు అనే పదమును శృంగారతుల్యముగా గ్రహించుచున్నారు. ౧౭౯౮ తర్వాతనే ఈ పదస్వరూపము, ఆయా వాఙ్మయస్రవంతులు మనవారు చదివి పూర్వసంప్రదాయగ్రంథముల ప్రౌఢరచనాగర్భముల అర్థాని స్వరూపము అనంతముగా నుండుట తెలుసుకొని ఆ సంప్రదాయభావములు రసతరంగములుగా, గేయములుగా నేటివారి కాపాతమధుర ఫణితి అందించినారు.

రొమాన్సు అనే పదాన్ని ముఖ్యంగా రసపర్యాయంగా గ్రహించాను. ఆంధ్రవాఙ్మయంలో ప్రణయస్వరూపాన్ని నిర్ణయించాలంటే సంస్కృతచ్ఛాయ కొంత చవిచూడాలి. వాఙ్మయంలో రసభావస్ఫురణమే ఆనందజనకము. వేదఋషుల ఋగ్గీతాలు సమాలోచనచేయగా ప్రకృతిలోని సౌందర్యస్ఫూర్తి రసస్ఫూర్తిగా వారి వర్ణనలలో ప్రతిబింబించింది. ఉష, ఇంద్ర, అగ్ని ఇత్యాదిదేవతల వర్ణనలలో ఇంద్రియవృత్తుల నావర్జించుకొని, కన్నులు మిఱుమిట్లు గొల్పు మూర్తు లుజ్జ్వలితము లయినవి. ఆ దివ్యసౌందర్యమూర్తుల విలాసములే వాల్మీకి పాత్రలలో ప్రతిబింబించినవి. ధర్మకంచుకము ధరించిన శ్రీరాముడు సీతావియోగదశలో సర్వప్రకృతిని రసమయంగా చూడగలిగాడు. ఎక్కడ చూచినా తన ప్రణయతత్వాన్నే, తత్సాదృశ్యాన్నే తిలకించాడు.

ఆ ఛాయలలో కావ్యా లనువదించిన ఆంధ్రకవులు నన్నయతిక్కనాదులు వీరశృంగారాన్ని పెదజల్లారు. వ్యాసుని ద్రౌపదీసత్యలు నన్నయతిక్కనల

చేట తెనుగుపుత్రికలై కృష్ణరాయని దిగ్గజాల రచనలకు ఒరవళ్ళు దిద్దారు. రాధికాసాంత్వనంలో జయదేవుని రాధికాప్రణయము ముమ్మూర్తులా చిత్రించబడింది. అయ్యది నగ్నమై, తీవ్రవిమర్శనలకు గురి అయింది. కాగా ౧౮౭౫ ఇవేళల ఆంగ్లవాఙ్మయం అవలోకించిన ఆంధ్రరచయితలకు 'రొమాంటిక్ రివైవల్' ఇత్యాదిపరవాఙ్మయప్రసంగముల మూర్తులే దేశీయ వాఙ్మయంలో జీవనాడిక లుజ్జీవించి యువయువతుల భావాలు ఏలుకున్నాయి. ముత్యాలసరాల్లో, ఎంకిపాటల్లో, కిన్నరనృత్యాల్లో, యువగీతాల్లో, ఏకాంతసేవల్లో, లలితమూర్తులలో ముగ్ధప్రణయము, భక్తిప్రణయము రేకెత్తింది. రచనలోనూ, వస్తుగ్రహణంలోనూ సమానంగా నూత్నపద్ధతులలో ముందంజ వేశారు. లవణరాజుకథలో, పూర్ణమ్మ పాటలో, కన్యకలో, సంఘసంస్కారం వెన్నెముకగా శృంగారం చెన్నుమీరింది. లవణరాజు మాల అన్నదాని కర్థం లేదని కన్నియను స్వీకరించడంలో ఆచారతిరస్కారం చూపట్టినా రసభావవిలాసములు తొల్కాడినవి. వసుచరిత్రకారుడు కోలాహలునిచే నిర్బంధింపబడిన శుక్తిమతీవిహ్వలత్వము శ్లేషగంభీరప్రవంతిలో రసస్ఫూర్తి ఆపాతమధురం కాదు. అర్ధోన్ముక్తమయిన నాయికాభ్రంశాలు నిమ్నతరంగవళ్ళల్లో దాగిపోయాయి. విశ్వనాథకవిరాట్ కిన్నెరసానిపాటల్లో, నడకల్లో, నృత్యాల్లో, అంటక ముట్టక దూరాన్న కదలి రాజు ఆశాదృష్టిలోనే ఉద్వేజితమయి కిన్నెరస్వరూపమునకు తెనుగుపిట్టల స్నిగ్ధహృదయాలు కలిగిపోయాయి. నా లలితమధురమగు శతకంలో పూజా ప్రణయ సూత్రాలు మాలికాస్వరూపాన్ని ధరించాయి. రవికవి గీతాంజలి ప్రపంచభాషలో ముగ్ధమోహనమూర్తిపరిసేవవిలాసాలు పారాలు మీరితే, ఆంధ్రయువగీతాల్లో, నీరాజనాల్లో, ఏకాంతసేవల్లో వస్తువు ఏరసము ఆలంబనముగా ప్రకటితమైనను, శృంగారము రసాధిదేవతగా భాసిస్తోంది. ఏరూపంగానైనా నవ్యతే రొమాన్సు అనికూడా అనవచ్చు. అగురువత్తినిగూర్చి కవివాక్కు వాసిస్తే అది రొమాన్సు అనవచ్చును.

కవిత్వం భావప్రధానం కాగా, రచన రసపోషకం అవుతుంది. వస్తువుయొక్క మూర్తి స్నిగ్ధ, గంభీర, మధుర, లఘుమూర్తిభేదములతో రచన ఆలంబనంగా, విలాసానుగుణంగా మారుట సహజము. ఉదాత్తవస్తువు లఘుతరవాక్కులలో రసస్ఫూర్తి తాల్పనేరదు. రసాస్వాదనతత్పరులైన పాఠకులలో మున్ముందు చిత్తసంస్కారము ఉదాత్తమై నిల్చినచో, కావ్యమెన్నిరూపముల తలదాల్చినను, వారి చిత్తనైర్మల్యము వికృతి పొందింపజాలదు. ఈ ప్రధానసూత్ర మీనాడు కాదని మఱచి, పాఠకుల కర్థమయ్యేటట్టు మామూలుభాషలో కావ్యాలు వ్రాయాలనే ధోరణి సామాన్యంగా లేవదీశారు. ఈ వాదం చేపట్టినవారిలోనే అనంతంగా భేదాభిప్రాయా లున్నాయి. వారి కర్థము కానవసరంలేదు. వారినిగూర్చి, పామరజనజీవితాన్ని గూర్చి వ్రాసిందే ప్రజాసారస్వతం అవుతుంది. అది వారి ఆనందంకోసమే వ్రాయాలనీ, అందుచేతనే భాష, భావాలు వారి కందుబాటులో ఉండాలనీ కొందరంటే భాష ఉదాత్తంగా ఉన్నా మంచిదే, వస్తువు వారికి సంబంధించింది అయితే చాలని ఇతరు లంటున్నారు. వాదనకై ఎవ రేమన్నా కావ్యం ఆనందంకోసమే పాఠకుడు చేపట్టజూస్తాడు. కాబట్టి విలాసము, శృంగారము మానవహృదయాల కందుబాటులో ఉండేలాగ వ్రాయాలని ప్రధానంగా సూత్రీకరించి ఆ తీరుననే పలువురు వ్రాస్తున్నారు. తిరుపతికవుల శ్రవణానందం శ్రుతులకు కలనినాదం. రాయప్రోలువారి కావ్యాల్లో శృంగారం తత్వం అంటున్నారు వారి కావ్యాలకు వ్యాఖ్యాతలు. వారుదానికి ధన్యవాదాలిచ్చారు. ప్రకృతి పూజాస్థానాన్ని ఆక్రమించింది ఆనాటి వేదగీతికలలోని భావాలే. ఈనాడు వారు తమ కావ్యాల్లో అది ప్రతిపాదించా రంటున్నారు కొందఱు. ఇయ్యది సాధనాస్వరూపంలో సిద్ధమూర్తులయిన సంతో

ఎ.మే. వాక్మాత్రఛాయామూర్తులయిన ప్రయోజనము శూన్యము. ఆ సత్యము రసహృదయములకు మాత్రమే తెలియగలయది.

ఆనాడు పరకాంత కనుల కడ్డమైనచో మాతృభావము చేసి మరలుచుండ, ఈ నాడు మాతృభావములో లెస్సగ నుపలక్షించి నమస్కరించవచ్చునన్నారు. కొందరు కరచాలనాదులతో సమ్మానించనూ వచ్చు నంటున్నారు.

కావ్యం, సంప్రదాయసిద్ధమయిన రీతినే ఈ నాడున్నా పశుదశావరణం దాటడానికి సాధన అన్నారు. వెంటనెంటనే ఆనందము పరమప్రయోజనంగా కలది కావ్యం అన్నారు. ఈ రెంటి మధుర సమ్మేళనమే సర్వోత్కృష్టమైన కావ్యప్రయోజనం అవుతుంది. 'Delightful instruction' అనేదే సారమాత్రము. ఆ హృదయముతోనే కావ్యసంపుటులు, ఖండికలు, గేయాలు పాఠకులు విప్పాలి. అప్పుడే మధువు నింపి సుగంధము దిక్కులు నిండ హృత్పద్మాలు వికసిస్తాయి.

అమరకవి గురజాడ వారు సంస్కారప్రియత్వంతో కావ్యాలు వ్రాశారన్నాం గదా.

పూర్ణమ్మ అను గీతికలో—

"కాసుకు లోనై తల్లీ తండ్రీ
నెనరూ న్యాయం విడనాడి
పుత్తడిబొమ్మను పూర్ణమ్మను వొక
ముదుసలి మొగుడికి ముడివేస్రీ"

అన్నాడు.

కన్యక అన్నదాన్లో—

"కులం పెద్దలు కూడి రదిగో
అగ్నిసాక్షికి అగ్ని అదుగో
కన్ను కోరిన కన్నె యిదుగో
జాలమేలాకో ?"

ఈ ప్రశ్నార్థం ఎంత ముగ్ధం, మనోహరం, గంభీరం!.

లవణరాజు—

"మాల యనువా రున్న వారల
మందబుద్ధికి వగవవలె
ముద్దిడి కురులు దువ్వితి
తాళవనమును వెడలి చంద్రుడు
పక్కనను నవ్వెన్"

ప్రకృతి, పాత్రలభావాల కనుగీతి యిస్తుంది ప్రాచీనభావం.

"అమలకమలము హాసియించు ఆననము
విరి రాణి అందంబు వీక్షించుచుంటి"
"ఆకులో ఆకునై పూవులో పూవునై"
మండపాకపార్వతీశ్వరుని విరిసెజ్జ—
"మా తోటలో నొక్క మందార చెట్టు
ఆ చెట్టుచెంతనే అమృతంపు బావి
అడవిమల్లియతీవ ఆబావిక్రేవ
ఆమల్లెతీవతో నాడుకొనుచుంటి."

వేంకటపార్వతీశ్వరకవుల ఏకాంతసేవలో—

"నా మెలంగుతోట నామాటలో పేట
నా వరాలకొంగు నా వెలుంగు
నావయాళి తేప నాచూపులో పాప
నిలుచుగాక తన్ను గొలుచుదాక."

పూజాప్రణయము—

స్వీయగేయం—

"పోకు పోకు రాధా, యమునఒడ్డు రాధా
యమున నలుపు, ఒడ్డు నలుపు, నింగినలుపు,
చాయ నలుపు, నీమనసు నలుపు.
పోకు పోకు రాధా."

లలితా శతకంలో—

"వలపుందీవలు హృద్విపంచి నదరన్
బల్కింపనీకన్న న
న్యాలకున్ శక్యమ—
మలలన్ రమ్యలతాగృహంబుల విరుల్

మందానిలోద్ధూతమై
కలయక్ రాలిన సజ్జ మే నడర నా
కల్పించ నీ రూపముల్
బులకల్ గ్రమ్మ ముదశ్రువుల్ దొలుక నా
భోగంబవై గ్రాలవే !"

లలితా—

"నిలుపక్ బాహ్యకటాక్షదృక్తట రుచుల్
నీపైన వాసంతమేక్"

మానసబోధలో—

"మానసరాజహంస చను
మా వినువాకకు బ్రొద్దుగ్రుంకెడిక్"
"మనమా, పద్టిక నాదు మాట వినుమా
నుర్యాద గాపాడుమా"

ఈతీరున కమ్మగా, హాయిగా, కంటికి, మనసుకు తాకేటట్టు నూతనశ్రుతులతో రచించే అన్ని రచనలనూ రొమాన్సు అనవచ్చు. ఈతీరున చెప్పగలిగితే ఏ రస మయినా శృంగారతరంగమయి, అవ్యక్తమధురమయి, ఆనందజనక మవుతుంది. ఇట్టి రసవద్భావమను అర్థం చేసుకునే పాండిత్యం, అభిరుచి సంపాదిస్తే, రొమాన్సు వేదాల్లో, ఉపనిషత్తుల్లో, ఆదికావ్యాల్లో ఉంది. ఆ పాండిత్యం కష్టసాధ్యం. కాబట్టి ఆ సారస్వత సంప్రదాయాలే నేటి యువయువతుల గీతాల్లో సులభంగా ఆస్వాద్యంగా ఉన్నాయి. ప్రయత్న పడి అవి చదవండి. ఎటయినా, కావ్యం రస పిపాసతో చేపట్టినచో చిత్తసంస్కారంతో పాటు ఆనందాన్నే యిస్తుంది; అందరికీ కావలసింది అదే కదా. రసాత్మకమయిన వాక్యమే కావ్యము కాగా రస మయఖండికలు కావ్యాలు కావనగలమా !



# వేదకాలమందును వ్రాత గలదు

శ్రీ తెన్నేటి విశ్వనాథం

వేదములు పుట్టిన కాలమందు మన దేశములో మాటయేగాని వ్రాత లేదని ఒక ప్రబలమైన నమ్మకము ప్రచారములో ఉన్నది. ఈ వాదమును బలపరచుటకు చెప్పు కారణములు:

(౧) అంత పాతకాలమందు వ్రాత ఉండగలిగి యుండునా?

(౨) వేదమందు లిపి అనే మాట లేదు.

(3) వేదములకు శ్రుతి యని పేరు; అనగా కర్ణశ్రుతిమైనవే గాని చక్షువునకు కనిపించే వ్రాతలో లేవవి; అందుచేతనే వేదము గురువుదగ్గర చెప్పించుకోవడమేగాని, చదివి నేర్చుకొను ఆచారము మన దేశమందు లేదు.

ఈ వాదములో బలము లేదనిన్నీ, వేదములో, ఉపనిషత్తులలో ఉన్న మాటలనుబట్టి అంతస్సాక్షికి, అంతశ్చక్షువునకు కనిపించి వినిపించిన మాటనే వేదకవులు వ్రాసేరనిన్నీ, అట్టి వ్రాతలకే శ్రుతు లనిపేరు అనిన్నీ, అవియే ఇప్పుడు మనకు లభ్యమైన గ్రంథములు అనిన్నీ నా విశ్వాసము.

క్రీస్తు పుట్టిననాటికి, మొహమ్మదు పుట్టిననాటికి వారి జన్మదేశములలో వ్రాత భాష లేదని ఎవరును అనలేదు. కాని వారు కూడ 'రెవలేషను' అంటే శ్రుతివాక్యములనే వచించేరు. 'వచించేరు' అని చెప్పుటచేత ఆ కాలమందు వ్రాత లేదని వాదించుటలో సందర్భము లేదు; నిజము కాదు కూడాను. భాష ఇప్పటివలెనే వ్యుత్పత్తిఅర్థమే కాక వాడుకవల్ల కలియవచ్చి రూఢిఅయిన అర్థమూ భావముతో అనాదినుండి వాడుకలో ఉండియేతీరవలెను. బమ్మెర పోతన్న భాగవతంబు...చేసెను అని వ్రాసినప్పుడు పోతనకాలమందు వ్రాత లేదని అనుకొనుటకు ఎలాగు వీలులేదో, మొహమ్మదు సూరాలను నిర్వచనము చేసిన కాలములో వ్రాత యెరుగరు అని అనుకొనుటకు ఎలా వీలులేదో, బైబిలులో రెవలేషను అని చెప్పినప్పుడు అప్పటికి వ్రాత లేదని ఎలాగు అనుకొనజాలమో, ఆలాగుననే వేదములు శ్రుతులు అని చెప్పినప్పుడుకూడ వ్రాత జ్ఞానము ఆ రోజులలో లేదని వాదించలేము.

గురుముఖముగా వేదము నేర్చుకోవడమే వ్రాత లేదన్న వాదానికి తార్కాణము అని చెప్పే వాదములో అసలే బలము లేదు. నాడు, నేడుకూడ వేదము నేర్చుకోదలచుకున్నవారు గురుముఖముగా చిన్నతనంలోనే, కంఠము స్వరము స్వాధీనముకాని వయసునుండిన్నీ నేర్చుకుంటున్నారు. పుస్తకాలు చదివి అధ్యయనము ఎవరూ నేర్చుకొనరు. కారణము సులభగ్రాహ్యము. మాత్ర, బలము, స్వరము, ఉచ్చారణ సరిగా అలవడుననిన్నీ, అక్షరమునకు ఎంత విలువ ఉన్నదో శబ్దమునకుగూడ అంత విలువ, అర్థము ఉండుటచేతనున్ను గురుముఖముగనే నేర్చుకుంటున్నారు. అచ్చు ఉన్న ఈ రోజులలోనే ఆలాగయినప్పుడు, అచ్చులేని

ఆరోజులలో తప్పకుండా ఆవిధముగనే అయియుండలి. బడిలోనికి పంపకపూర్వమే, అక్షరాభ్యాసము చేయకముందే, మనము పిల్లలకు కొన్ని పద్యములు, శ్లోకములు నేర్పటలేదా? దానివల్ల వ్రాత లేదని వాదింతుమా?

సరి. శ్రుతి కర్ణ శ్రుతంగా ఆనుపూర్వ్యేణ మనకు లభించినది అని చెప్పినప్పుడు స్మృతులు జ్ఞానేంద్రియముద్వారా మనకు లభించినవని వాదించాలి; స్మృతుల కాలమందుకూడా వ్రాత లేదని వాదించాలి. కాని అట్టి వాదము ప్రచారమున లేదు.

ఋగ్వేదములో ఈసూక్తముచూద్దాము:

"గాయత్రేణ ప్రతిమిమీతే
అర్కమర్కేణ, సామ త్రైష్టుభేన వాకం
వాకేన వాకం, ద్విపదా
చతుష్పదాక్షరేణ మిమతే సప్తవాణీః."

అంటే, "గాయత్రితో మంత్రమున్నూ, మంత్రముతో సామమున్నూ, రెండునాలుగు పదములు (గల వాక్యములతో) అను వాకమున్ను కొలుచుచున్నాడు; (అనగా నిర్మించుచున్నాడు) ఇట్లు ఏడువిధములయిన ఛందములు అక్షరములతోనే నిర్మాణమగుచున్నవి" అని తాత్పర్యము.

యజుర్వేదములో ఈ అనువాకము చూద్దాము:

"అగ్నిరేకాక్షరేణ వాచ ముదజయత్. అశ్వినౌ ద్వ్యక్షరేణ ప్రాణాపానా వుదజయతాం. ... సప్తదశాక్షరేణ సప్తదశగ్ంస్తోమ ముదజయత్"

అని ఉన్నది. 'అశ్రావయ' ఇత్యాది సప్తదశ అక్షరములు గల మంత్రసముదాయమందు ఏకాక్షర, ద్వ్యక్షర ఇత్యాది భావనచే ఆయా మంత్రములను పఠించి తత్సామర్థ్యమువలన అగ్న్యాదిదేవతలు వాక్కు మొదలగువాటిని జయించిరని తాత్పర్యము.

మరి, మాండూక్య ఉపనిషత్తులో మంత్రాలు చూద్దాము:

"ఓమిత్యేత దక్షర మిదగ్ం సర్వం తస్యోప వ్యాఖ్యానం. భూతం భవ ద్భవిష్య దితి సర్వం ఓంకార ఏవ; యచ్చాన్యత్త్రికాలాతీతం తదపి ఓంకారఏవ..."

అంటే, "సర్వమున్ను ఓం అను అక్షరమే. దాని వ్యాఖ్యానం (చేయబడును); భూతము, వర్తమానము, భవిష్యత్తు అంతా ఓంకారమే. ఇంక ఈ మూడుకాలములకు అతీతమైు ఏది కలదో అదిన్ని ఓంకారమే." అని అర్థము.

"సోఽయ మాత్మా, అధ్యక్షర మోంకారోఽధి మాత్రం పాదా మాత్రా మాత్రాశ్చ పాద అకార ఉకారో మకార ఇతి."

అర్థము: "అక్షరములలో ఉత్తమమై మాత్రాయుక్తమైన ఈ ఓంకారము ఆత్మయే. ఓంకారముయొక్క మాత్రభూతము లగు అకారాదిమాత్రలు (ఆత్మకు) పాదభూతము లగుచున్నవి."

తైత్తిరీయోపనిషత్తులో మరి ఒకటి చూద్దాము:

"శీక్షాం వ్యాఖ్యాస్యామః, వర్ణః స్వరః, మాత్రా బలమ్, సామ సన్తానః, ఇత్యుక్తః శీక్షాధ్యాయః."

శిక్ష అనగా వ్యాఖ్యానిద్దాము. (అకారాది) వర్ణము, (ఉదాత్త అనుదాత్త) స్వరము, (హ్రస్వదీర్ఘప్లుత) మాత్ర,

(ఉచ్చరింపవలసిన) బలము, సమోచ్చారణ, విలంబన లేక ఒక అక్షరము తరువాత మరియొకటి వరసగ చేర్చి పలుకుట—వీటి వివరణమే శిక్షాశాస్త్రము. వర్ణము, అక్షరము రెండును పర్యాయపదములు. నేను ఓనామాలు నేర్చుకొన్న కాలములో 'అక్షరాభ్యాసము' అయినప్పుడు మా అయ్యవారు 'వర్ణములే' నాచేత ఇసుకలో వ్రాసి దిద్దించేవారు.

అక్షరము, శబ్దము విలక్షణపదములు కాబట్టి అక్షరమునకు పై చెప్పిన శ్రుతి పాఠములందు పూర్ణమైన విలువ ఇవ్వనలేము.

శిక్షాశాస్త్రముగాక, ఛందశ్శాస్త్రము వివరముగా వేదములో ఉదహరించారు. వేదసూక్తములలో 'పూర్వేభిః ఋషిభిః' అని వేదములకు పూర్వము ఋషులు ఉన్నట్టుకూడా చెప్పారు. శిక్ష, ఛందస్సు, స్వరం, వర్ణం, బలం, మాత్ర మొదలుగా గలవి ఉన్నకాలములో వ్రాత లేదనిన్నీ, అచ్చువేసినట్లయిన వేయి రెండువేల పుటలకు వచ్చే వేదవాఙ్మయమంతా నోటి మాటగానే వేలకొద్ది సంవత్సరాలు గాలిలో శబ్దముగా ఉండేది అన్న వాదము ఊహాతీతమైన విపరీతము. నాదబ్రహ్మ, అక్షర బ్రహ్మ అను పదసముదాయముకూడ శ్రుతులందే కనబడుచున్నదిగదా.

అకార, ఉకార, మకారములు అనే మాటలు అక్షరములపరముగాక, ఇతరముగా వాడుటకు అవకాశము లేదు. ఇప్పుడు బడులలో గుణింతము చెప్పునప్పుడు అకారము, కకారము మొదలయిన మాటలతోనే చెప్పుచున్నారు. భగవద్గీతాకాలమందు "అక్షరాణాం అకారోఽస్మి" అన్నదాన్నిబట్టి ఆ రోజులలోను 'కారము' అక్షరపరముగానే వాడేవా రని నిశ్చయము. అందుచేత మాండూక్యోపనిషత్తుకాలములో కూడ 'అకార ఉకార మకార ఇతి' అని వాడినప్పుడు ఆ విధముగానే వాడేరని ఒప్పుకోవాలి.

మాండూక్యోపనిషత్తు దశోపనిషత్తులలోనిది; వేదములో ఒక అంశమై వేదవ్యాసుని కాలమందు, సంహిత, జ్ఞానకాండ వేరు చేసి సంస్కరింపబడినపుడు (అనగా ఆధునికభాషలో ఎడిటుచేసినప్పుడు) ఈ ఉపనిషత్తుకూడ ప్రత్యేకింపబడినది. వేదములు కర్ణశ్రుతములయిన కాలమందు చక్షుర్దృశ్యములై కూడ ఉండెను అని తేలుచున్నది.

లిపి అనే మాట వేదమందు లేదు, అందుచేత అక్షరములు ఆ కాలములో లేవు అన్న మాటలోకూడ బలము లేదు. లిపి అనగా అక్షరామ్నాయము అని సహజముగా ధాతువుఅర్థమున్నదా ? ముద్రణాలయములు వచ్చినతరువాత లిపి అన, అక్షరములు వాటి దృశ్యరూపము అనే అర్థము ఆ మాటకు క్రమేణ చేరినది. . లిపియొక్క ధాతువు వేద కాలమందుకూడా ఉండెనుగదా. 'న కర్మ లిప్యతే నరే' అని కఠోపనిషత్తులో కనిపిస్తున్నది మొదటిలోనే.

అక్షరము, అక్షరములు, అకారము ఇత్యాదిపదములే ప్రత్యక్షముగా శ్రుతులలో కనిపిస్తూంటే అవి లేవు, ఇవి లేవు, అందుచేత ఆ రోజుల్లో వ్రాతయే లేదు అని వాదించుట అర్థరహితమైనది.

ఇంగ్లీషుభాషలో 'ఆల్ఫాబెట్టు'అను మాట ఉన్నది. ఆమాట గ్రీకుభాషనుండి ఇంగ్లీషు

వారు క్రిస్టైనాన్ను కాలములో తీసుకుని వాడుకుంటున్నారు. 'ఓనామాలు' అన్నట్టే 'ఆల్ఫా, బీటా' కలిసి 'ఆల్ఫబెట్టు' అన్నారు. అయితే ఇంగ్లీషులో ఈమాట వాడక పూర్వము వ్రాత లేదని ఎవరు అనగలరు?

ఇంతకును ఈ విపరీతార్థములకు, విపరీతమైన ఊహలకు కారణము వేరు.

గతశతాబ్దములో పాశ్చాత్యుల ప్రాబల్యము ప్రపంచమందు హెచ్చయినది. వారు చెప్పినది, వ్రాసినది నిజముయి తీరాలి అని ఒక విశ్వాసము బయలుదేరి వారి ప్రాబల్యాం హెచ్చయినకొద్దీ ఆ తప్పునమ్మకము దృఢపడినది.

వారి సంప్రదాయములు, వారి విశిష్టతనుమించి వేరే గొప్పవిషయములు పురాతనమందు ఉండిఉండవని వారి ఊహ. ముఖ్యముగా ప్రాచ్యదేశములందు అసలే ఉండవని వారి అహంకారము. ఆ అహంకారమును ఆధారము చేసికొని భాషవిషయమయి, చరిత్రవిషయమయి అనేకులు వారి కోవిదులు వ్రాశారు. కష్టపడేవారు; చాలా సంగతులు మనవి విశదీకరించారు; కృతజ్ఞులము. కాని భాషాజ్ఞానము చాలమి చేతనున్నూ, స్వవిశిష్టతాహంకారమువల్ల పుట్టిన సంకుచితదృష్టి చేతనున్నూ పాశ్చాత్యవిశిష్టతకు భంగము అని తలచినప్పుడు అపార్థము తెలియకుండానే వారు చేసేవారు. "త్వం సుమేమం మహాయాన్స్వర్విదం" అని ఋగ్వే-

దంలో ఎదురుగుండా కనిపిస్తూంటే, గ్రీకులు ఇండియా దేశం వచ్చేవరకు, వారి భాషాప్రసాదము మనకు ఇచ్చేవరకూ మనకు రాసుల పేర్లు లేవని వ్రాశారు. శ్రీ గొబ్బూరి రాఘవరావుగారి వ్యాసములను భారతిలో చదివినట్లయితే ఇటువంటి విషయములు చాలా మనకు అవగాహన కాగలవు.

భాషావిషయమయి కూడా ఇట్లే వారు వ్రాసినవ్రాతలు ఆధారంచేసికొని మనవారు కూడ "వేదకాలంలో వ్రాత ఏమిటండీ" అని అపనమ్మకం పడ్డారు. దీనికి తోడు "వేదము అపౌరుషేయం" అనే గొప్పచెప్పకోవడం ఆ అపనమ్మకమును బలపరిచింది. కాని శ్రుతులలో ఉన్న మాటలను సరిగా చూచి, ఆ మాటలకు సహజమైన అర్థము ఇచ్చినట్లయితే వేదకాలములో వ్రాత లేదనుటకు అవకాశము లేదు. వ్రాత అనే మాటకు మాత్రం వ్యుత్పత్తిఅర్థము చూస్తే ఇప్పుడు మన మిచ్చే అర్థ మెక్కడ ఉన్నది? వ్రాత - వరుస(గల) సమూహము—ఇంతే గదా. 'సన్తానః' అని దీనినే తైత్తిరీయంలో శిక్షాధ్యాయంలో పూర్వులు వాడేవారు. మనము వాడేమాటలకు మనమిచ్చే అర్థము ఇతరులుకూడ ఇవ్వవలెను అని మన అభిలాషగదా. అలాగుననే ఆనాటి భాషకు కూడ ఆనాటి కవులు ఇచ్చిన అర్థమును మనము గ్రహించవలెను. ఆలాగు గ్రహించినయెడల వేదకాలమందు నిస్సందేహముగ వ్రాతనేర్పు గలదని విశ్వసింపవచ్చును.

# మహాకావ్యలక్షణము

**శ్రీ పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి**

మహాకావ్యలక్షణ మనగనే ఆలంకారికులు, విమర్శకులు అష్టాదశవర్ణనలను ప్రప్రథమమున నిర్దేశించుట కలదు. శైల, యాన, ఋతు, జల, ఉదయాస్తమయోద్యానవిహారాదు లీ అష్టాదశవర్ణనలు.

ప్రకృతిలోని సన్నివేశములనుగాని, వ్యక్తుల మనఃప్రవృత్తులనుగాని, వ్యక్తుల రూపరేఖలనుగాని చిత్రించుటయే వర్ణన. అనగా జగన్నిష్ఠములగు విషయములలో ముఖ్యమైనవాని నేరికొని కవి చిత్రించును. కాగా కావ్యము ప్రకృతికి అనుకృతి కాగలదు. ప్రకృతిలో స్వభావసిద్ధములుగా నున్నవానిని పునః చిత్రించిన నివి కృతకములగుటచే స్వాభావికరామణీయకములు కాజాలవు. కావుననే అనుకృతి నుద్దేశించు కవులను ప్లేటో (Plato) బహిష్కరించినాడు.

కావ్యము జగదనుకృతి యని భరతుడు సహితము వచించినాడు.

"లోకవృత్తానుకరణం
నాట్యమేత న్మయా కృతమ్" (౧-౧౦౯)

"సప్తద్వీపానుకరణం
నాట్యే హ్యస్మిన్ ప్రతిష్ఠితమ్" (౧-౧౧౬)

"కృతానుకరణం లోకే
నాట్యమి త్యభిధీయతే". (౧-౧౧౯)

ఈ వాక్యములలో లోకమునకు అనుకృతియే కావ్య మనినను, ఇతరస్థలములలో కావ్యమును త్రిలోకముల భావానుకీర్తన మని (౧-౧౦౪), సర్వకర్మానుదర్శకమని (౧-౧౪) నిర్వచించినాడు. పైగా లోకధర్మికన్న విలక్షణమైనది నాట్యధర్మి అనినాడు. అనగా కావ్యము ప్రతీయమానమగు జగత్తు నాశ్రయించుకొని సముద్భూతమైన తద్విలక్షణముగా సంకేతిస్తుడు. ఛ. నైలక్షణ్య మున్నచో అనుకృతి పొసగదు.

అనుకృతి యగు వర్ణన ఆనందమును శాశ్వతముగా నొసగలేదు. పికశ్రుతి సర్వదా మనోజ్ఞమే. కాని కోకిలారావము ననుకరించు మానవుని శ్రుతి కొంత కాలమైన తర్వాత నైనప్పటికిని విసుగు పుట్టించకపోదు. అనగా అనుకృతిలో స్వాభావికత్వము కాని, మనోజ్ఞత్వము కాని లేవు.

అనుకృతిలో భావ (Matter), రూపములు (Form) వేరుచేయబడుచున్నవి. భావము జగన్నిష్ఠము. దానిని కావ్యగతము చేయుటలో నూతన రూపము తీసికొనిరాబడుచున్నది. కాని భావరూపములు అవిభజనీయములు, అనన్యత్వలక్షణలక్షితములు. పైగా రూపనిష్పాదనయే వర్ణనాత్మకమగు కావ్యమున ప్రధానమగుటచే కవియొక్క హస్తవిన్యాసమే ముఖ్యమగును. అనగా మాతృకను సరిగా చిత్రించగలిగినాడా, లేదా అనునదే కావ్యమున విచారణీయవిషయ మగును. ఇదంతయు అనుభవమునకు బహిర్భూతము.

కావ్యమందలి రసానుభూతి భావరూపములపై నాధారపడియున్నది. అనగా భావము రసముతో సమన్వయము నందవలెను. కాని వర్ణనయే కావ్యముయొక్క లక్షణ మనినచో వర్ణన ఆపాదించు హస్తవిన్యాసమే రసప్రతీతి నీయగలిగి ఉండవలసివచ్చును. సర్వదా రసప్రతీతివిఘ్నములలో మొట్టమొదటిది వర్ణన. శిశుపాలవధలోని పర్వతాదివర్ణనలు, నైషధీయచరితలోని దమయంతీవర్ణన, కావ్యప్రబంధములలోని ఉపాలంభనాదులు రసప్రతీతివిచ్ఛేదకములుగా నెంచబడుచున్నవి. వసుచరిత్రలోని వర్ణనలలో మానసిక

మగు 'వస్తు' శాబ్దీభావనచే ప్రతీయమానమగుచు, రస ప్రతీతిని ఉన్మీలించునని చెప్పకతప్పదు.

౨

వర్ణన కావ్యమున ప్రధానముకానిచో, కావ్య విషయ మేమని ప్రశ్నించవచ్చును. తౌతభట్టు—

"నానృషిః కవి రిత్యుక్తం కవిశ్చ కిల దర్శనాత్
విచిత్రభావధర్మాంశతత్త్వప్రఖ్యాచ దర్శనమ్
దర్శనా ద్వర్ణనా చ్చాథ లోకే దృష్టా కవిస్మృతిః"

అనినాడు. అనగా "ఋషి కానివాడు. కవి కాలేడు. దర్శన కలవాడు కవి. ప్రతీయమానవ్యావహారికజగత్తును పరిశీలించి, అందు అంతర్లీనమై, తదాధారహేతువగు తత్త్వమును ప్రత్యక్షముగా, వ్యక్తముగా అనుభవించుటయే దర్శన. ఇట్టి దర్శనను అభివ్యక్తముచేయుట వర్ణన. ఏవంవిధదర్శనవర్ణనలు కావ్యలక్షణములు." తత్త్వమును కవి దర్శించవలెను. జగత్తుయొక్క స్వభావమును అవగాహనము చేసికొని, అం దంతర్లీనమగు ధర్మమును, సత్యమును అనుభవించవలెను. యాస్కు డనినట్లు సాక్షాత్కృతధర్ము డగువాడు ఋషి.

ఈ ధర్మము పారమార్థికము. ఐతరేయబ్రాహ్మణము చెప్పినట్లు ఆత్మసంస్కృతిచే దేవతాశిల్పములను అనుకరించి అభివ్యక్తముచేయుట కవియొక్క లక్ష్యము కావలెను. ఈ అతీంద్రియవిషయమును భావనచేసి శబ్ద మను సాధనముద్వారా అభివ్యక్తముచేయుటకు సమాధి అవసరము! శిథిలసమాధితో కవిత్వమునకు గడంగిన చిత్రము కాంతివిసంవాది యగునని మాలవికాగ్నిమిత్రమున మహాకవి కాళిదాసు పలికినాడు.

నిదిధ్యాసనద్వారా, అనుధ్యాయమానమగు అతీంద్రియ తత్త్వమును, లేక ధర్మమును శబ్దనిష్ఠము చేయుటయే వర్ణన. తత్త్వ మతీంద్రియమగుటచే అపరిచ్ఛిన్నము. ఈ అపరిచ్ఛిన్నతత్త్వము శబ్దముచే సమగ్రముగ నావిష్కరింపబడలేదు. తైత్తిరీయ మనినట్లు "యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసాసహ"— శబ్దమా తత్త్వమును పూర్తిగా వచింపలేకపోయినను, తత్త్వము నిర్దేశించుచు, తత్త్వానుభూతికి దారి తీయగలదు. ఈ ఉన్నయనమునే ధ్వని యందురు. తత్త్వము మహాకావ్యమున వ్యంజితమగును. ఈ పారమార్థికసూత్రము సర్వానుగ్రాహక మగుటచే ప్రతివ్యక్తిచేత జాగ్రదాకారమునగాని, అనవబుద్ధము (Unconscious) గాగాని అనుభవింపబడుటచే, మహాకావ్యమందలి వ్యంజనవ్యాపారము అందరకు దాదాపు తుల్యప్రతీతి నీయగలదు.

మనస్తత్త్వవిమర్శకులు (Psycho-analysts) మనఃప్రవృత్తులను పరిశీలించి జాగ్రత్ (Conscious), స్వప్న (Semi - conscious), సుషుప్తులు (Unconscious) అనువానిని గుర్తించినారు. వీనిలో ముఖ్యమైనది అనవబుద్ధమగు సుషుప్తి. ప్రతివ్యక్తి యొక్క విశిష్టత ఈ సుషుప్తిలో గలదు. మన భావములు, ప్రవృత్తులు బాహ్యజగత్తుతో సంఘర్షణ కలిగినవైనచో, సుషుప్త్యాకారమున అణచబడి (Repressed) జాగ్రదవస్థలో విస్మరించబడుచున్నవి. ఈ విధముగా సుషుప్తివిషయబాహుళ్యసంవలితమైన ప్రతివ్యక్తియు తనను తాను రక్షించుకొనగోరి, సుషుప్త్యవచ్ఛిన్నశక్తిని ఇతరవిధముల పరిణమింపజేసికొనును. ఈ పరిణామములలో కవిత ఒకటి. సుషుప్తిలోని విషయము లందరకు సమానములగుటచేత, తత్పరిణామములు ఆ అంతర్లీనవిషయసూచకము లగుటచేత, కవిత మొదలగునవి అందరకు తుల్యానుభూతి నిచ్చుచున్నవి.

పారమార్థికతత్త్వము నాధారముగా తీసికొనినను వ్యంజనను నిర్మూలింపలేము. ఈ తత్త్వము సర్వానుగ్రాహకము (all-inclusive), సమస్తవిషయములకు ఆశ్రయము, ఉన్మేషహేతుకము నగుచున్నది. అనగా సర్వవిషయములకు ఈ తత్త్వముననే పర్యవసానము కలదు. తత్త్వముతో సమన్వయము నందని భావము కాని, విషయముకాని లేదు. కావుననే మహాకావ్యము ఈ సమన్వయము నభివ్యంజించక తప్పదు.

శాకుంతలములో పంచమాంకప్రారంభమున విస్మృతిశీలుడైన దుష్యంతుడు చూపబడినాడు. శకుంతలను వివాహమాడిన సంగతిని మరచిన దుష్యంతుని అవస్థను విశదీకరించుచు,

"రమ్యాణి వీక్ష్య మధురాంశ్చ నిశమ్య శబ్దాన్
పర్యుత్సుకీ భవతి యత్సుఖితోఽపి జంతుః
తచ్చేతసా స్మరతి నూన మబోధపూర్వం
భావస్థిరాణి జననాంతరసౌహృదాని".

అనినాడు మహాకవి. "సుందరములగు విషయములను చూచినను, మధురములగు గీతములను వినినను దుష్యంతునకు సుఖము కలుగుటలేదు. సుఖము ననుభవించుచున్నట్లు కన్పడినను అతనిని ఉత్కంఠ వదలలేదు. అనేకజన్మలనుంచి సౌహృదములగు వాసనలు సంక్రమితములగుటచే నవి భావస్థిరము లగుచున్నవి. ఈ సౌహృదములు జాగ్రదవస్థలో నింతవఱకును తెలియబడినవి కావు. కాని వానితో పరిచయ మున్నట్లుగానే తన చిత్తమున స్మరించుచున్నాడు"

క్రమప్రాప్తములగు వాసనలు మనకు తెలియకనే మన భావస్థిరము లగుచున్నవి. జాగ్రదనుభూతికి బహిర్గతములైనను, ఇవి మనకు బాహ్యములు, విజాతీయములు కావు. ప్రశాంతమగు ఆత్మలో నీ సంస్కారములు దాగియున్నవి. అవి అణచబడలేనివైన, అనగా దాచబడుటకు లొంగనివైన పైకి ఉబుకును. కాని ఆత్మచే పూర్వమే అనుభూతములగుటచే నివి నూతనములుగా కన్పించవు. జ్ఞానము నవ్యముగా వచ్చునది కాదు. ప్లేటో అనినట్లు స్మృతిరూపమే జ్ఞానము.* పూర్వజ్ఞానము నాశ్రయించుకొనినది స్మృతియగుటచే, నిచ్చట స్మృతిశబ్దమునకు వేరొక అర్థమును చెప్పవలెను. ప్రతిభావ మనబడు సాక్షాత్కారస్వభావమే స్మృతిశబ్దమున కిచట అర్థము చెప్పికొనవలె నని అభినవగుప్తుడు వచించినాడు†. అనగా కావ్యమందలి అనుభూతి అబోధపూర్వమైనను, మనకు పరిచితముగానే కన్పించుటచే కించిత్తుగా స్మృతిసంవలిత మైనట్లు తోచుచున్నది. సుషుప్త్యాత్మకమగు చైతన్యమున (Unconscious) దాగియున్న భావములు, విషయములు లోకమునకు విరుద్ధములుమాత్రమేగాక, అందరకు తుల్యముగ నుండునవి. ఇవి అన్యవిషయాకృతినందగాకవితాదిరూపముల నందుచున్నవి. కాగా, కవిత్వాదులలోని పరమార్థము ఈ చైతన్యము ధ్వనింపబడి అనుభవింపబడుటయే. కావున మన అనుభూతి జాగ్రదవస్థలోని ప్రవృత్తులతో బయలుదేరి, స్వప్నావస్థద్వారా సుషుప్త్యవస్థలో దాగిన తత్త్వమున కున్మేషము నొసగవలెను.

ఈ వాదము నంగీకరింపజాలనిచో వేదాంతమార్గము యుక్తము. ఉపనిషత్తులు జిజ్ఞాసించు బ్రహ్మ సచ్చిదానందముగా, శాంతం శివం సుందర మని వ్యవహరింపబడుట కలదు. జగత్తులో అంతర్యామిగా (Immanent), జగత్తునకు అన్యత్వుడుగా (Transcendent) భగవంతుని స్వీకరించక తప్పదు. అప్పుడు 'నోవాలిస్' (Novalis) అను జర్మన్ కవితాత్త్వికు డనినట్లు ప్రతిమానవునిలోను, ప్రతిచేతనవిషయమున పరమార్థము, త్రైకాలికాబాధ్యము నగునది సచ్చిదానందమగు అంశయే. ఈ పరమచైతన్యమున అన్నియును పర్యవసితములు కావలెను. కాగా కావ్యమున కలుగు లోకోత్తరాహ్లాదము, ఈ బ్రహ్మావగతివలననే కలుగగలదు. ఈ అవగతి వ్యంజనావృత్తిని ఆశ్రయించుకొని బయలుదేరును. కనుక మహాకావ్యము ధ్వనిప్రధానము కాకతప్పదు.

## ౩

ధ్వని శబ్దము నాశ్రయించుకొనినది. శబ్దము అర్థవంతమగుటచే హృదయమును స్పందింపజేయుచున్నది. ఈ స్పందనము అనుభూతి యగుటవలన శబ్దముచే ఉన్మీలిత మగునది రసాస్వాద మనకతప్పదు. కాగా మహాకావ్యము రసప్రధానము కావలెను. కాని రసముయొక్క స్వరూప మేమి? ఏ రసమును మహాకవి ఆదరించవలెను? అను ప్రశ్నలు బయలుదేరుచున్నవి.

తైత్తిరీయోపనిషత్తు బ్రహ్మాస్తిత్వమునకు బయలుదేరి 'రసోవై సః' అని చెప్పుచు బ్రహ్మను రసముగా పరిగణించినది. ఈ 'రస' శబ్దమునకు కొందరు నవ్యులు ఆలంకారికార్థమును చెప్పరాదనినారు. కాని బ్రహ్మను ఆనందముగా గణించినచో, ఈఆనందము లలితకళలలోనిదని వారు విస్మరించరాదు. బ్రహ్మయే రసము. కాని ఏ రసము? భరతుడు శృంగారాది అష్ట రసములనుమాత్రమే

---

* "All knowledge is Recollection."
† అభినవభారతీ, పుట. ౨౮౧.

పలికించినాడు. శాంతమునుగురించి పలికినట్లు కొన్ని ప్రతులలో నున్నను, కాళిదాసమహాకవి విక్రమోర్వశీయములో భరతుని మతమున రసము లెనిమిది మాత్రమే నని సంప్రదాయవాక్యమును పలికినాడు. ప్రతిరసమునకు కొన్ని వ్యభిచారిభావము లున్నవి. వీనిలో తుల్య సంచారిభావములు కొన్ని రసములలో కన్పించుచున్నవి. పైగా రసములు పరస్పరసమ్మిళితములు కాగల వనుచో రసము లన్నిటికి కొంత సమాన స్వభావము కల దని కావ్యతత్త్వవిదులు అంగీకరించినారు. ఈ సమానస్వభావమునకే శాంత మని పేరు.

నాట్యశాస్త్రములో* భరతముని—

"స్వం స్వం నిమిత్త మాసాద్య
శాంతా ద్భావః ప్రవర్తతే
పునర్నిమిత్తాపాయేతు
శాంత ఏవ ప్రలీయతే"§

అనినాడు. అనగా శాంతమే ప్రధానరసము. ఆయా సన్నివేశముల పొందిక, మేలనమువలన శాంతమే మిగిలిన రసముల ఆకృతిని పొందుచున్నది. ఆ నిమిత్తములు మాటుపడగా, శాంత మను రూపమునే మిగిలిన రసములు పొందుచున్నవి. కాగా సన్నివేశములు కొన్ని శాంతమును వివర్తింపజేయగా శృంగారాదులు ప్రతీయమానము లగుచున్నవి. శృంగారాదిఅష్టరసములకు శాంతమే విసర్గోపాదానము.

శాంతము కేవలము నివృత్త్యాత్మకము కాదు. తత్త్వజ్ఞాన మను స్థాయి గల శాంతమును జ్ఞాన మన జెల్లును. ప్రవృత్తినివృత్తుల కతీతమైన విశిష్టము, ఉత్తమము నగు ప్రవృత్తిస్వభావము కలది జ్ఞానము. ఈ జ్ఞానమే శృంగారాదిరూపములతో భాసించుటచే, శృంగారాదిరసములు శాంతమున పర్యవసితములు కావలెను. అనగా మహాకావ్యమున ఏ రసము స్వీకృతమైనను, దానికి శాంతపర్యవసాయిత్వ ముండితీరవలెను.

శాంతరసప్రధానమైనది గనుకనే వ్యాసభారతము ఉత్తమోత్తమము. కరుణప్రధానమై శాంతమునకు పూర్తిగా దారిజూపలేని వాల్మీకిరామాయణము, భవభూతి ఉత్తరరామచరిత ఈ శ్రేణిని అందజాలవు.

కాగా శాంతము అద్వితీయము. శాంత మొక్కటే రసము. ఈ శాంతమే ఆత్మ, చైతన్యము, బ్రహ్మ, సౌందర్యము అను భిన్నభిన్నశబ్దములచే చెప్పబడునది. ఈ శాంత మపరిచ్ఛిన్న మగుటచే కావ్యమునకిది ప్రాణము. మహాకావ్య మీ రసానుభూతికి దారి జూపవలెను. అనగా రసములకు మానసికానుభూతి కలదు. శాంతము ఆత్మచే అనుభవింపబడునది. ఈ అనుభూతిని చేకూర్చునది ధ్వని. అనగా శృంగారాది అష్టరసములకు మహారసత్వమును సిద్ధింపజేయునది వ్యంజన. కావుననే అభినవగుప్తుడు—

"రత్యాదిశ్చేత్ కల్పష్టకమన్యవృత్తి
ర్యస్య స్వహృన్మండలసంప్రయోజ్యః
స్థాయీ వ చ్చేతసి తేన వృత్తిః......"§
"స్థాయీ ప్రబుద్ధహృదయే వ్యభిచారిభూతః
కామాకులాసు జనతాసు మహానుభావః
అంతర్విభావవిషయో రసమాత్రమూర్తిః......"†

అనినాడు.

౪

వ్యంజనచే మహాకావ్యము శివత్వమును, అనగా అపరిచ్ఛిన్నము, అతీంద్రియము, సర్వానుగ్రాహకము నగు తత్త్వమును ధ్వనింపవలెను. శృంగారాదుల ద్వారా మహారసము, చైతన్యము, జ్ఞానము నగు శాంతమున పర్యవసానము నందవలెను. ఏతల్లక్షణలక్షితమైన మహాకావ్యమునందే సౌందర్య మున్నది. సౌందర్యము కావ్యలోకములోనిదే.

"శాస్త్రమానేన యో రమ్యః స రమ్యో నాన్య ఏవహి" అని శుక్రనీతిసారము చెప్పుచున్నది. అనగా కావ్యలోకమునకు బహిర్భూతమై సౌందర్యము లేదు. ఈ సౌందర్యస్వరూపము అన్యత్ర విశదముగా చర్చించబడినది‡. సౌందర్య మనగా శాంతము.

* బరోడావారు ప్రకటించిన ప్రతి.

§ అభినవభారతీ, పుట ౩౪౨

† అభినవభారతీ, పుట ౩౪౩

‡ సౌందర్యమీమాంస, భారతి, జూన్ ౧౯౪౭

సౌందర్యము కావ్యమున శబ్దార్థములద్వారా అభివ్యక్తమగునది. మహాకవి అందుచే శబ్దములను పరిశీలించు సందర్భమున సౌందర్యాభివ్యక్తికి యుక్తములగు వానినే యేరికొనును. సౌందర్యము చైతన్యమే యగుటచేత, వస్తుతంత్రము (Objective) అగుటచే, మామూలుగా వ్యవహారములో నున్న శబ్దములనే మహాకవి ఆదరించుట కలదు.

అనగా మహాకవి సాధారణముగా జనులచే నుపయుక్తములగు శబ్దములనే ఏరికొని వానిని సౌందర్యాభివ్యక్తికి త్రిప్పుటచే నవ్యార్థస్ఫూర్తి కవి దోహదములు కాగలవు. మామూలు పదములే క్రొత్తక్రొత్త అర్థముల నీయగల వగుటచే, శబ్దమున అంతర్లీనములగు భావములను మహాకవి వ్యక్తపరచును. దీనిచే మహాకావ్యము క్లిష్టముగా మాఘశ్రీహర్షాదులవలెగాని, వసుచరిత్రవలె కాని ఉండదు. మహాకావ్యమున కపిత్థపాకముగాని, పాషాణపాకముగాని ఉండవలేవు. పామరునకు సహితము మహాకావ్యము బోధపడగలదు. కాని సహృదయునకు అందలి విశేషార్థముకూడ అనుభూత మగుచున్నది. కాగాఅధికారిభేదముచే అర్థప్రతీతిలో న్యూనాధిక్యములు కలవు. కావుననే—

"తం సంతః శ్రోతు మర్హంతి
సదసద్వ్యక్తిహేతవః,
హేమ్నః సంలక్ష్యతే హ్యగ్నౌ
విశుద్ధిః శ్యామికాపివా"

అని మహాకవి పలికినాడు కావున నైషధీయ చరితాదులలో మహాకవిత ఉన్నదని తలంచుట పొరబాటు. ఉత్తమకవిత రఘువంశకుమారసంభవములలో కలదు.

సామాన్యశబ్దప్రయోగమును మహాకవి స్వీకరించునుగనుక, మహాకావ్యమున దీర్ఘసమాసములుగాని, క్లిష్టములగు అలంకారములుకాని, ఆడంబరమగు శైలి కాని ఉండవు. అనగా వైదర్భీరీతి మహాకావ్యమున కన్పించవలెను. సర్వదూరము కాగూడదు గనుక, ఉపమాలంకారమువంటి గంభీరములు, అర్థవంతములు నగు అలంకారములే మహాకావ్యమున కన్పించును. వీటితో బాటు భావానుగుణమైన ఛందస్సు, ఛందోనుగుణమైన భావముకూడ మహాకావ్యమున కలదు. అజవిలాపము, రతీఆక్రోశము వియోగినీఛందమునసే ఉండగలవు. సుకుమారముగా చెప్పజాలు యక్షుడు, తన హృదయనిహితభావమును స్పష్టముగా చెప్పజాలని యక్షుడు మందాక్రాంతనే స్వీకరించును. సప్తర్షులు వివాహమునకై చేసిన రాయబారములు చారిత్రకములు, matter-of-fact అగుటచే అనుష్టుప్‌మాత్రమే కుమారసంభవమున ఆరవసర్గలో కలదు.

౫

ఏసంవిగ్రమైన మహాకావ్యమును పదేపదే చదివి, అనుభవించవలెనని తోచును. ఈ వాంఛ ఏ కావ్యమునుగురించి కలుగునో అది మహాకావ్యము. మహాభారతము, రఘువంశము, కుమారసంభవము, శాకుంతలము అనువానిని ఎన్నిసారులు చదివినను, ఇంకను చదువవలెననియే కోరిక గలుగుట సహజము. ప్రతి పర్యాయము ఒకొకవిధమగు అనుభూతి కలుగును. ప్రతి అనంతరపఠనమున ఏదో ఒక నవ్యార్థము స్ఫురించక పోదు.

"క్షణే క్షణే యన్నవతా ముపైతి
తదేవ రూపం రమణీయతాయాః"

అనినాడు మాఘుడు. ప్రతిక్షణము నవ్యముగా ప్రతీయమానమగుటయే సౌందర్యము. ఇట్టి సౌందర్యమే మహాకావ్యము.

దీనితోబాటు మహాకావ్యమున విశ్వజనీనత (Universality) ఉండవలెను. కాలవాహినిలో జీర్ణముగాక, నశించక, అనేకశతాబ్దములు సహితము సహృదయుల ఆదరాభిమానముల నందుచు, జాతిమత విచక్షణ లేక, దేశకాలాదివిచక్షణ లేక గౌరవింపబడునదే మహాకావ్యము. ఇట్టి విశ్వజనీనత లేనిది మహాకావ్యము కాలేదు. కవి అహంకారపూరితుడైన ఇది కుదరదు. కాళిదాసువంటి మహాకవి సహితము—

"ఆపరితోషా ద్విదుషాం
న సాధు మన్యే ప్రయోగవిజ్ఞానమ్
బలవదపి శిక్షితానా
మాత్మ న్యప్రత్యయం చేతః"

అని తన వినయమును, ప్రతిభను చెప్పికొనినాడు. విద్వాంసులు, సహృదయులు సంతృప్తులు కావలెను. అంతేకాని భవభూతివలె—

"యేనామ కేచి దిహ నః ప్రథయం త్యవజ్ఞాం
......తాన్ ప్రతి నైష యత్నః"

అని మహాకవి భావించరాదు. లోకేశ్వరుడగు శివుడు కూడ పార్వతియందు మోకరిలి—

"అద్యప్రభృ త్యవనతాంగి తవాస్మి దాసః
క్రీత స్తపోభిః........."

అనినాడు. ఆమెకు దాసు డగుటకు సిద్ధమైనాడు. కాని పార్వతి అవనతాంగి. శివుని దాసత్వమా మెకవసరము లేదు. అందుల కామె యిచ్చగింపదు. ఇదే విధముగా మహాకవి శివునివలెను, సహృదయుడు పార్వతివలెను ఏ కావ్యమున కన్పింతురో అదే మహాకావ్యము.

౭

ఏతత్ప్రతీతికి మహాకవి తాను చిత్రించు పాత్రలందరితోను ఐక్యము కావలెను. తాను సృష్టించు పాత్రలపై పాక్షికబుద్ధి నుంచుకొనక అందరను నిష్పాక్షికముగా జూడవలెను. ఉదాహరణకు వాల్మీకిరామాయణము తీసికొందము. రామాయణమున వాల్మీకికి పూర్తిగా రాముడనిన పక్షపాతము గలదు. రావణాదులపై ద్వేషబుద్ధి కలదు. ఇది యుక్తము కాదు. పైగా వాలిని వధించిన రాముని శీలమును రక్షించుటకు వాల్మీకి బాగుగా యత్నించినాడు. మానవుడు కాని వాలిపై మానవధర్మశాస్త్రమును మోపినాడు.

వ్యాసమహాభారతములో దీనికి వ్యతిరేకచిత్రణమున్నది. భీష్మ, ద్రోణ, కర్ణ, దుర్యోధనుల వధలను గమనించిన నిది బోధపడగలదు. యుధిష్ఠిరునిచే అనృతము పల్కించి ద్రోణుని సాగనంప యత్నించినారు. అసత్యము చెప్పినవాడు ధర్మజుడు. కాని ధర్మజుడు నిజముగా తన వర్తనను కళంకయుతముగా జేసికొనినాడా, లేదా అనుచు అందరును యుద్ధభూమిలో తర్కించుకొనినారు. కాని వ్యాసు డిచ్చిన సమాధాన మిది: "వాలిని చంపిన కళంకము రాముని శీలమున నెంత కాలముండునో అంతకాలము ఈ కళంకము యుధిష్ఠిరుని శీలమునగూడ ఉండక తప్పదు." అనగా వ్యాసునకు కురుపాండవు లందరును సమానులే. దుర్యోధనుని మరణసమయమున మనకందరకు అతని జీవితముపై సానుభూతి కలుగుచున్నది. రావణుని ద్వేషించునట్లు కర్ణునిగాని, దుర్యోధనునిగాని ద్వేషించలేము. పైపెచ్చు దుర్యోధనుని ప్రేమించగలము.

ఇదేవిధముగా శాకుంతలములో దుర్వాసుని ద్వేషించలేము. మొదటి మూడంకములలోను భౌతికవాంఛ నాశ్రయించుకొని బయలుదేరినది ప్రేమ. అనగా ఐహికసుఖములను గోరి వివాహము చేసికొనినారు. దానితో ఆశ్రమధర్మములు పరిత్యజింపబడినవి. శ్రేయస్సు విస్మృతమైనది. కాగా హృదయము నిర్మలము కావలెను. ఈ చిత్తపారిశుద్ధ్యము పశ్చాత్తాపము వలనగాని కలుగదు. అందుకై వచ్చినది దుర్వాసశాపము. పైగా శాపములు ఆరభటిలో ఉండుట సహజము. కాని ఈ శాపము మృదుమధురశబ్దము లలో గలదు. దాదాపు వైదర్భీరీతిలోనిదే అనవచ్చును. శబ్దప్రధానము, లేక ధ్వనిప్రధానమైనశాపము ఈ శ్లోకమున స్వస్వభావమునే కోల్పోవుచున్నది. అనగా ఇది శాపము కాదని భావము.

ఈవిధముగా మహాకవి నిష్పాక్షికబుద్ధితో తన పాత్రలను సృష్టించి చిత్రించవలెను.

౮

మహాకావ్యమందలి శబ్దము ఇంద్రియముల కనుభూతి నిచ్చునది. అందలి అర్థము శృంగారాదిరసములను మానసికముగా అనుభవింపజేయునది. తదుభయాశ్రిత మగు వ్యంజన మహారసమగు శాంతము నభివ్యక్తము చేయునది. కావున మహాకావ్యమున ప్రధానవిషయము తత్త్వము. ఈ తత్త్వము అభివ్యక్తమగుట అనగా ఆత్మ, మనస్సు, ఇంద్రియములు సంవలితము లగును. కాగా, వస్త్వైక్యము, భావైక్యము మహాకావ్యమున ఉండును. ఆత్మేంద్రియసంయోగముచే వ్యంజింపబడు తత్త్వమును అనుభవింపజేయగలుగునది మహాకావ్యము. అట్టి కావ్యస్రష్టయే మహాకవి. అనగా ఋషిత్వము కలది మహా

కవిత్వము లేదు. ఏవంవిధలక్షణమునకు సరిపోవు మహాకవుల సంఖ్య చాల స్వల్పము.

ధ్వన్యాలోకమున ఆనందవర్ధనుడు మహాకవులను గురించి ప్రస్తావించు సందర్భమున,

"కాళిదాసప్రభృతయః మహాకవయః ద్విత్రాః పంచషా వా భవంతి"

అనినాడు. కాళిదాసువంటి మహాకవులు ఇద్దరు, లేక ముగ్గురు మాత్రమే కలరు. ఒకవేళ ఎక్కువమంది ఉన్న ఐదుగురికన్న ఈ సంఖ్య మించదు. ఆనందవర్ధనుని దృష్ట్యా వ్యాసవాల్మీకికాళిదాసులు మాత్రమే మహాకవులు. వీరు భగవదనుగ్రహపవిత్రవాక్కు గల వారని అభినవగుప్తుడు. వీరిలోకూడ కాళిదాసు మాత్రమే కవికులచక్రవర్తి అనినాడు. వ్యాసుడు మహాకవి. తర్వాత మహాకవి కాళిదాసు. దాదాపు ఈ శ్రేణిని చేరువారు వాల్మీకి, భవభూతిమాత్రమే. ఆతర్వాత నేటిదాక భారతభూమిలో మహాకవులు లేరనిన అతిశయోక్తి కాదు. ప్రతికవిని మహాకవి అనిన, శ్రీనాథుడనినట్లు "కుక్కను సామజ మనుటయే."

౨

దిఙ్మాత్రోదాహరణగా వ్యాసకాళిదాసులను గమనింతము. మహాభారతమున శాంతమే ప్రధాన రసమని సహృదయ చక్రవర్తియగు ఆనందవర్ధనుడు పలికినాడు. శృంగారాదిరసములు ప్రయుక్తములైనను వానికి శాంతి పర్యవసాయిత్వమును చూపినాడు. పాత్రలను నిష్పాక్షిక బుద్ధితో చిత్రించినాడు. శైలి అక్లిష్టము. కాని మహాభారతమును భిన్నభిన్నమార్గముల ననుసరించి వ్యాఖ్యానించవచ్చును. అది ఇతిహాసము. ధర్మామ్నాయము కూడ. సాంఘికరాజకీయవ్యవస్థలను మీమాంసించునది. యాజ్ఞికమీమాంసకు ప్రతీక. సర్వతోముఖమైన జీవితము చిత్రింపబడినది. భారతములో లేని విషయము జగత్తులో లేదు.అది ఒక ప్రత్యేక జగత్తు.

ఇక కాళిదాసమహాకవి. కుమారసంభవమున మహాకవి కనబడును. రఘువంశమున ఋషిత్వము నందిన మహాకవి గలడు. కుమారసంభవమున నితివృత్తము లోకోద్ధరణ. పార్వతీపరమేశ్వరులు ఆదర్శదంపతులు. వారి వివాహమే కథావస్తువగుటచే, ఇట సాంఘికవ్యవస్థకాదర్శము చూపబడినది. ఒండొరుల తపస్సులచే ఒకరికొకరి హృదయమును వశముచేసికొనినారు. అనగా మనఃపారిశుద్ధ్యము కల ప్రేమయున్న భార్యాభర్తలకు అనన్యత్వము సిద్ధించును. కేవలము తుచ్ఛకాలికశృంగారమును ప్రవేశింపదలచిన మన్మథుడు భస్మావశిష్టుడైనాడు.

వివాహమునకు తల్లిదండ్రుల అనుజ్ఞ అవసరము. హిమవంతున కీ వివాహము ఇష్టమైనను మేనకయొక్క అంగీకార మున్నది, లేనిది తెలిసికొనగోరినాడు. సప్తర్షులు శివునివైపు రాయబారమునకు బయలుదేరుచ ముత్తైదువను వెంట తీసికొనిపోయినారు. వివాహము సంప్రదాయసిద్ధమైనది. శాస్త్రీయముగా జరిగినది.

రాజకీయముగా వ్యాఖ్యానించిన అన్యదేశములలో సరిహద్దులను స్థాపించుకొనిన ప్రాచీనభారతభూమి సతీదేవి. ధర్మభ్రష్టము కాగా ఆ సామ్రాజ్యమంతరించినది. పరిచ్ఛిన్నమైన దేశము పార్వతి. హిమాలయము హద్దుగా నైనది. ధర్మరూపుడగు భగవంతునితో తపఃఫలముగా, పరిశుద్ధమానసము కలిగి అనన్యత్వము నందినది పార్వతి. అనగా వైదికసంస్కృతి పునరుద్ధారితము కావలెననిన, దేశమున స్వాతంత్ర్యమనుభూతము కావలె ననిన దేశీయులు ధర్మబద్ధులు కావలెను. వైజ్ఞానికోద్ధారణ లేనిది రాజకీయాభిన్న లేదు.

రఘువంశమున ప్రధానపురుషులు దిలీప, రఘు అజమహారాజులు. ధర్మమును ప్రధానముగా నెంచి కామములను మేళవించుకొనుచు ,నిశ్రేయసము నా చినవాడు దిలీపుడు. అర్థమును ప్రధానముగా స్వీ ంచి, ధర్మకామములను మేళవించుకొనుచు, మో మందినవాడు రఘువు. కామమును ముఖ్యముగా నెం ధర్మార్థములను సమన్వయపరచుకొనుచు, మోక్షగా యైనవాడు అజుడు. శ్రీరామునిలో నీ మూ త్రయము మూర్తీభవించినది. అనగా సాంఘిక, ఆర్థిక ధార్మిక, రాజకీయవ్యవస్థలు సూచింపబడినవి.

కవిలోకస్తుదృష్ట్యా వీనిని పరిశీలించిన కుమారసంభవమున సౌందర్యమూర్తియగు పార్వ

ఆధ్యాత్మికశక్తిసంవలిత కాగానే, నైష్ఠికసుందరుడగు శివుడు ఆమెతపస్సులచే క్రీతుడైనాడు. శివుడు సహితము ఆధ్యాత్మికశక్తివిశిష్టతతో నలరారినాడు. ఏతత్స్వమావేశనము బాహ్యవిషయప్రచోదితముగాక అంతరభావముచే సముద్భూతమైనది. ఇది భారతీయ సంస్కృతిలోని వైశిష్ట్యము కావుననే దేవతాత్మయగు నగాధిరాజ వర్ణనతో మహాకావ్యము ప్రారంభ మగుచున్నది. అనగా స్వదేశమును, స్వీయసంస్కృతిని, భగవదవతారముగా గ్రహించుటయే నిజమైన జాతీయత.

హిమాలయవర్ణన, పార్వతివర్ణన, వసంతవర్ణన, తపోవర్ణన మొదలగున వీ కావ్యమున గలవు. కాని వీనికి వర్ణనరూపమున తాత్త్వికత లేదు. హిమాలయము జాతీయతకు ప్రతీకమాత్రమేగాక, దేవతాత్మయగుటచేత, భారతస్త్రీకి మాతృకగూడ అగుటచేత తద్వర్ణన అవసరము. సౌందర్యోపాసన కవితయొక్క ఉద్దిష్టారమగుటచే పార్వతివర్ణన ముఖ్యము. వసంతవర్ణన మన్మథుని అహంకారమును, ఆధ్యాత్మికశక్తియొక్క ప్రాబల్యమును పోషించుచున్నది. అనగా ఈవర్ణనలు కథావస్తువుతో సన్నిహితసంబంధము గలవి.

రఘువంశమున వర్ణనలు మిక్కుటముగా లేవు. ఉన్న వర్ణనలు ఉపమాలంకారరూపమున ప్రస్తుతవిషయముతో సమ్మిళితము లగుచున్నవి. అనగా కుమారసంభవముకన్న స్వల్పముగా వర్ణన లుండుటచే నీ కావ్యమున దార్శనికుడు, ఋషి యగు కాళిదాసు కన్పించుచున్నాడు.

౯

మహాకావ్యము లీ విధమైనవి. వీటి ప్రయోజనమేమి? మమ్మటభట్టు—

"కావ్యం యశసేఽర్థకృతే
  వ్యవహారవిదే శివేతరక్షతయే
సద్యఃపరనిర్వృతయే
  కాంతాసమ్మితతయోపదేశయుజే"

అని కావ్యప్రయోజనములను పేర్కొనినాడు. కాని, మన ప్రాచీనాలంకారికులు, నవీనవిమర్శకులు కూడ ప్రయోజనశబ్దమును ఉపయోగశబ్దమున కభిన్నముగా స్వీకరించినారు. ఒక వస్తువున కుపయోగమున్న దనిన అది అన్యవిషయప్రాప్తికి సాధనము. ప్రయోజన మున్న దనిన అన్యాపేక్ష లేదు. స్వతఃసిద్ధము, సమగ్రము, సర్వానుగ్రాహకము నగునది ప్రయోజనాన్వితము. కాగా యశస్సు మొదలగునవి కావ్యమువలన కలుగు ప్రయోజనములు కావు.

ప్రయోజనములలో ఆనందము, నిశ్శ్రేయస్సు ముఖ్యములు. నిశ్శ్రేయ స్సనగా విశ్వవ్యాప్తమై అఖ్యాంతర్యామియగు చైతన్యము, లేక జ్ఞానము, లేక బ్రహ్మయొక్క అవగతి. ధ్వని ఉత్తమకావ్యలక్షణముతో ఈ అవగతి స్వీకృతమగునది. అనగా ఉత్తమకవితలో అపరిచ్ఛిన్నము, అతీంద్రియము నగు జ్ఞానము అంతర్లీనము కాక తప్పదు.

కావ్యానుభూతి అనగా లోకోత్తరాహ్లాద మనువారు ఈ ఆనందము భావశూన్యము కాజాలదని గుర్తుంచుకొనవలెను. భావరహితమైన ఆనందము ఉన్మత్తుని అవస్థగనుకనే—

**"Feeling is the infinite dull region of the Mind".**

అని హెగెల్ (Hegel) అనినాడు. భావసహితమైన ఆనంద మున్ననే ఉత్తమకావ్య మనిపించుకొనును. ఈ భావము జ్ఞానాకారము. అనగా ఉత్తమకావ్యముయొక్క ప్రయోజనము జ్ఞానాకారకచిత్తవృత్తిని కలుగజేయుటయే. ఈ జ్ఞానమునే శాంతమని ఆలంకారికులు, బ్రహ్మయని వేదాంతులు వివరించినారు. ఈ జ్ఞానావగతి వ్యాసభారతమున, మహాకవి కాళిదాసుకృతులలోను గలదు. కావుననే సంప్రదాయవేత్తలు పలికినారు :

"పురా కవీనాం గణనాప్రసంగే
కనిష్ఠికాఽధిష్ఠితకాళిదాసా,
అద్యాపి తత్తుల్యకవేరభావాత్
అనామికా సార్థవతీ బభూవ"

# వార్ధక్యంలో....

[కథానిక]

●

శ్రీ గొల్లమూడి లక్ష్మీనారాయణ

"పద్మయ్యతాతో! నీ పడ్డ చచ్చింది!"

—పద్మయ్య బువ్వ తింటూండగా అతని కర్ణ కవాటాలను బ్రద్దలుచేశాయి ఆ మాటలు. అతని తలపై పిడుగు పడ్డట్లయింది.

ఎంగిలి చేత్తోనే వణుకుతూ పరుగెత్తుకొని లోగిల్లోకి వచ్చాడు పద్మయ్య. శరీరం యావత్తూ చెమటపట్టింది. ఆతురతా, భయమూ అతని ముడతలు పడ్డ ముఖంలో మూర్తీభవించాయి. అన్నిదిక్కులా పద్మయ్య నిశితదృష్టి పరపాడు.

ఎవరో కుర్రాడు; వెనక్కి అతని కొడుకు భాగంవైపు భయంతో తిరిగిచూస్తూ వాకిట్లోంచి లేడిలా చెంగున గెంతాడు. కుర్రాడు చూసినవైపే దృక్కులు సారించాడు పద్మయ్య......కొడుకు తారకయ్య ఏదో ఘనకార్యం చేసి విజయంపొందిన వీరుడిలాగా గట్టిగా నిశ్వసించి, బుసలుకొట్టే పాము పడగలా తల ఊపుతున్నాడు.

తారకయ్యకాళ్ళదగ్గిరే పద్మయ్యమాడిగేద అడ్డంగా పడిఉన్నది. నోట్లోంచి నురుగులు కక్కుతున్నది; చెమటపట్టింది. ఇహ శాశ్వతంగా లేవలేనట్లు నిట్టూరుస్తున్నది. పద్మయ్యవంక, తల నేలకు వాల్చి అమితదైన్యంగా గుండెను పాడిచేసేట్లు చూస్తున్నది.

పద్మయ్యకు పరిస్థితి అవగాహన అయింది; కాని కారణం తెలియలేదు. రేపో, మాపో సలక్షణంగా ఈనుతుం దనుకున్న పడ్డకు ఇట్లాంటి దుర్గతి పడుతుందని తను అనుకోలేదు కలలోనైనా. ఏమి పాపం చేసిందనీ, ఎవరికి అపకారం తలపెట్టిందనీ ఈ గేదకీ దుస్థితి కలిగింది? 'మిమ్మల్ని ఇంతకాలం నమ్మి సాయంచేసినందుకు మీరు చూపే ప్రతిఫల మిదేనా?' అని - గేద నిస్పృహ చెందుతున్నట్లుగా పద్మయ్యకు అనిపించింది. పద్మయ్యహృదయం కరిగింది. అతని కళ్ళు కన్నీటిస్నానం చేశాయి.

ఆ ప్రియమైన ప్రాణిపైనుండి తనను సర్వదా ద్వేషించే తారకయ్యవంక దృష్టి మందంగా మరల్చాడు.

"తారకయ్యా!" గంభీరంగా అన్నాడు— "నీ కాఠిన్యమంతా నోరులేని ఈ మూడిగేద మీదటరా!"

తారకయ్య రొమ్ము విరిచాడు. అతని ఇంటి వైపు మొగంపెట్టి, విసురుగా, రోకలిలా ఉన్న చేతిలోని దుడ్డుకర్రను మూలకు విసిరాడు. జవాబు అదే! కారణం? తారకయ్య తండ్రితో ముఖాముఖి మాట్లాడి ఎన్ని వేసవులు గడిచాయో?

ఇంతలోనే గోడచాటునుండి పద్మయ్యకోడలు చంద్రమ్మ తుపానులా వచ్చింది.

"కొడుక్కి వాతలు పెట్టే లేదుగాని; గొడ్డుని కాస్త అదిలిస్తే వచ్చిందేం?"—చేతులు చాపుతూ, దీర్ఘాలు తీస్తూ అన్నది.

"ముసలాడు మూలుగుతూ పడుండక పెద్ద మొనగాడల్లే బయలుదేరాడు"—పదేళ్ల మనమడు జలజలా వడగళ్ళు వర్షించినట్లు వాగేసి తల్లిచాటుకి వెళ్ళాడు.

"నీకన్నా కర్కోటకుడు కాడులే ఈ తారకయ్య" సరిగ్గా అదేవిధంగా నిల్చుని ఎడంచేయిబొటన వ్రేలుగుండెకి చూపుకుంటూ అన్నాడు తారకయ్య.

ఉరుములు, వర్షము, పిడుగూఅయినాక కరక్కాలమేఘం మెల్లిగా మెదిలింది.

చంద్రమ్మ అధికంగా అనటం ఇది మొదటిసారి కాదని పద్మయ్యకి తెలుసు. నక్షత్రాలైనా లెక్క వేయ వచ్చునేమోగాని, తారకయ్య పద్మయ్యని ఎన్నిసార్లు 'కర్కోటకుడు'అని అన్నాడో అతనికే తెలియదు! పోతే క్రూరజంతువుగర్భాన సాధువు పుట్టుందా? తల్లిదండ్రుల తర్ఫీదే కొడుక్కి. అతని కడుపునంటే తారకయ్య చెడపుట్టాడుకాని అందరికీ అట్టా పుట్టారా?

కొడుక్కి వాతలు పెట్టాడని చంద్రమ్మ పద్మయ్యని ఘాటుగా దెప్పింది. ఆ దెప్పటం నిన్నా మొన్నటి విషయాన్ని పురస్కరించుకొని కాదు. ఆ కథ తారకయ్యచిన్ననాటి సంగతి...

...మునసబుగారి లేగదూడకు కట్టిన అద్దాలు తాపిన మువ్వలపట్టెడ తీసుకొచ్చి గాదెలో కూరాడు తారకయ్య. పట్టెడ విప్పుతుండంగా చూసిన కుర్రా డొకడు మునసబుకు చెప్పా డా విషయం. మునసబు వచ్చి పద్మయ్యకు చెప్తే, పద్మయ్య కొడుకుపైన సామదానోపాయాలు ఉపయోగించాడుకాని అసలు విషయం బయటపడలేదు. ఇహ చేసేది లేక సూది కాల్చి తారకయ్యముంజేతులకు వాతలు పెట్టి, కొడుకుమంకు పట్టు వదల్చాడు. మచ్చుమాత్రంగానైనా లేని ఆ వాత లను గుర్తుంచుకొని మాటిమాటికీ తారకయ్య తండ్రిని కర్కోటకు డని ఎత్తిపొడుస్తూనే వుంటాడు.

చిన్నప్పటి చిలిపిచేష్టలు పెద్దయితే మాయ మవుతా యంటారు. కాని తారకయ్యకు 'పుటకతో పుట్టిన బుద్ధులు పుడకతో కాని పోవని' తేలి పోయింది...ఇరవయ్యేళ్ళ వయస్సప్పుడు తారకయ్య బాపయ్యగారి అమ్మాయిని వంటరిగా చూసి బలవం తాన ముద్దెట్టుకున్నాడట! బాపయ్యగా రొచ్చి "నిన్ను చూసి ఊరుకున్నానుకాని, లేకపోతేనా ఇప్పటికల్లా నీకొడుకు ఎక్కడుండే......"అని పూర్తి చేయకమునుపే పద్మయ్య అమాంతం బాపయ్యకాళ్ళు నొక్కేసి, కాళ్ళా వేళ్ళా బతిమాలి బాపయ్యను పంపించేశాడు.

తారకయ్యకి పద్మయ్య చెప్పిన హితవచనా లన్నీ 'చెవిటివానికి శంఖు పట్టిన'ట్లయింది. భయాన చెప్పి, చేయి చేసుకోవలసిన ఈడు దాటిందని తెలుసుకున్న పద్మయ్య, నయాన "నా కాలి చెప్పు నీకాలికి సరిపోయే ఈడు వచ్చిందిరా, అబ్బాయ్! ఇవేం బుద్ధులురా?"అని చెప్పాడు. కాని అవన్నీ తార కయ్యపట్ల 'బూడిదలో పోసిన పన్నీరే'.

తప్పుడుత్రోవలో తన జీవితశకటాన్ని అనేక మందిమీదుగా నడిపించ ప్రయత్నిస్తున్న తన కొడుకును క్రమమార్గంలో కాస్త భయాన్నో, నయాన్నో చెప్ప ప్రయత్నించినందుకేగా పద్మయ్య 'కర్కోటకు' డైనాడు!

నిట్టూర్చాడు పద్మయ్య.

జనం గుమిగూడారు.

"ఇంతకీ అది చేసిం దేమిటో నా కర్థం కాలేదు రా తారకయ్యా!"—దుఃఖస్వరంలో రాజీకి ప్రయ త్నించేవానిలా అన్నాడు పద్మయ్య.

"ఏం చేస్తే ఏం? ఎన్నిసార్లని చెప్పాలి—కాస్త గొడ్డుపై చూ పుంచాలని? వామి సగం దీని పొట్టనే పడె!" జనంవంక చూస్తూ తారకయ్య అన్నాడు.

పద్మయ్య వామివంక చూశాడు. స్పష్టంగా కొత్తవామిలోంచి గుప్పెడు గడ్డి తీసినట్లు కనిపిస్తూనే ఉన్నది. అందులోనూ, నాలుగుపరకలు పడ్డపళ్ళల్లోనే ఉన్నాయి ఇంకా!

"గొడ్డు నదలించుకోవలసిన అవసరం ఆయన కేం కలిగిందంట. ఆయన కిష్టమయే చూసీ చూడనట్లు వూరుకుంటున్నాడు. అందుకని గాదూ, అతగాడు అడ్డంగా పెట్టిన మట్టిగోడ కాస్తా నేలమట్టం చేసిందీ!"

మట్టిగోడ పడటంలో వర్షం తప్పు అతని నెత్తిన రుద్దుతున్నది కోడలు. తండ్రిపొత్తు తారకయ్యకు పడక పంపకాలయిన మరుక్షణాన్నే మట్టిగోడ కట్టాడు. తారకయ్య ఆవరణలో, పద్మయ్యకు సంబంధించిన పచ్చిగడ్డి పడితే భగ్గున మండుతుంది.

"అయితే, తారకయ్యా! కాస్త గడ్డి, నేను బువ్వతింటూన్నప్పుడు కొరికిందని, దాన్నట్లా చావ మోదుతారట్రా! ఏదో కక్ష లోపల పెట్టు కొని,

అదంతా దానిపై కక్కుతావా ? అది ఏం పాపం చేసిందనీ?...”

“శాస్త్ర అంటా వేమిటయ్యా, శాస్త్ర! అది వామి వాళం చేసినమాట ఖాయమే. ఇట్లాగే కళ్ళప్ప చెప్పి చూస్తూ ఊరుకుంటే, రేపు వామిమొత్తమూ దాని పొట్టనేగా” అంటూ జనంవంక వాళ్ళ సమర్థనకోసం చూశాడు.

“అయిం దేదో అయింది, పద్మయ్యతాతా! పెద్దవాడవయ్యావు. ‘గతం నాస్తి’ అనుకోవాల్సిన పెత్తనం వచ్చింది.....” అని వేదాంతంతో పద్మయ్యకళ్ళనీళ్ళు తుడవబోయారు అక్కడున్న ఊరి పెద్దమనుషులు.

“ఏమి బాబూ! అట్లాగే అనుకొందును...కాని దాన్ని చూస్తే మీకు జాలేయటం లేదూ? మీమూడ రోగం వచ్చి చస్తే ఎంతమందిని ఈసడిస్తారు! ఎంతమందిని తిట్టిపోస్తారు! గుప్పెడు గడ్డి పెమరిం దనేనా దాన్ని అట్లా చావబాదటం!” వాడిమాటలు మెత్తగా అన్నాడు.

జనం ఏమీ మాట్లాడలేకపోయింది. పద్మయ్య అంటే ఆబాలగోపాలానికీ ఇంతో అంతో సానుభూతి లేకపోలేదు. అది అణగారిన సానుభూతి. చంద్రమ్మ తారకయ్యలను బాగా తెలిసినవాళ్ళెవరూ వాళ్ళతో మాటపట్టింపులు పెట్టుకోరు. వాళ్ళతో మాటపట్టింపులు తెచ్చుకోవటం ముళ్ళకంపతో వళ్ళంతా స్వయంగా గీరుకోవటమే నని వాళ్ళకి బాగా వంటపట్టింది. ‘తప్పించుకు తిరుగువారే ధన్యు’లని భావించి పద్మయ్యకు తారకయ్య పెట్టే అవస్థల్ని చూసీచూడనట్లుగా తల లొంచుకు వెళ్ళిపోతారు. పోనీ, తారకయ్యతో “కన్నతండ్రితో అంతగా కారణం లేని కత్తులు పెంచుకోటం మంచిది కాదు తారకయ్యా!” అని చెబుదామంటే ప్రయోజనం లేదని తెలుసు. అంతకంటే రాయికీ, రప్పకీ చెబితే మంచిది. తారకయ్యకు విషపు ఆలోచనలు చేయవద్దని చెప్పటం పాముకు తలలో విష ముంచుకోవద్దని చెప్పటమే.

“ఛోస్ ! ఏమిటయ్యా, నీ సణుగుడు! ఉహ్, పోవయ్యా, పో...” తారకయ్య అనటం పూర్తి కాలేదు.

ఇంతలోనే “ఏమిటయ్యా నీ ఆగడం!......” అంటూ గుంపును బ్రద్దలుచేసుకొని వణుకుతున్న తలతో వచ్చాడు నారయ్య. నారయ్య వచ్చాడంటే జనమంతా ఆశ్చర్యపోయింది. పద్మయ్యతారకయ్యల పంపకాల ముచ్చటయాక, నారయ్య ఈ తండ్రీకొడుకుల ముఖం చూసిం దీనాడే. పంచుకుపోతానని తారకయ్య మొండిపట్టు పట్టినప్పుడు “ఒరేయ్, తారకయ్యా! నీమాట బొత్తిగా బాగులేదు. ఇప్పుడేమో నీ పిన్నమ్మ కడుపులో ఉంది. నీ విప్పుడు పంచుకుంటే పుట్టబోయే తమ్ముళ్ళకి అన్యాయం చేసిన ట్టవుతుంది. పైగా నీఅయ్యకు అరయకరం పైచిలుకేగా వచ్చేదీ. దానితో ఎట్లా బదుకుతాడో శాస్త్ర ఆలోచించు......” అని ఏదో చెప్పుతూండంగనే తారకయ్య స్నేహితుడు, నారయ్య కొడుకు కొంప మునిగిన ట్లొచ్చి “నీకెందుకయ్యా! నీ వింటికి పద” అని రెక్కపట్టుకు తీసుకువెళ్ళాడు.

ఇవ్వాళ ఎట్లా తెలిసిందో ఏమో, ఓపికంతా కూడగట్టుకొని వచ్చాడు పాపం నారయ్య.

“మరీ ఊరుకొన్నకొద్దీ అందలం ఎక్కుతున్నావేం! నోరులేని గొడ్డు నిన్నేమి చేసిందని దాన్నలా చావబాదావురా! గుప్పెడు గడ్డి పెరికిం దనేనా! కావాలంటే నీదొడ్లో వామి ఒకటి వేయిస్తాను. అంతేగాని దాన్ని చంపటానికి నీ కెవ డిచ్చాడ్రా అధికారం! గొడ్డుఖరీదు ఇచ్చి మరీ కదులు!......” నిప్పులు కక్కుతున్నాడు నారయ్య. తారకయ్య తెల్లబోయాడు. పద్మయ్య సంతోషం, ఆశ్చర్యం పొందాడు.

“అమ్యోవ్ ! మన కొంప కొచ్చింది!” అంటూ నారయ్యకొడుకు నారయ్యగూడలు పట్టుకున్నాడు. “ఒరేయ్! దరిజేరావా మాడు బద్దవుతుంది” అని అన్నాడే కాని కర్ర ఎత్తటానిక్కూడా ఓపిక లేకపోయింది. రేపో మాపో ఊపిరివిడిచే బోనులోని వృద్ధ సింహంలా అతడు కొడుకుచేతుల్లో చిక్కుపోయాడు.

నారయ్యా, నారయ్యకొడుకూ రంగంలోంచి మాయమయ్యారు.

పద్మయ్యగుండెలు గుబేలుమన్నాయి.

జనం ఎవరిదారిన వాళ్లు, ఆ స్థలం ఒక మహా కురుక్షేత్రంగా భావించి, బయటపడ్డారు.

చంద్రమ్మ ఇంటిలో తలుపులు గభాలున వేసిన శబ్దం అయింది.

కొడుకువీపు విన్నాడు పద్మయ్య. ఇంటి వైపు చూశాడు. పంచపాళిలో తడికచాటుగా వుండి చూస్తున్న భార్య ఆపుకోలేని కన్నీరు కారుస్తోంది.

ఒక కర్కోటకుడి చేతిలో ప్రాణాన్ని గుప్పెడు గడ్డికోసం ధారపోసిన పడ్డను మరోకమారు చూసు కున్నాడు పద్మయ్య. జనం ఇంతసరకూ ఇంత రభస చేసిందికాని వైద్యుడి సంగతయినా ఆలోచించ లేదు. అయినా అది బతికిందాకా నమ్మకం లేదు. చూడిది; వడ్డీ తునకలైంది. అట్లాగే కొంతకాలం యమయాతన పడి చస్తుంది. ఎంత దైన్యంగా చూస్తోంది! చూసే వారి హృదయాల్లో కరుణ పొంగేటట్లు చేస్తోంది.

పడ్డ పోతూపోతూ కళ్ళల్లోని దైన్యమంతా పద్మయ్యకళ్ళల్లో కుమ్మరించింది. పద్మయ్యకళ్ళల్లో దైన్యపుధారలు తెరిపి లేకుండా స్రవిస్తున్నాయి.

౨

నల్లని వరిచేలగట్లమీద ఊగిసలాడుతూ నడుస్తున్నాడు పద్మయ్య. కాళ్లు తొట్రుపడుతున్నాయి. హృదయంలో ఏదో గొప్ప తుపాను ఉన్నట్లుగా దైన్యాన్ని కుమ్మరించే అతని ముఖమే స్పష్టంగా చెపుతున్నది. ఆ వరిచేలు, గట్లు, బోదెలు, తదితర పరిసరాలూ చూస్తుంటే అతనికి వెనుకటిగాథ బొమ్మ కట్టోంది. ఎడారిలో పాతరలాంటి దా పూర్వగాథ...

............ఆర్ద్ర ప్రవేశించింది. బోదెల్లోకి పంటకాలవనీళ్లు నేలమట్టాని కొచ్చాయి. అంతకు మునుపే పాడిమట్టి పొలమంతా చిమ్మాడు పద్మయ్య. దుక్కి దున్నేసి, దమ్ముపెట్టటమే ఇహ తరువాయి.

మంచి రోజు చూసి అరక కట్టాడు.

కనుచూపు దూరంలోనే అతని ప్రక్కబిళ్ళయిన తారకయ్యపొలంలో ఏదో గోల జరుగుతున్నట్లుగా పసికట్టాడు పద్మయ్య.

పద్మయ్యతో సంబంధం ఎవరూ అంతగా కలుపుకోనందున అతను నిర్లిప్తుడిలా ఎద్దులను ములుగర్రతో 'హోఁ' అన్నాడు. చాలు గజం వచ్చిందో, లేదో 'ఆగవయ్యా, ఆగు' అని రంకెలు వేసుకుంటూ వచ్చాడు కొడుకు. పద్మయ్యకు నిప్పులపై నిలబెట్టినట్లయింది.

"చూడండయ్యా! ఏమీ ఎరగనట్లు నంగనాచిలా దున్నటం మొదలుపెట్టాడు......" చేసిన తప్పిద మేదో, ఎందుకు నంగనాచి అయినాడో పద్మయ్యకు అర్థంకాలేదు.

"రాత్రికి రాత్రి ముసలాడు ఓపికంతా కూడగట్టుకొని హద్దులు మార్చి ఎవ్వరూ కనుక్కోలేరని అనుకొంటున్నాడు. ఇట్లా దొంగచాటుగా రాళ్ళు మార్చి ఏమ్వకపోతే, ఆ పంపకాలనాడే ముష్టి అడిగితే నాలుగు సెంట్లు మొగాన రాసేవాణ్ణిగా......" తోక కాలిన కోతిలా చిందులు తొక్కాడు. పద్మయ్య కొడుకు ఎంత ధర్మాత్ముడో ఇప్పుడు తెలుసుకున్నాడు!

"ఓరి నాయనో! ఏం తెలివితేటలూ, ఏం కథా! రాళ్ళు పీకి నేలమట్టంతో మన్ను పోశాడు. రాళ్ళు తీసుకెళ్లి పదిగజాల దూరంలో నా పొలంలో పాతి మన్ను కుప్పెత్తుగా పోసి, పచ్చగడ్డి, పిచ్చి మొక్కలూ చల్లుతాడూ!......" మునసబు గొర్రెలా తల ఊపాడు. మిగతా ప్రముఖులు 'అవునవును' అన్నారు!

పద్మయ్యకు అప్పుడు అర్థమయింది తారకయ్య చేసిన ఘనకార్య మేదో. ఉండాల్సిన చోటే ఉన్నాయి రాళ్ళు. అయితే రాళ్ళచుట్టూ ఉన్న గడ్డీ, మొక్కలూ దోకి, అక్కడే ఉంచాడు వాటన్నిటినీ. పోతే, పద్మయ్య పొలంలో గుంటలు త్రవ్వి మళ్ళా నేలమట్టంతో పూడ్చాడు. ఇట్లా అని అతను అందరినీ ఎట్లా నమ్మించుతాడు? అక్కడివాళ్ళంతా తారకయ్యకి 'తందానతాన' పాడుతున్నారు. అప్పటికప్పుడే రాళ్ళు మార్చాడు తారకయ్య. కాదన్నవాడెవ్వడూ లేకపోయాడు.

ఆతర్వాత కరణాన్ని, పద్మయ్య పొలం కొలవమనీ, లెఖ్ఖప్రకారం అరవైరెండుసెంట్లూ వుండాలనీ ఎంత మొత్తుకున్నా, తారకయ్యకి భయపడి, 'ఇప్పుడు కాదో'యనీ, 'ఒంట్లో సరిగా లే'దనీ ఏదో దల్లా మొగం తప్పించి, తనని తిప్పించాడు కరణం. పద్మయ్య విసుగెత్తి ఊరుకున్నాడు........

............ఈ పూర్వగాథ స్మరణలో కొచ్చేసరికి పద్మయ్యకు జీవితమంటేనే విరక్తి కలిగింది. వృద్ధాప్యంలో ఎన్ని కష్టాలు! ఒకదానిమీద

ఇంకొకటి. వరసగా కృష్ణపక్షంరోజులు. సహజమేగా. కాని ఇహ తన జీవితంలో శుక్లపక్షం లేదని పద్మయ్య గట్టిగా నమ్మాల్సిన పరిస్థితులు ఏర్పడ్డాయి. అమావాస్యతో జీవితాంతం. పద్మయ్యమనఃకలశంలో ఇట్లా విచారబిందువులు అంతులేని ధారలు కట్టాయి...

అతను పంటకాలవను సమీపించాడు. పంటకాలవపిల్లఅలలపై జిగిఅంచులు కానవస్తున్నాయి. పశ్చిమాన అస్తమిస్తున్న సూర్యుడు ఊరిని ఎర్రని గాలిలో ముంచుతున్నాడు. వస్తున్న నీటిఅలలు వంతెనదిమ్మెలకు కొట్టుకొని చెదరిపోయినాయి. మళ్ళా, శవపేటికవెంట వచ్చే మనుషుల గుంపుల్లా, మెల్లిగా కూడగట్టుకుంటూ తరంగాలు కదలుతున్నాయి.

చినుగుల ముతకపంచె ఎగదోపి కాళ్లు కడుక్కోటానికి కాలవలో దిగాడు. పద్మయ్య ధైర్యమంతా చెమటరూపంలో కాలవ కలుపుకొని పారిపోతున్నది.

ధైర్యవిహీనుడై, బాణాల్లా గుచ్చుకుంటూన్న ఆలోచనలతో సూర్యుణ్ణి చేరుకుందామన్నట్లు ఊరివైపు నడక సాగించాడు. పద్మయ్యకు సూర్యుణ్ణి చూస్తే సానుభూతి కలిగింది. పగలంతా రాజ్యమేలాడు. అతని హయాంలో అంధకారశత్రువును రూపు లేకుండా మాపుచేశాననుకున్నాడు. కాని పాపం, అతని అవసానదశలో చాటుమాటున చీకటి అతని రాజ్యాన్ని ఆక్రమించుకుంటున్నది. సూర్యుడిలో అవమానం, అలసట, కోపం పొంగిపొర్లాయి. అందుచేతే అట్లా కందిపోయాడు సూర్యుడు. పద్మయ్య ముఖాన్ని చిరునవ్వు ఆవరించింది. ఆ చిరునవ్వులో ఎంత వేదాంతం ఇమిడిఉన్నదో! పద్మయ్య 'కాంచన పంకజం'.

అసలు తారకయ్యకీ, పద్మయ్యకీ అంతగా బద్ధవైరుధ్యం ఉండటానికి కారణం పద్మయ్యకు సరైనదిగా తోచలేదు. పద్మయ్య, వయసు మీరాక, నలభయ్యో పడిలో పడ్డాక పెండ్లిచేసుకున్నాడనేగా!

"ఏం చేసుకుంటేను? నా సంతానంకోసం నేను సౌఖ్యాన్ని ధారపోస్తున్నప్పుడు నాకొడుకు నాసౌఖ్యాన్ని కోరవద్దూ? వయసు మీరాక చేసుకోవటం నాది తప్పే కావచ్చు. కాని నా కొడుక్కేం? తనకు వారసు లొస్తారనేగా! తనకు ఆస్తి తగ్గుతుందనేగా? డబ్బుకోసం, తల్లిదండ్రులమీద ప్రేమకు తిలోదకాలిస్తారా? ఛీ! ఏం లోకం? ఈ లోకంలో ఉంటే ఎంత! లేకపోతే ఎంత?....." అనుకుంటున్నాడు పద్మయ్య.

"పోనీ, నామీది పగతో నా కందర్నీ విరోధులు చేస్తాడూ? నాయింటిచుట్టూ కత్తులగోడ కడ్తాడూ! నామీద కత్తి కత్తే కట్టాడు; నోరులేని జంతువు అది ఏమి చేసిందనీ? సరిగ్గా అమావాస్యనాడు మిట్టమధ్యాహ్నమా దాని చావు! ఏడాదికిందట సరిగ్గా అమావాస్యనాడు మిట్టమధ్యాహ్నమేగా మేకకూడా చచ్చింది. ఏమిటో ఆ కలయిక! 'చెరువుకట్టమీద బువ్వ తింటూంటాను. కాస్త చూస్తుండరా' అని మేకని కుర్రాడికి అప్పచెప్పి వస్తే వాడు ఏ ధ్యానంలో పడ్డాడో, కాస్తా గైలుకింద అదిపడి చచ్చింది. ఏమిటో అన్నీ అకస్మాత్తుచావులు!" విషాదలోకంలో పద్మయ్య విహరిస్తున్నాడు.

ఇట్లా అనుకుంటూనే, ఊరికీ పంటకాలవకీ మధ్య నున్న గైలుకట్టమీదుగా అప్రయత్నంగానే మేక చచ్చిన చోటుకి నడుస్తున్నాడు పద్మయ్య.

* * *

"ఆఁ. ఇక్కడే. అదిగో మలుపు తిరిగింది గైలుకట్ట. ఎదురుగా ఈతచెట్లు, నాగజెముడులు — ఇక్కడేగా....." అనుకుంటూ పద్మయ్య అక్కడ చతికిలబడ్డాడు.

"ఏముం దిక్కడ? అంతా మామూలే. అప్పుడు చిందిన రక్తంగాని, కండలుగాని ఇప్పు డేవీ? ఏడాదికిందట ఇక్కడ మేక చచ్చిందని ఎవడికి గుర్తు? ఎవడికెక్కావాలి? ఎప్పుడో మరచిపోతారు.....అంతా కొట్టుకుపోయేది—అశాశ్వతం...... ఇవ్వాళ మేక చచ్చింది. రేపు ఎవరికీ గుర్తుండదు. నే నివాళ చస్తాను. రేపు అనుకునేవా ళ్ళెవ రుంటారు?...ఛా! అప్రయత్నంగా నేను చావటం సంగతి వచ్చిందే. ఒకవేళ చస్తే ఏడ్చే దెవరో?...నారయ్య తప్పకుండా ఏడుస్తాడు. అదీ ఏడుస్తుంది. ఇంకా రంగడికి ఏడుపంటే, చావంటే తెలిసే వయసు లేదు........"

రాజుకున్న రాక్షసిబొగ్గుల్లా ఆకాశంలో నక్షత్రాలు మండుతున్నాయి. పద్మయ్య ఏమి చేస్తాడో అనే ఆతురతతో మబ్బుల చాటునుంచి గమనిస్తున్నాయి నక్షత్రాలు. పద్మయ్యహృదయం జ్వాలాగర్భితమైంది.

"ఆఁ. నే నేదో పిచ్చిగా అనుకోటమేకాని, నేను చస్తే ఇప్పుడు ఊరికి వెలి తేముంది? ఎవరికి లోటు

తుంది? గేద చస్తే నా కిబ్బంది అనుకున్నా. అది చస్తే ఇకముందు గడవదూ? ప్రపంచంలో ఎవరు పోతే ఎవరికి లోటు గనకా!

"నేను బతికుండి చేసే దేమిటో నా కర్థం కావటం లేదు. కొడుకుచేతుల్లో అవమానం, కోడలి చివాట్లు, ఆఖరికి మనమడి ఈసడింపులూ పడటానికేగా బతికుండటం! నన్ను 'కర్కోటకుడు' అంటాడు వాడు. వాడు కర్కోటకుడో, నేనో భగవంతుడికి తెలియదూ?

"నేను బతికుండటం తారకయ్యకి ఇష్టం లేదనుకుంటా. లేకపోతే పంపకాలనాడు ఆ మూర్ఖ మేమిటి? సాగుబడినాడు రంకె లేమిటి? ఇవ్వాళ గేదెను పొట్టను పెట్టుకోవట మేమిటి?

"అరయకరంతో సంసారం వెళ్ళబోసూ లన్న మాట. అదైనా ఉండనిస్తాడో, లేదో! ఎంతకైనా తగును! పోనీ, కవులు తీసుకుందా మంటే పడనీయడు గదా! మాటమీద మాట పోటీకి వచ్చి కవులు కాస్తా చెడగొట్టాడు. అంతగా నేను భారమయినప్పుడు నే నెందుకు బతకాలో............"

"అబ్బా! ఎంత భయంకరంగా కూసింది. గుండెలను రంపపుకోత కోసింది. మలుపు మూడు ఫర్లాంగులు దాటితే, రైలు ఇక్కడికి చేరినట్లే!........"దృఢ నిశ్చయం చేసుకున్నాడు. పద్మయ్యకు రైలుపట్టా వశ్యశిల అయింది. రైలుకాంతికిరణాలు చీకటిని చొచ్చుకొస్తున్నాయి.

"......కాని చనిపోవటం మంచిదా? చనిపోయి నేను సాధించే దేమిటి? ఆత్మహత్య మహాపాప మని పెద్దలంటారు. అట్లా అయితే నేను చదువుతున్న కథలలో గొప్పగొప్ప వాళ్ళే ఆత్మహత్య చేసుకున్నారు. వాళ్ళు వేరు; నేను వేరు........."రైలు ఫర్లాంగుదూరంలో ఉన్నది. అంతా వెలుతురు. మెయిలు మహావేగంగా వస్తున్నది. పద్మయ్యతల పట్టామీదే ఉన్నది.

"అడుగో! రంగడల్లే ఉన్నాడే! తప్పటడుగులు వేస్తూ 'నాన్నా,' 'నాన్నా' అని పిలుస్తూ వస్తున్నాడు. వాడూ కొంపదీసి కట్ట ఎక్కడుగదా! ఎందుకో అది ఏడుస్తున్నది. నా, కేరు దిక్కని అడుగుతున్నావా? బతికుండిమాత్రం నేను చేసే దేమిటి? నాకు నోరు ఉండనిస్తేగా, నీనోటికి తిండి దొరకటానికి!

"నారయ్య అంటున్నాడు: 'ఆత్మహత్య చేతకాని పని. బతికుండి సాధించాలి. నీకొడుకు, నా కొడుకుఆటలు ఇంకెంతకాలం సాగుతాయిలే; రా పద్మయ్యా! మనం చెప్పినట్లు వాళ్ళు బాగుపడక పోతారూ—వాళ్ళ పాపాన వాళ్ళు పోతారు. మన తరమూ గడిచింది. కాటికి కాళ్ళు చాచుకు కూర్చున్నాం. మహారాజుగా ఈలోకంలోంచి తప్పుకో వచ్చు. రా, పద్మయ్యా!'" రైలు వందగజాల దూరంలో ఉంది.

"'బతికుంటే బలుసాకు తినొచ్చు' నాకొడుకు నన్ను సరిగా చూస్తాడూ—సరే. లేకపోతే వాడి పాపం వాణ్ణి పట్టి కుడుపుతుంది. అదిగో! రంగడు దానిదగ్గిరికి వెళ్ళి 'నాన్న' అని చూపెట్టి ఏడుస్తున్నాడు. అదీ ఏడుస్తోంది. 'వస్తున్నా, నాన్నా'......"అని అందా మనుకున్నాడు. అన్నా ననుకున్నాడుకాని పద్మయ్యనించి చీమ చిటుక్కుమన్న శబ్దమైనా రాలేదు!

"బుద్ధి గడ్డి తిన్నది. ఇహనైనా లేద్దాం" అనుకున్నాడు.

పద్మయ్య కళ్ళు చీకట్లు కమ్మాయి. అతని కళ్ళకు చీకటితెగలు కట్టినట్లయింది. కరుగుతున్న సీసం అతని చెవుల్లో పోసిన ట్లయింది.

నరాలు త్రాళ్ళయినాయి. పక్షవాతం వచ్చినవాడిలా అతని శరీరం స్వాధీనం తప్పింది. లేద్దామని, కనీసం ప్రక్కకైనా దొర్లుదామని, శక్తంతా కూడగట్టుకొని ప్రయత్నించాడు.

రైలు పదిగజాల దూరంలో ఉంది. డ్రైవరు తాగిన ట్లున్నాడు. ఆకలిగొన్న భీషణసర్పంలా, తన దారికి అడ్డం వచ్చిన వన్నిటినీ పొట్టను పెట్టుకుందా మన్న ఆత్రుతతో గిర్రున తిరుగుతున్నాయి చక్రాలు. మృత్యుదేవతే రైలుచక్రాల్ని వాహనంగా చేసుకుని మనోవేగంతో వస్తున్న ట్లుంది.

"భర్ ర్ ర్............"

"నాన్నా!"

# 'నిఘంటువుల కెక్కని (కొన్ని) పదాలు'

●

శ్రీ చిలుకూరి నారాయణరావు

పై శీర్షికను శ్రీ బులుసు వేంకటరమణయ్యగారు కడచిన నెల భారతిలో వ్రాసినదానిని చదివి చాలా సంతోషించినాను. వేంకటరమణయ్యగారు చేస్తూఉన్న ఇట్టి శాబ్దికకృషి అమూల్యమైనది. ఈ క్రింద నేను వ్రాసేది ప్రశంసయే కాని విమర్శ కాదు. ఏకక్షేత్రములో పనిచేస్తూఉన్నవాని సదభిప్రాయముగా దీనిని గ్రహింపవలెనని ప్రార్థన. సారములేని వ్రాతకు-కకు నా దృష్టి సాగదు. వేంకటరమణయ్యగారి వ్రాత సారవంతమైనది కాబట్టే వారి వ్యాసము చదివినపిమ్మట నా మనసున కలిగిన కొన్ని అభిప్రాయముల నిక్కడ పొందుపరుస్తున్నాను.

౧. ఆదికపి, వృషాకపి శబ్దములలోని తుది 'కపి'శబ్దమునకు 'కోతి' అని అర్థము కాదు. ఈ 'కపి' పదము చాలా పురాతనమైనది. వేదకాలమునుంచీ వస్తున్నది. వేదభాషాసజాతీయమైన ప్రాచీనపెర్షియను భాషలోకూడా 'కఫి' అనే రూపములో ఉన్నది. దానికి 'సత్త్వము, చైతన్యము'అని అర్థము. అందుచేత పాండురంగమాహాత్మ్యటిప్పటిలో 'ప్రధానచైతన్యమైనవాడు' అని 'ఆదికపి' శబ్దమున కర్థము వ్రాయడము సరిగానే ఉన్నది.

౨. ఉత్కోచుడు : 'ఉత్కోచుండు వాచాలతకా' అన్నప్పుడు 'అధికుడు' అనేది కిట్టింపు అర్థమవుతుంది. 'వికసితవాక్కుగలవాడు'అని అర్థము చెప్పవలెను. పుష్పితవాక్కు గలవాడు అనికూడా అనవచ్చును. 'పుష్పితాం వాచం ప్రవదన్తి విపశ్చితః' అని గీతలో చెప్పిన వాక్కు ఇట్టిదే.

౩. ఉత్పిబము : అంటే 'శ్రేష్ఠమైన పానీయము'. 'చాతకము' అని అర్థము చెప్పడము చాలా క్లిష్టము. కేవల మూహాధారకము. 'ఉత్పిబం బల భుక్తిగా'అని మార్చి పాఠము కల్పించడముకంటె 'ఉత్పిబంబుల భుక్తిగా' అనే ముద్రితపాఠమే బాగున్నది. 'ఉత్పిబంబులకా' అంటే 'ఉత్తమపానీయములతోగూడ' అని అర్థము. వర్షర్తుసందర్భముకాబట్టి 'చాతక'ములను తేవలెనుగాని వాటికి మరొక ప్రసక్తి లేదు.

౪. 'కాళిక'అంటే కారుమబ్బు అనే అర్థము సమంజసముగానే ఉన్నది. నారదుని మహతీక్వణాధ్వనిని కాళికా(దుర్గా)హుంకృతితోను, మేఘగర్జనముతోను పోల్చినవాడు రామకృష్ణ డొక్కడే అనుకొంటాను. 'కాళికా'అంటే సింహము అనికూడా అర్థము చెప్పవచ్చునేమో ఆలోచించవచ్చును. అప్పుడు మహతీనిక్వణనము సింహగర్జనముకూడా అవుతుంది. 'సింహగర్జన'మయినా ఒకరీతి మేలే; కొంత గాంభీర్యము కలిగి ఉంటుంది. కాళికా-దుర్గాహుంకారగర్జనమున్ను, మేఘఘోరఘోరార్భటీగర్జనమున్ను భయంకరములు గదా.

౫. 'కుడిద' అనే రూపము తప్పు. 'సోకుమాక కుడిదలయూళ్లలో' అనేదానిలో 'కుడిదల' అనేది 'కుడిద' అనే ఏకవచనరూపమునకు షష్ఠీబహువచనరూప మనుకోడమువల్ల ఈ తప్పు కలిగినది. కుడిదల అనేదే ఏకవచనరూపము. విడిదల, ముదల, ముందల మొదలయినవాటిలోని తల(=స్థం) ప్రత్యయము 'కుడి' అనే పదముపై చేరి 'కుడిదల' ఏర్పడినది. 'కుడుచునట్టి అనుభవించునట్టి, స్వాధీనమున ఉన్న ఊళ్లు 'కుడిదలయూళ్లు' అయిఉంటవి.

౬. 'చాగు' శబ్దములో అర్థానుస్వార మున్నది. 'చాంగు' అని దాని రూపము. పండితారాధ్యచరిత్రము నుంచి ఉదాహరణములు : 'హో ! యని చాంగు ! భళా! యనువారు' (౧. ౧౬౧); 'చాంగు, భళా! యంచు శరణంచు నుతుల వీంగుచు (౨-౩౪); 'చాంగు భళా యంచు శబ్దముల్ మ్రోయ, వీంగుచు బురజనుల్ లిబ్రాంతులుగను' (౨-౧౭౦); 'కోయంచుఁ జాంగు

భళా యంచు మల్లయా! యంచు' (౨-౩౬౮); 'లలినుబ్బి చాంగు భళా యనువారు' (౨-౮౩౮) మొద. చాంగు! భలా! అనే రెండు పదములున్ను మరాఠీభాషలోనివి. 'చాంగు' అంటే చక్కనిది, విధియుక్తమైనది అనిన్ని, భలా అంటే మంచిది అనిన్ని అర్థములు.

౬. ప్రస్తుతము: ఈ పదానికి మా రాయలసీమలో 'గర్భాధానము' అని అర్థము. ఈ సంస్కారానికి ఆంధ్ర దేశములో ఒక్కొక్కచోట ఒక్కొక్క వ్యవహార మున్నట్టుంది. కార్యము, నిషేకము, గదిలోనికి పంప డము—ఇంకా ఇటువంటి వేమయినా ఉండవచ్చును.

౭. 'ముయ్యాడు' అన్నప్పుడు 'ఈడు'అంటే వయస్సు అనే అర్థమున మూడోవయస్సు అంటే కౌమారము అని అర్థము చెప్పడము బాగానే ఉంది గాని, తరువాతిపద్యములో 'భూలేఖకులుల కేయే కాలంబున నెట్టి రొట్టి కర్మ మొనర్పంబోలుం దత్త త్కృత్యము లొంటిత్రికృతములయి గుణోన్నతి చెనుపగా' అనే పద్యములోని భావముతో నిది అను గుణముగా లేనట్టు తోస్తుంది. 'ఈడు' అంటే 'సాటి, పోలిక' అనే అర్థములోనే రామకృష్ణుడు వాడి ఉంటాడు. ముయ్యాడు అంటే 'మూడుమూర్తులా సరి పోయి, మూడుమూర్తులా ఒకటే పోలిక కలిగి' అని అర్థము. ఈ అర్థమే పాండురంగమాహాత్మ్యము ౫-౩౧౫ లో కూడా ముయ్యాడుపదమునకు కుదురు తుంది. "స్వాతి మేఘంబు చినుకులు దనది శుక్తి౹తతి ముయ్యాడునై మౌక్తికత వహించుకరణి"—ఇందులో కౌమారప్రసక్తి లేదుగదా!

౮. శ్రావమూకుడు: ఇది 'కందదుంప' వంటి జంటపదము. శరావమంటే మట్టిమూకుడు; దానికి 'శ్రావ' అనేది రూపాంతరము. శ్రావ అంటేనే మూకుడు అయినప్పుడు 'శ్రావమూకుడు' మూకుళ్లలో విశేషా కారము కలదై ఉంటుంది.



# తేట తెనుగు

## శ్రీ బులుసు వేంకటేశ్వర్లు

పాల్కురికి సోమనాథకవి తన పండితారాధ్య చరిత్రమును 'దేట తెనుంగున' రచింతు నని పేర్కొనియున్నాడు. ఈతడే బసవపురాణమునను, వృషాధిపశతకమునను, మఱి పండితారాధ్యచరిత్రముననే యితరస్థలములందును వ్రాయు భాష 'జాను తెను' గనియు దెలిపియున్నాడు. ఈ 'జాను తెనుగు' పదము మొదట నన్నిచోడుని 'కుమారసంభవమున' బొడ సూపినది. క్రమముగా శివకవు లెల్లరు తాము 'జాను తెనుంగున' గావ్యరచన మొనరించెదమని తమతమ కావ్యారంభముల దెల్పుకొనియున్నారు. ఈవిధముగ 'జాను తెను' గన్నను, 'దేట తెను' గన్నను సమానార్థక ముగా గ్రహించుటకు బాధకములు కానరావు. ఈ పదమునకు గల యర్థము సమగ్రముగా నిర్ణయింపవలసి యున్నది.

'జాను తెను' గను పదమును సూర్యరాయాంధ్ర నిఘంటువు శబ్దపల్లవముగా గ్రహించి "జాను తెనుగు = తేట తెనుగు, స్పష్టముగా దెలిసెడి తెనుగు" అని వ్రాసి శివకవుల ప్రయోగములను జూపినది. కాని, 'తేట తెను' గన్న పదమును గ్రహింపనే లేదు. ఈ యర్థవివరణము తృప్తిగా గాన్పించదు; మఱి యది సమగ్రమును గాదు. ఈ యర్థ మాయా ప్రయోగముల కన్వయించినపు డీ విషయము గోచరమగును. మఱి, వృషాధిపశతకము ననుసరించి 'జాను తెను'గన్న నచ్చ తెలు గని భ్రమ కలుగుచున్నది :

"బలుపొడతోలుసీరయును
బాపసరుల్ గిలుపారు కన్ను వె
న్నెల తల సేదు గుత్తుకయు
నిండిన వేలుపుటేరు వల్గువూ
సలు గల యోని లెంక వని
జానుదెనుంగున విన్నవించెదన్
వలపు మదిన్ దలిర్ప జనవా
బసవా బసవా వృషాధిపా."

ఇందు ప్రయుక్తము లగు పదము లన్నియు నచ్చ తెలుగుపదము లగుటచే 'జాను తెను' గన్న నాచ్చి కాంధ్ర మని తేలుచున్నది. ఈ యుద్దేశము సరి కాదని సంస్కృతాంధ్రపదసమ్మిశ్రితములైన బసవపురాణపండితారాధ్యచరిత్రములు ఋజువపఱచుచున్నవి. ఈ గ్రంథములలో నుపయోగింపబడిన భాషయు 'జాను తెనుంగే' యని యేతత్కావ్యకర్త మందే తెలుపుకొనియున్నాడు గదా. కావున 'జాను తెను'గన్న నచ్చ తెల్గుగు కాదు.

మఱి బసవపురాణ పండితారాధ్యచరిత్రముల ననుసరించి జాను తెను గన్న దేశీయేతివృత్తము, దేశిచ్ఛందము, దేశిపదముల విస్తారప్రయోగము గల యాంధ్రభాష యని స్పష్టమగుచున్నది. ఇంత యర్థమా పదమునకు గల్పించియే శివకవులు వాడియున్నారు. ఇందు దెను గన్న సంస్కృతపదయుక్తమగు నాంధ్ర భాష యనియు, నది యనన్వయక్లిష్టత, శబ్దాడంబరము, చిత్రవిచిత్రాలంకారభేషజము లేక మంజులమై సరసమై విస్పష్టమై యొప్పు భాషయే జాను తెను గనియు గవిభావము. ఇంత భావముతో శివకవులు వాడిన 'జాను తెనుగు' పదమునకు 'స్పష్టముగా తెలిసెడి తెను' గని సూర్యరాయనిఘంటువు, స్వచ్ఛమైన తెలు గని బ్రౌణ్యనిఘంటువు నిచ్చిన యర్థము లసమగ్రములు. శబ్దరత్నాకరము జాను తెను గన్న మాటనే గ్రహింపలేదు.

ఈ యర్థముననే 'తేట తెనుగు'ను బ్రయుక్తము.

"తొమ్మిది రసములు తొలుకాడ వాని
యిమ్మడి వర్ణన లెసగ దద్ద్విగుణ
మగు నలంకారంబు లసలార వాని
ద్విగుణార్థభావనల్ దీటుకొనంగ
దేట తెనుంగున ద్విపద రచింతు."

అని పండితారాధ్యచరిత్రమున బాల్కురికి సోమనాథుడు పై యర్థమును సూచించుటకు జాను తెనుగునకు బర్యాయముగా దేట తెనుగును వాడియున్నాడు. పదునెన్మిదవ శతాబ్దమునకు జెందిన ఘట్టుప్రభువు తన 'కురాభాంకేశ్వర' మనునీకావ్యప్రబంధారంభమున-

"అట్టి కథ తేట తెనుగున నతులమృదుల
సరసమాధుర్యవాక్యముల్ సంఘటించి
కవుల కరుణావిశేషంబు కలిమికతన
విశ్వపతి కంకితంబుగా విన్నవింతు."

అని చెప్పుకొని 'అతులమృదులసరసమాధుర్య వాక్యములు' కలిగి యచ్చతెలుగుమాటలు హెచ్చుగను, సంస్కృతపదములు సరళములుగను నలరారు నాంధ్ర భాషను దన ప్రబంధము నడపించినాడు. కావున నై ప్రయోగముల ననుసరించి సాభిప్రాయములగు జాను తెనుగు పదములను బూర్వనిఘంటువులు గైకొని సమగ్రమగు నర్థము నొసగియుండవలసినది. మఱి, తేటతెలుగు = Pure Telugu అని పదముగా గ్రహించి యర్థమిచ్చిన బ్రౌనుదొర 'తేట' యను పదముక్రింద 'తేట తెలుగు = Plain Telugu (like plain English: that is undisguised simplicity of style)' అని వివరించియున్నాడు. అనగా వ్యక్తత లేక అతిస్పష్టముగా నర్థమగు శైలి గల తెలుగుభాషను దేటతెలుగందురని యాతని భావము.

ఇంతకు దేలిన దేమనగా: జానుతెను గన్నను, తేటతెను గన్నను నొక్కటే. తేటతెను గన్న నచ్చ తెలుగు కాదు సంస్కృతము కలిసిన తెనుగును దేట తెనుగు కావచ్చును. విస్పష్టమగు భావబోధనము, అన్వయక్లిష్టత లేకపోవుట, సంస్కృతపదములకన్న మిన్నలుగ దెలుగుపలుకులు నానుడులు యథోచితముగ వాడుట, అలంకారాదులు పాండిత్యప్రకర్షకు, శ్లేషజ మునకు గాక రసపోషణ కుచితము లగునంతవరకే ప్రయోగించుట, పదములకు మార్దవము, మాధుర్యము నుండుట—ఇవి యన్నియు దేటతెనుగులక్షణములు. ఇంత యర్థమును మనసున బెట్టుకొని యిట్టి మృదు మధురాంధ్రభాషను జానుతెనుగు, తేటతెనుగను లలిత నామమున సృష్టించి యల్లారుముద్దుగా పెంచి పోషించి మనకు మార్గదర్శకులైన శివకవుల కాంధ్రు లెంతయు ఋణపడియున్నారు. పరసేవాపరాంధానుకరణమున భావదాస్యమున కలవడిన భారతజాతి స్వాతంత్ర్య ప్రాప్తితో నైసర్గిక ప్రతిభావిరాజిత మగుచున్నట్లే సత్వరాంధ్రరాష్ట్రసిద్ధితో సజీవమగు తెలుగునే రాజ భాష నొనర్చి నిసర్గమైన తెలుగుబాస యందచంద ములు జూరగొని తెలుగువారికి జూపియిచ్చుట తెలుగు పండితుల ధర్మము. శివకవులు మనకు జూపి విడిచిన తేటతెనుగుతీగ నవజీవముతో మన తెలుగునాట తొందరలోనే యలముకొనుగాక!



భారతప్రధానామాత్యుని నూతన అధికార నివాసస్థానము

# భట్రాజులు

[కథానిక]

●

**శ్రీ కందుకూరి లింగరాజు**

సుందరిని ఎల్లా మార్చడమా అన్నది పెద్ద సమస్య అయిపోయింది రాజాకి. పెళ్లి అయినప్పటినుండీ చూస్తూనే వున్నాడు, అదే వరస. మారుతుందేమో అని కొన్నాళ్ళు ఎదురుచూచేడు; కాని అనుకున్న మార్పు రానేలేదు. ఎదురుచూచిన ఆనకట్టు కట్టబడనేలేదు.

రోజులు గడిచేటప్పటికి ఇది చాలా బాధించే విషయంగా తయారై కూర్చుంది. ఒక్కదాన్లోనే కాదు, ప్రతీ చిన్న విషయందగ్గరనుంచి అదే వరస, అదే వావి.

మొదట్లో తను సంసారం అంటే ఇల్లాంటి భావన అని వూహించుకోనందుకు తిట్టుకున్నాడు. తను అన్ని కోణాల్లోనూ వూహించి నిర్ణీతంగా, సమానఫాయిదాలో ఒకళ్ళ కొకళ్ళు త్యాగం చేస్తే, శకటం ఏ ఇరుకుల్లోనూ పడకుండానే నడుస్తుం దనుకున్నాడు. కొంచెం కష్టమయిన పరిస్థితులు ఆవృతంఅయినా త్యాగం చెయ్యడం నేర్చుకున్నాడు.

ఇప్పుడు సుందరివరస చూస్తే ఉక్కిరిబిక్కిరి అవుతోంది. తనేమైనా మారితే? ఈ ప్రశ్న చాలా సార్లు వచ్చింది. ఇల్లాంటి విషయంలో, అందులోనూ భార్యాభర్తల మధ్య అది నీచంగా కన్పించేట్టుగానే వుంది.

వచ్చినప్పటినుంచీ ప్రారంభించింది. "మీరు చాలా తెలివైనవారు, కవులు, చదువుకున్నవారు, అనుభజ్ఞులు" అంటూ చదవడమే. కాఫీ త్రాగడం దగ్గరనుంచి ఆఖరికి మంచంమీద నిద్రపోయేవరకూ—సందర్భం వుండనివ్వండి, లేకపోనీండి—ఇది చదివెయ్యడమే!

కొన్ని సమయాల్లో చాలా చిరాకు అనిపించేది రాజాకి. కొన్నిచోట్లల్లో కోపం వచ్చేది. కొన్నిసందర్భాలలో నవ్వు కలిగించేది. ఎల్లాటి సమయానుకూల అరిషడ్వర్గాలు వచ్చినా అతనికి న్యూనతగానే వుండేది. తన పెళ్ళాం తనను భట్రాజులా పొగడ్డం చూస్తుంటే తల తీసేసినట్టే అయ్యేది.

చాలాసార్లు ఆక్షేపించేడు. అయినా సుందరి మారనే లేదు. తను భరించలేకనే, అనుకుని, కట్టుకున్న సౌధాలన్నీ నేలమట్టమైపోతున్నాయి దాంపత్యంలో. ఏవిధంగా తను మారాలో తెలియటం లేదు. ఏవిధంగా, అనునయంగా, విరక్తిలో, కోపంలో, లాలింపులో వ్యవహరిస్తే అది మానుతుందా అన్నది సమస్యే అయింది.

స్నేహితుణ్ణెవర్నయినా సలహా అడగ్దామనుకుని, ఓరోజు బయల్దేరేడు. దారిలో, సగందూరము వెళ్ళేటప్పటికి, ఈ స్వవిషయాలు శాస్త్రితోనూ, గోపితోనూ—ఎంత స్నేహితులైనా—ఎల్లా మాట్లాడుతా ననుకున్నాడు. ఓవిధమైన న్యూనత కలిగింది. దుములింపుతోనే ఆలోచన తెగక ఇంటికి వచ్చేడు.

దారిలో, సుందర్రామయ్య కనిపించేడు. "ఏరా! ఎల్లా వున్నావ్?" అని నిలతీసినట్టే అడిగేడు. ఏం చెప్పడానికీ తోచనేలేదు. చెప్పుదామా, ఏమైనా ఆలోచన చెపుతాడేమో అని లోపలున్న గుబగుబ నాలికచివరివరకూ వచ్చింది; అయినా సంశయించి, ఏదో లోకాభిరామాయణంతో తన అడ్డరోడ్డుదగ్గర విడిపోయేడు.

వస్తుంటే, రోజూ కనపడే నవ్వుమొఖంతో అడిగే పువ్వులసాయిబు "బాబూ, పువ్వు లిమ్మంటారా?" అన్నాడు. తీసుకువెళితే సుందరి ఓవిధంగా తనకు వెగటు కలిగించే మార్గంలో మాట్లాడుతుంది. దానికి తాను తట్టుకోలేడు. 'అక్కర్లే'దని చెప్పేడు.

సగం దూరం వచ్చేసేక ఎందుకో పువ్వులు తీసుకోనందుకు హృదయం గుబగుబలాడింది.

దారిలో వస్తుంటే ప్రక్కవాళ్ళ కిటికీలోంచి లోపలికి చూచేడు. "రాణీ! నువ్వు ఎంత అందంగా ఉన్నావనుకున్నావ్! నిన్ను చూడ్డానికి వచ్చినపుడు ఏమైనా మందు జల్లేవా?......" ఆ వరసలో మాటలు వినిపించేయి.

ఒక్కసారిగా అవి ఏదో క్రొత్తగా కిటికీ తెరచినట్టే అయింది రాజాకి. తనూ ఇకనుండి సుందర్ని ఈవిధంగా భట్రాజత్వం ప్రారంభిస్తే...... సబబుగానే వున్నట్టే వుంది. కొన్నాళ్ళకి ఆవిడకి విసుగొత్తి...మానేస్తుందేమో...

ఆలోచనలు చుట్టుకుంటుంటే అడుగులు జోరుగానే వేసి గుమ్మం ఎక్కేడు. జోళ్ళు విడిచినపుడు "ఎల్లా ప్రారంభం చెయ్యడం?" అన్న సంశయం వుములుకుని కాస్త తచ్చాటపడ్డాడు.

భోజనానికి కూర్చున్నాడు. మల్లెపువ్వులు తెచ్చివుంటే సమవుజ్జీగా సమరం ప్రారంభింపబడి వుండేదే అనుకున్నాడు. కందిపప్పుపచ్చడి, ఉల్లిపాయలపులుసు, చేదుచేదుగా వున్న క్రొత్తఆవకాయ.

"పచ్చడిలో ఆ రవ్వంత ఇంగువతోనూ ఎంత కమ్మదనం వచ్చిందనుకున్నావ్!" కనుకొలుకుల్లోంచి చూస్తూనే, 'ముఖకవళికలు ఎల్లా వున్నాయ్? తన ప్రారంభం అనుమానం తగలకుండా వుందా?' అని చూచేడు. సుందరికళ్లు ఓసారి మెరిసి "ఏం పొగుడుతారు లెద్దురూ" అనేసింది.

రాజాకి ఆ ముక్కలు కోటలో పాగా వేసినట్టే అయింది. ఆరోజున నెమ్మదినెమ్మదిగా, తన అలవాటులో వున్న కవిత్వంలో అన్నిపదార్థాలనూ, ఆఖరుకు కొంతిపొడి, కరివేపాకు, నిమ్మరసము వేసిన మజ్జిగతోసహా పొగిడేసేడు.

ఆరోజురాత్రి తను వస్తుంటే కిటికీలోనుండి విన్న ముక్కలను చెవులో సమయానుకూలంగా వూదేస్తే, సుందరి నెమిలే అయిపోయింది. రోజూ రాత్రి ఏదో సందర్భంలో తనను పొగడ్డం ప్రారంభించే సుందరి, అది మరచిపోయి మురిసిపోవడం చూచి, గుండెలమీద చేతులు వేసుకుని సుఖంగా నిద్రపోయేడు.

మర్నాడు అప్పుడప్పుడు తన నూత్నపాఠం అమల్లో పెట్టడంతో సాఫీగా గడచిపోయింది. అనుకున్న మార్పు రావడంతో వెన్నెల కమ్ముకున్నట్టే అయింది. ఆరాత్రివేళ ఆ దంపతులకు—తన గురువులకు ఏ ఈనాం అయినా పట్టుకువెళ్ళి ఇద్దామన్నంత సంతోషం కలిగింది.

రెండు రోజులు క్రమేణా అలవాటులో పడ్డాయి. ఆరోజుల్లో ఒకటే అరా సమయంలో సుందరి కాస్త పాతరస్తాలో పడ్డా వెనక్కి నెట్టేసుకుని, రాజా వేసిన ఉచ్చుల్లో ఉక్కిరిబిక్కిరి అయిపోయింది.

రాజా ఈ మార్పు ఇంత త్వరితంలో వస్తుందని అనుకోలేదు. తను బాగా పురాణం ప్రారంభిస్తే అసలు తగ్గిపోతుందికదా అన్న తలంపులు చిమ్ముకోవడంతో, ప్రొద్దుటే లేచినదగ్గరనుంచి రాత్రివరకూ, ప్రతి విషయంలోనూ తన పాఠం వల్లించడం మొదలుపెట్టేసరికి, సుందరికి దారీ తెన్నూ తెలిసింది కాదు.

ఇదివరకటి రోజుల్లో రాజా ఇల్లా ఎప్పుడూ మాట్లాడేవాడే కాదు. ఆ మొదటి రోజుల్లో తప్ప మొఖం ఎప్పుడూ ధుమారింపుగానే వుండేది. ఏదో న్యూనత పడ్డట్టే వుండేవాడు. న్యూనత...

ఈ రోజుల్లో తనకే ఓవిధంగా న్యూనత పొందుతున్నట్లు అనుమానం తట్టింది. తన భర్త తనను పొగడ్డంలో, అందులోనూ కుంపటి అంటించడందగ్గర నుండి పొయ్యి అలికేవరకూ కూడాను. తను నడిస్తే హంసలు నడిచినట్టు వుందట. నవ్వితే మాణిక్యాలే రాలేటట్టు వుందట. కాఫీ అమృతంలా కాస్తున్నానట. కూరలూ అవీ నలభీమపాకమేనట!

వింతగానే వుంది. అంతగా పొగిడే వేళాకోళం చెయ్యడమేమో అని ఒకటి రెండుసార్లు ఊహించుకుంది. ఆయన మాటలు మొదటి రెండుమూడు రోజులూ కొంచెం ఆనందాన్ని, గర్వాన్ని కలిగించజేసేయి కాని ఇప్పుడు మాత్రం బాధపెడుతున్నై.

ఎంచేత తన రాజా ఇల్లా మారేడా అని ఆలోచించడం ప్రారంభిస్తే అంతూ పొంతూ చిక్కలేదు. తనేమైనా తన పుట్టింటివారు గొప్పవారు, డబ్బున్నవారు అన్న అతిశయంలో మాట్లాడేనా? దాని పరిణామమా? అని సింహావలోకనం చేసుకుంది; కాని అది నిరుక్తైన కారణంలా కన్పించనేలేదు. ఆఖరుకి ఇదివరకటిలా వాళ్ళమ్మగారు వ్రాసిన ఉత్తరాలు పెట్టెలో, చూపించ

కుండా పెట్టడంకూడా మానేసి, ముందరే ఆయనకు ఇస్తోంది. మరి... ?

అవ్వాళ రాజా మల్లెపూలు ఒక్కటే కాకుండా, ఏవో తినుబండారాలు హైదరాబాద్ స్వీట్‌స్టాల్సులో కొని తీసుకువచ్చేడు. పువ్వులు జడలో తురుముకునేప్పుడే "రాణీ! ఎంత అందంగా వున్నావనుకున్నావ్! రంభ, తిలోత్తమ, మేనక... కాంచనమాల, కన్నాంబ...వీళ్ళంతా నీ కాలిగోటికైనా సరిపోరు..." అతను మొదలుపెట్టేడు.

ఇంతగా ఎప్పుడూ గతించిన రోజుల్లో సన్నివేశం శృతిమించలేదు. చెయ్యి పువ్వుల్లో వణికింది. హృదయం ఒక్కసారి ఆగిపోయినట్టే వుంది—ఏం చేతనో? తల్లో పెట్టినవి సరగ్గా సరిచేసుకోలేకపోయింది.

అనుమానం కొంచెం వెన్నెముకకు పూసుకుంటే సుందరి నవ్వలేకపోయింది. ఇది రకు ఈ భట్రాజత్వాన్ని సుముఖంగా, యాదాలాపంగానే తీసుకుంది. ఈనాడు అది అతీతం అయింది. అందులో న్యూనత, కుమిలింపు కన్పిస్తే ముడుచుకుపోయి ఆలోచించడం ప్రారంభించింది.

"నిజంగా నువ్వు ఆ చెయ్యి వెనక్కి తిప్పినప్పుడే, అజంతా, ఎల్లోరాల్లో చెయితిరిగిన కళాకారుడు చెక్కిన భంగిమలా వుంది......"

ఉండేలుదెబ్బ తగిలినట్టుగా తగిలింది. అల్లాగే బాధతో కళ్ళుప్పగించి ఓలా అయింది. ఇది చూచేటప్పటికి రాజాకి అరికాళ్ళు మంటలెక్కినట్టయింది. తను దేనిని ఉపయోగించుకుని ఇన్నిరోజులూ రక్షణ పొందేడో అది పగిలిపోయింది. నాలిక్కొరచుకున్నాడు అతిగా వెళ్ళినందుకు; అయినా తరణోపాయం ఎవర్ని అడగాలో తెలియనటువంటి శూన్యం అయింది.

సుందరికి కళ్ళమ్మట నీళ్ళు తిరిగేయి—తను ఊహించుకుని ప్రేమించిన భర్త తన్నే ఇల్లా న్యూనతపరచి మాట లంటాడని. వాటిల్లో పెడర్థాలు ఎన్నో కనిపించేయి...ఆ గద్గదకంఠంతోనే "ఏమండీ, నే నేం చేసేనని ల్లా ఏడిపిస్తారు?" దగ్గిరసా వచ్చింది.

ఇంక విచిత్ర సన్నివేశంలో పడతానని రాజా ఎప్పుడూ అనుకోలేదు. తను ఆశించిన అంతానికి సమయం రాలే దన్న తలంపులోనే ఉండిపోవడంవల్ల ఆశ్చర్యం తలెత్తుకోనివ్వకుండా, తప్పిదం చేసి క్షమాపణ ఇచ్చేట్టే చేసింది. సౌమ్యదిగా తన కున్నావులలో కళ్ళు తుడుస్తానే అనునయంగా, మానంలో మునిగిపోయేడు.

"మిమ్మల్ని ఏమన్నానని, గతవారంనుండి అల్లా మొదలెట్టేరు? నాకు ఊరేసుకున్నట్టే అవుతోంది. అందులోనూ మీరు..."

తన కారణం చెప్పేసి తుని తగవు చేసుకుందామంటే ధైర్యం చాలీ చాలనట్టయితే "నువ్వుమాత్రం..." ఈ ముక్కలు ఎల్లాగో అనగలిగేడు.

"నేనా?"

తలూపేడు. "కాపురానికి వచ్చినప్పటినుండి నువ్వు మాత్రం...నా మట్టుకు నే నెంతగా బాధపడ్డానో..." ఈ వరసలో తుదా మొదలూ కూడా చెప్పుదామనుకున్నాడు. ఆ సమయంలో మాటలు కరువయ్యేయి.

అతను మూగగా వుండిపోవడంలోని బాధ సుందరికి క్షణికంగా తను మొదటిరోజుల్లో ఆయన్ని భట్రాజత్వం చేసిన అంశాలు జ్ఞాపకం చేస్తే ముడుచుకుపోయింది. తనను ఆ మార్గంలోనుంచి మార్చడానికే...ఈ వూహ సమంజసంగానే తట్టింది.

"నేను అంటున్నానని...మీరూ..." జబ్బలు పట్టుకుని ఊపినట్టుగానే అంది. దీంతో తల్లక్రిందులే అయ్యేడు రాజా. "నీవు నేర్పిన..." ఆ పద్యం జ్ఞాపకం వచ్చింది. ఎంచేతో నోటమ్మట మాట రానేలేదు. మూగతివ్వంలో తలూపేడు.

"ఇంకెప్పుడూ నేను అనను. మీరుకూడా..." గునిసింది.

ఏమిటో ఆ ఉప్పునీళ్ళు తుడుస్తున్నప్పుడు భట్రాజులు చెరిగినట్టే కనిపించింది. ఆనందంలో ఒక్సారి హృదయం ఎగిరిపడింది.



పశువులకాపరిని తన్నాను



బండి తోలేవాడిని తన్నాను



పాలు తీసేవాడిని తన్నాను



కసాయివాడిని తన్నాను

తలిశెట్టి రామారావు

## గోవుల ప్రగల్భాలు

(బ్రిట్‌స్టల్ గారి చిత్తరువున కనువాదము)

చిత్రకారుడు : శ్రీ. శ్రీ. శ్రీ తలిశెట్టి రామారావు.

# సారస్వతము - సాహిత్యము

శ్రీ కొండూరు వీరరాఘవాచార్యులు

కామరూపిణి యగు సరస్వతి సర్వత్రసంచారము గల కామచారిణిగూడను. సర్వత్ర వ్యాప్తి (ప్రసరణము) గలది కాబట్టి సరస్వతి యని వ్యుత్పత్తి సిద్ధమైనది. అనగా వాగధిదేవతయగు వాణి యని యొక యర్థమును, వాక్కని రెండవ యర్థమును గన్పట్టుచున్నది. దివ్య స్వభావము గల దేవతకు సర్వతో వ్యాప్తి నిశ్శంకము. అట్లు వాక్కునకు సర్వవ్యాపకస్వభావము గల దనుటలో నాక్షేపము లేదుకదా! ఇట్టి సరస్వతికి సంబంధించినదే సారస్వతము; అనగా శబ్దార్థస్వరూపమగు సమస్తవాఙ్మయము నని తేలుచున్నది. వేదశాస్త్ర పురాణేతిహాసకావ్యనాటకచరిత్రజాలమంతయు సారస్వత మని చెప్పనొప్పును. సారస్వతశబ్దముతో గూడ సాహిత్యశబ్ద మొకటి మనకు వినబడుచున్నది. ఈ రెండును సమానార్థకములా, లేక భిన్నార్థకములా యనియు, సామాన్యవిశేషార్థబోధకములా యనియు నీ వ్యాసమున విచారించుదము.

భారతీయులు నిఖిలవిద్యలకును అధిదేవతగా సరస్వతి యను నొక దేవిని భావించి, యామెను బ్రహ్మదేవుని ధర్మపత్నిగను, సత్యలోకనివాసినినిగను వర్ణించియున్నారు. సమస్తవిద్యాశక్తులును నీమెయనుగ్రహమున దేజరిల్లవలసినవే యని భారతీయుల హృదయము. శబ్ద (నాద) రూపబ్రహ్మమయం దాయన కర్ధాంగలక్ష్మియై వాగ్రూపభారతి విరాజిల్లుచున్నది. అనగా నిచ్చట శబ్దము లేనిది వాక్కు పుట్టకుండుట భావింపవలయును. అర్థరహితశబ్దమునకు వాగ్వ్యపదేశము చెల్లదు కనుక వాగర్థముల కున్న యైక్యము నిరంతరము. శబ్దార్థరూపమగు నీ సాహిత్యము సృష్టిలో జగత్పితలగు శివాశివులయెడనే కాక సమస్తదంపతులయెడను మనము సాక్షాత్కరించుకొనవచ్చును. సత్యమును, విచిత్రమును, నగు నీ ప్రకృతిపురుషరహస్యమును సమస్తభావముల యెడ నారోపించి సమన్వయింపగలిగిన భారతీయప్రతిభామహిమ లోకోత్తరము. ఈ పరమార్థమును యథాతథముగను, కవితాసుందరముగను గర్భముచేసికొనజాలకున్న విప్రతిపత్తులు, వివాదములు సిద్ధమగును.

ఇపుడు చూడుడు: సరస్వతీమాతయొక్క సమగ్రస్వరూపమును సారస్వతముగా మనము చెప్పుకొనవచ్చును. సారస్వతేయులగు సరస్వతీపుత్రులు తల్లికడ నాశించు మధురపదార్థ మేది? తనకంటె భిన్నమగు నే ప్రియవస్తువునుగాని బిడ్డల కిచ్చి తల్లి వారి నమృతుల నొనర్పలేదు. తనయం దపృథక్స్థితిమైయున్న శక్తిని వారిలో బ్రవేశపెట్టినగాని ప్రియజననియాత్మరూపములో సుతులు తాదాత్మ్యము నందుకొనజాలరు. సర్వగతయగు మాతృదేవితో సారూప్యము నందిగాని సుతులకు చరితార్థత గలుగదు. ఈవిధమగు నాత్మరూపసంసిద్ధికి జనని ఆత్మభిన్నపదార్థములను వారికి జవిచూపక, తాను జీర్ణించుకొన్న సర్వపదార్థముల సారమునే వారికి బిండుచున్నది. అదియే మధురతర స్తన్యధార. ఆ ధారనానియే కదా శిశువు శారీరక, మానసిక, ఆత్మిక బలములను జేకూర్చుకొని కృతార్థుడగుట!

ఈ యర్థము లోకమునందువలె సరస్వతీలోకమునందును సిద్ధము. అక్షరరూపిణియగు బ్రాహ్మీదేవి అమృతస్తన్యములను బిండు పాలిండ్లు రెండు—ఒండు సంగీతము; రెండు సాహిత్యము.

"సంగీత మపి సాహిత్యం
సరస్వత్యాః స్తనద్వయం,
ఏక మాపాతమధురం
అన్య దాలోచనామృతం"

రాగతాళలయాత్మకమగు నాదామృతము వినుటతోడనే భావనారహితముగనే మానసోన్మీలనము గావించి యేకాగ్రతాపూర్వకముగ బ్రహ్మానందమును గలిగించును. శ్రవణమాత్రరమణీయత యిం దుండుటం బట్టియే "శిశు ర్వేత్తి పశు ర్వేత్తి వేత్తి గానరసం ఫణీ"— శిశువునకుగాని, పశువునకుగాని, పామునకుగాని యిది యానందాపాది కాగల్గినది. రెండవదగు సాహిత్యస్తన్య మట్టిది గాదు. ఆలోచించినకొలదిగాని యది యానందమును గలిగింపజాలదు. అనేకపదార్థములు నమలినకొలది రుచ్యము లగునట్లు సాహిత్యముగూడ భావుకుని భావనాబలముకొలది మాధుర్యమును జిందుచుండును. ఇది పెక్కుగ సాహితీరసికుల యనుభవములో నున్నదే. ఇందుకు గారణము సాహితిలో రసముండుట. అన్యాన్యపదార్థములవలె సాహితి నీరసము గాని, విరసము గాని కాదు. మఱి సరసము; రసబంధురము. నీరసవస్తువు లానందకందములు కావు. రసమే యానందప్రదము, ఆనందస్వరూపము. కావున నీ

శ్రుతియు "రసగ్ం హ్యేవాయం లబ్ధ్వానందీ భవతి"—మానవుడు రసపాన మొనర్చియే యానందసిద్ధి నందు ననుచున్నది.

శిశువునకు మాతృరూపసందర్శనము సంతోషహేతువైనను జీవనమునకు స్తన్యపాన మపేక్షిత మైనట్లు సారస్వతీయుని లలితజీవనమునకును వాఙ్మయమున కంటె అందలి సారములగు సంగీతసాహిత్యము లవశ్యాపేక్షణీయము లగుచున్నవి. అనగా మాతృరూపములో స్తన్యములకున్న ప్రాధాన్యము వాఙ్మయరూపములో సంగీతసాహిత్యముల కున్న దన్నమాట.

అయిన నింక సారస్వతముకంటెను సాహిత్యమునకు గల విలక్షణత యేమో గాఢముగా విచారింపవలయును. సారస్వత మన్నపుడు వేదములుగాని, శాస్త్రములుగాని, చరిత్రములుగాని వాఙ్మయశాఖకు జెందిన వేనినైనను గ్రహింపవచ్చును. సాహిత్య మన్నచో రసాత్మకము, రమణీయార్థప్రతిపాదకము నగు గద్యపద్యాదివాఙ్మయమునకే ప్రాధాన్యము. విషయమును బోధించుటకు వాఙ్మయము చాలును. కాని సరసముగను, కళాబంధురముగను విషయమును బోధించి కర్తవ్యోపదేశము చేయవలె నన్న లలితమగు సాహిత్యమునకే సాధ్యము. అందుకే సాహితీశాఖకు జెందిన గ్రంథకోటిని కాంతాసమ్మిత మని పెద్దలు నిర్దేశించియున్నారు. విషయజ్ఞానపూర్వకమైన సద్యఃపరనిర్వృతిని గలిగించు శక్తి సాహిత్యమునకే కలదు. అర్థమును మనోహరముగ బోధించు కావ్యముగాని, రూపకముగాని, కథగాని, నవలగాని, గేయముగాని, చివరకొక్క వాక్యముగాని అది యంతయు సాహిత్యాంతఃపాతిగనే లెక్క. సారాంశ మేమనః రసరంజితము, కళాభరితము, ఔచిత్యయుతము, రమణీయార్థబంధురము నైన వాఙ్మయ మెల్ల సాహిత్య మనియు, కేవలవిషయబోధనమున కుద్దేశింపబడిన వాఙ్మయ మంతయు సారస్వత మనియు. సామాన్యవిషయ పరిజ్ఞానాకాంక్షులకు సారస్వతము చాలును. కళామృతపిపాసువులకు సాహిత్యము కావలయును. ఈ సాహితీరసపానము భావుకుల కానందాపాది.

వేదములు మున్నగు వాఙ్మయప్రపంచమున గూడ సాహితీస్పర్శ యుండవచ్చును. కాని యీ స్పర్శ సత్యభంగమును గల్గించునది గారాదు. కావుననే పలువురు చరిత్రకారులు సత్యభంగము ప్రసరించునేమో యను భీతిచేత తమ చరిత్రవాఙ్మయమున కవితారసమును గలుపుట కొప్పుకొనరైరి. మాధుర్యాపేక్షచే సాహితిని సారస్వతములో గలుపుకొన్నను, పాలు నీరు కలసినను అందలి మాధుర్యగుణము క్షీరములదే యైనట్లు సారస్వతములోని రంజనశక్తియు సాహిత్యములోనిదే యనుట సత్యము. సాహితీసారస్వతభేదజ్ఞానులగు భావుకమరాళము లా రెంటి పార్థక్యము దెలియగలరు.

సాహిత్యసారస్వతములు రెంటియందును కర్తవ్యోపదేశమున సరసమార్గమును ద్రొక్కునది సాహిత్యమే. అందుకే "హితముతో గూడినది సాహిత్య" మని యొక్క వ్యుత్పత్తి దానికి చెల్లుచున్నది. ఏ విషయ మెంత జటిలవిషయమునేనియు సులభముగ హృదయంగత మొనర్పగలుగుటచేత వేదశాస్త్రపురాణాదులలోని నానావిషయముల కలయికయగు దీనిని సాహిత్య మనియు చెప్పుదురు. ఇప్పట్టున కేవలశబ్దభాషాజ్ఞానమును సాహిత్య మని చెప్పుటయు న్యాయము కాదు. అయ్యది భాషాజ్ఞాన మగునుగదా! భాషాజ్ఞానమునకు, సారస్వతపరిజ్ఞానమునకు, సాహిత్యవిజ్ఞానమునకు జాల నంతరము. ఉత్తరోత్తరోన్నతములగు వీని జ్ఞానమునకు శబ్దార్థజ్ఞానము మొట్టమొదటిది. అందుకే శబ్దార్థశాసనజ్ఞానమాత్రముచే కావ్యకళాపరిజ్ఞానము గలుగ దని యానందవర్ధనాచార్యుడు పలికినాడు.

రమణీయమగు మాతృస్వరూపములో స్తనసంపద అపృథక్సిద్ధమై యున్నను, శిశుజీవనహేతువగు స్తన్యమును గలిగియుండుట యను గుణముచే వానికి విశిష్టత చేకూరుచున్నది. ఆ రీతిగా సరస్వతికి సంబంధించినది సారస్వత మనుటచేత సంగీతసాహిత్యములకును సారస్వతశబ్దము చెల్లినను విశిష్టార్థము ద్యోతిత మగుట లేదు. అందుకే శ్లోకకారుడు సంగీతసాహిత్యములను సరస్వతీ మాతృస్తనములుగా వర్ణించి, సాహిత్యగుణవైశిష్ట్యమును, సరస్వతీమాతృభావప్రేరితమగు జగదుపాస్యభావమును వ్యక్తము చేసినాడు. చేయునది సరస్వతీసంబంధమగు సాహితీసముపాసనము. కలుగునది బ్రహ్మానందసబ్రహ్మచారి యగు రసానందము. అనగా మాతృమూలమున పితృప్రాప్తివలె సరస్వతీముఖమున బ్రహ్మానందప్రాప్తి. ఇయ్యది ఆద్యవిద్వాంసులగు వైయాకరణుల స్ఫోటవాదమునకు దూరము కాదు. ఆ వాదమును రససుందరము చేసిన సాహితీసుందరి అగుగాక.

ఒకప్పుడు సారస్వతశబ్దముచేత సాహిత్యమును బేర్కొన్నను సాహిత్యశబ్దముచే మాత్రము సారస్వతమును బేర్కొనగాదు. వ్యవహారములలో నియ్యవి పర్యాయములుగ కవులచే ప్రయుక్తములై యున్నను సూక్ష్మేక్షికచే బరిశీలించిన నేతాదృశమనోహరవిశిష్టార్థస్ఫూర్తి యనివార్యముగ నున్నది. ఇయ్యది భారతీయ పద్ధతియొక్క కవితాహృదయమునకు, ఆధ్యాత్మిక సంపత్తికి నిదర్శనము.

# రాత్రిదేవీసందేశము

[ఏకాంకిక]

●

శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రి

## ప్రథమ రంగము

(దాల్భ్యాశ్రమము : రాజగృహారామము. శిలా వేదిక చెంత ఆశ్చర్యపడి చూచుచున్న సుమేధ ప్రవేశించును.)

సుమే : ఏమిటిది ?...ఈ పువ్వులన్నీ నేను కోసినవేనా ? అయ్యో ! ఎంత మైమఱపు ?... ఎవరైనా చూచి యేమనుకొందురో ! సిగ్గుచేటు. (పరిక్రమించుచు) పరాధీనల కింత పరవశత్వము తగదు. అది చూచుకొన్న వేళావిశేషమో, సుగుణపక్షపాతమో, పూర్వజన్మపరిచయభాగ్యమో ! మా హృదయములను రాగరసమున నత్తుకొన్నవి...అయితే మాత్రము, ముందువెనుకలు పరికింపక తహతహపడి చేయున దేమున్నది ? (ఆలోచించి) ఏమీ కనబడదు. 'సుమేధ బుద్ధిమంతురా'లని యా మహర్షి యభిశ్లాఘించుచున్న దేమి ? 'శ్యావాశ్వుడు సద్గుణముల మేటి' యని యీ మహారాజు మెచ్చుకొనుచున్న దేమి ? నేడు వారి ప్రయాణముగదా ! ఇప్పటి కీమాట పుట్టలేదు. (ఊహించి) కానీ ! ఏమగునో ! దైవమే శరణము.

(తెరలో) ఎక్కడా కనబడదేమి ? (చుట్టుచూచి) సుమేధా !

సుమే : (బిగ్గఱగా) మంజులా ! వచ్చావా ? రా. (మెల్లగా) ఇది యెందుకు వచ్చిందో ? ఊరకే రాదు. రానీ, మంచిదే.

మం : (ప్రవేశించి చూచి) ఏది కానివేళ తోటకు వచ్చావేమిటి ?

సు : ఆమాటే నిన్నడుగుదామనుకొంటున్నాను.

మం : (నవ్వుచు ముఖము తేఱిచూచి) ఆలోచన కిద్దఱుండవలెనుగదా యని సమయానికి వచ్చాను.

సు : (సస్మితముగా) ఆలోచన కేకాంతము కావలెనుగదా యని నే నిచటికి వచ్చియున్నాను.

మం : (నవ్వుచు) ఎంత గడుసుదానవమ్మా ! (బుజము తట్టి) మా శ్యావాశ్వుడగునేమో కాని, మాట నేర్పులో నీకు సాటి కెందరున్నారు ?

సు : ఈ పొగడ్త కేమికాని, 'మా' అంటున్నావేమిటి ?

మం : సరిలే ! అతడు మా పెత్తాతగారి మనమడమ్మా !

సు : ఔనౌను. మఱపు వచ్చింది. మీ పుట్టింటివారి దాత్రేయాశ్రమమే కాదూ ! (తల యాడించును)

మం : (చిరునవ్వుతో) నీ మఱపూ, నీ పరధ్యానమూ ఏకంగా కోసిపోసిన యీ పువ్వులరాశియే చెప్పుచున్నదిలే !

సు : మంజులా ! ఏమిటా యెకసక్కెము ?

మం : (బుజముపై చెయ్యి వైచి) ఎకసక్కెమంటున్నావా ? ఇంకా నాదగ్గఱ నీ దాపఱిక మెందుకు ? పదియేనురోజులనుండి కనిపెట్టిచూస్తున్నాను, ఎప్పుడైనా ఆమాట యెత్తుతావేమో యని. నాకంటె నీ శ్రేయస్సుకోరే మిత్రురా లున్నదా ?

---

* ఈ యితివృత్తము ఋగ్వేదపంచమమండలములోనిది. నా రచనలో నించుక విస్తరించినది.

సు: (సస్మితముగా) ఏదో కవిత్వ మల్లుచున్నావు. ఋషి వగుదువు కాబోలు! (చెయ్యి పట్టుకొని) నేను దాచిన దేమిటో, నీవు చూచిన దేమిటో చెప్పు చూతాం.

మం: (నవ్వుచు మెల్లగా) ఏమిటా? మా అన్నయ్యహృదయము మావదినె నర్తనశాల. మావదినె హృదయము మాఅన్నయ్య గానశాల. సరేనా?

సు: (కినుక నటించి వీపు చఱచి) సరిలే, నేర్చుకొన్నావు. ఆ సరస తేమిటి? ఆ వాలక మేమిటి? మనస్సులో దూరిచూచినట్లే వర్ణించావు!

మం: ఆ దొంగకోప మెందుకు, దారికి రాక? నాకు తెలియ దనుకొన్నావా? చివరకు నిన్నరాత్రి కూడా చూచాను.

సు: నిన్న యితిహాసగోష్ఠికి నీవు వచ్చావా? ఎందు కబద్ధాలు?

మం: (పకపక నవ్వుచు) సరేలే! ఇంక ఋజువక్కఱలేదు. (చప్పట్లు)

సు: (నవ్వుచు) ఏమి టా వేషం?

మం: నాచేత చెప్పించవలె ననికాబోలు నీ వేషం! శ్యావాశ్వ డూర్వశీపురూరవుల కథ వివరించి చెప్పలేదూ? అందులో 'మేధా' శబ్దము మూడుసార్లు ఉపయోగించలేదూ? నీవు చూడకపోవడం నాతప్పా?

సు: (చిఱునవ్వుతో) మంజూళా! ఇంకెందుకు? నిజము చెప్పుచున్నాను. నాభావము కనిపెట్టినట్లే అతని భావముకూడా కనిపెట్టి నీవే నాకు చెప్పుదువని యింతవఱకు నీకు చెప్పలేదు—సరేకాని, ఈమాట యెక్కడా పొక్కనియ్యకు.

మం: నే నిపుడు చెపుతానని కాదుకాని, ఇందులో కానిదేమున్న దమ్మా?

సు: కుద కిది కట్టి యుబలాట మగునేమో అని.

మం: ఎన్నటికి కాదు. ఎవరైనా వ్యవిషయంలో సందేహించడం సహజమేకాని, అట్లనుకో నక్కఱలేదు.

సు: ఏమి టా ధైర్యం?

మం: "సుమేధ మాకోడలైతే బాగుండు"నన్న యభిప్రాయము మాపెదనాన్నగారి కున్నది.

సు: (సహర్షముగా) నిజంగా?

మం: నిజంగానే. అదిగాక, శ్యావాశ్వుని గుణములకు మీ నాన్నగారుమాత్రము మెచ్చుకోవటం లేదూ? సూర్యతేజస్సు తొలకాడుచున్న ఆ ముఖము, ఆ బుద్ధికౌశల్యము, ఆ వాక్చాతుర్యము, ఆ వైదుష్యము, ఒకటేమిటి? అన్నిశుభలక్షణములు పట్టిన వరుడు దొరకుట మాటలా?...గంభీరహృదయులలో రథవీతి మహారాజు ఘను డని ప్రతీతి. అట్టివారి యుద్దేశములు ఫలానుమేయములు. అంతేకాని మఱేమీ లేదు. సంశయించకు.

(తెరలో) ఎక్కడా పువ్వులు లేవేమి? ఇది సుమేధ విహరించు తోట కాబోలు?

మం: శ్యావాశ్వుని గొంతుకలా గున్నది.

సు: ఔను. (లజ్జ)

శ్యా: "కార్శ్యము మందహాసముం బొదవిన యోరచూపు లోకపూరముగా నను జూచు నెప్పుడుఁ" (అని పాడుకొనుచు వేఱొకవంకనుండి ప్రవేశించి) ఆపై నేమాత్రమో కనబడుచున్నది. (పరిక్రమించును)

మం: (సుమేధను చూచి) విన్నావా? (అని నవ్వును)

సు: (లజ్జాసంకోచములు నటించును)

మం: ఇవిగో పువ్వులు! అన్నా! ఇటు రా!

శ్యా: (సమీపించి) మీ రిపు డిక్కడుంటా రనుకోలేదు. అయ్యో!

మం: తప్పేమి?

శ్యా: నాన్నగారి వైశ్వదేవానికి పువ్వులకోసమని—(ముందుచూచి) అదేమిటి శిల్పకైలాసంలాగ?

సు: (సిగ్గుతో మొగము త్రిప్పును)

మం: (నవ్వుచు) అది మా సుమేధ నిర్మించిన చిన్న పూలకొండ.

సు: (సిగ్గుతో) సరిలేవమ్మా వేళాకోళం!

శ్యా : (సశిరఃకంపముగా) అట్లు కాదు. అది మీ మిత్రురాలి సుమనోరథమంటే బాగుంటుంది.

సు : (లజ్జ నటించును)

మం : ఇంకా చూస్తావేమమ్మా, పువ్వు లివ్వక?

సు : (సాశంకముగా) నీ విచ్చుకూడ దటమ్మా!

మం : ఎంత చాతుర్యమమ్మా! నీ పువ్వులు నే నివ్వనా?

సు : (సలజ్జావినయముగా నర్పించును)

శ్యా : (పూలు గ్రహించి) ఇది పుష్పాంజలి కాదు, ప్రేమాంజలి!

సు : (సిగ్గుతో మరలి మంజరవెనుక నిలుచును)

మం : సత్యము సత్యము. ఈ ముహూర్తము సుముహూర్త మగుగాక.

శ్యా : (పువ్వులు చూచి) ఔరా! ఇచ్చినవి దేవకాంచనపుష్ప లనుకొన్నాను, విరజాజిపువ్వులా?

సు : (హర్షము, సిగ్గు)

మం : (నవ్వుచు) అది యీవిడ హస్తమహత్త్వమో, లేక నీ వాక్చాతుర్యమో!

శ్యా : (స్మృతి నభినయించి) సరే కాని, సుమేధా! అవభృథమునాడు మా నాయనగారు నీచేతి కిచ్చిన అదితిప్రతిమ దాచియుంచినావు కాదూ?— రత్నపుబొమ్మ, జ్ఞాపకం లేదూ?

సు : (తేఱిచూచును)

మం : అల్లాగ చూస్తావేం? ఎక్కడైనా పెట్టి మఱచిపోయినావా?

సు : (జ్ఞప్తివడసి) లేదులేదు—ఉన్నది.

శ్యా : (సస్మితముగా) సుమేధ, మఱచిపోవునది గాదు.

మం : (నవ్వుచు) అంతేకాదు, ఇచ్చినవస్తువు తిరిగి పుచ్చుకొనేది కాదు.

సు : మంజరా! నేను నడుస్తూఉంటాను.

మం : నేనూ వస్తున్నాను. (ఇరువురు నిష్క్రమింతురు)

శ్యా : (సుమేధవంక చూచుచు) అవ్యాజానురాగ మక్షిగోచర మైనది. (మనోవికార మభినయించి) నాహృదయము నాపజాలకున్నాను—సెబాసు! దాని కున్న స్వాతంత్ర్యము నా కెక్కడిది?

భావమున బొంగిపొరలు నాపై విరాళి
మైముఱచియున్న దనుచు సుమేధతోడ
సంగరతునకు నాహృదయంబు వడలె
ధర్మమున దోడుగా దోకో దైవయుక్తి? (నిష్క్రమి)

## ద్వితీయ రంగము

(అందే, రాజుగారి పీఠిచావడిలో ఋషిసమ్మాన సభ. అందఱు యథోచితముగా కూర్చుండి యుందురు.)

రథవీతి : (అర్చనానసుని గాంచి యంజలి ఘటించి) మహర్షీ! మా యాహ్వాన మాదరించి వచ్చి మా యజ్ఞము నిర్విఘ్నముగా కొనసాగించినారు. మఱి పదిరోజులు దయచేసి యుండవలె నన్న నాకోరిక మన్నించి నా కానందము కలిగించినారు. మీ వాత్సల్యమునకు వందనములు.

అర్చ : రాజా! మాధర్మము మేము నెఱవేర్చినాము. ఇందులో విశేష మేమి? మా హృదయముల నాకర్షించిన మీ యాదరణముమాత్రము మఱపునకు రాదు.

రథ : చిరంజీవి మీ శ్యావాశ్వుడు మీ వంశమునకు పేరు తెచ్చువా డగు నని నేను సంతోషించుచున్నాను.

ఇరంమద : సందేహ మేమి? ఇతిహాసగోష్ఠిలో నతనిదే పైచేయి. మంచి ప్రజ్ఞాశాలి కాగలవాడు.

రథ : పట్టమహిషి చెప్పినది యథార్థము.

అర్చ : మీ యాశీర్వచన మతని శ్రేయస్సునకు మూలము.

శ్యా : మహారాజదంపతులకు కృతజ్ఞుడను.

సు, మం : (సంతోషముతో చూచుచుందురు)

రథ : మీయందరి గౌరవముచే మాకు విశేష సత్కారముగా—

అర్వ : అగుము. నీ కట్టి భావ మున్నచో నీకు తోచినది కాదు, నేను కోరిన దిచ్చుట ధర్మము.

ఇరం : (అచ్చెరువడి చూచును)

సు, మం : (సాతూతముగా చూతురు)

రథ : సముచితమును, సాధ్యము నైన దిచ్చుటకు సంశయింపను.

అర్వ : అట్లు కానిది నేను కోరనే కోరను.

రథ : అయితే కోరండి.

అర్వ : ఈ చిరంజీవిని సుమేధను మాకు కోడలుగా నిమ్ము.

సు, మం : (ఉత్కంఠతో చూతురు)

ఇరం : (భర్తవంక చూచును)

రథ : (సంతోషవికసితాననుడై రాణిని చూచి) ఏ మందువు ?

ఇరం : అనుట కేమున్నది ! శ్యావాశ్వుడు సర్వలక్షణసంపన్నుడు. ఇతడు మంత్రద్రష్టయయ్యెనా ?

రథ : (నివ్వెఱపడి) ఈ ప్రశ్న నాకు తోచనే లేదు.

శ్యా : (ఆశాభంగము నటించును)

అర్వ : అదొక్కటే తక్కువ.

రథ : (సంశయాకులు డగును)

ఇరం : (భర్తతో) మన మింతకుమున్ను ఋషి కాని వరునకు పిల్ల నిచ్చియుండలే దన్న దొక్కటే సందేహము.

రథ : ఋషివరా ! మీతో వియ్యమందుట అలభ్యయోగమే. కాని, ఏమి చేయను ? నియమము నకు కట్టుపడవలసివచ్చిన దని విచారించుచున్నాను.

సు, మం : (నిర్విణ్ణ లగుదురు)

శ్యా : ఆ ఋషిభక్తి శ్లాఘ్యమని మేము సంతోషించుచున్నాము.

అర్వ : సత్యము సత్యము. రాజా ! ఆమాట తెలిసియున్న నే నిట్లు కోరేవాడను గాను. వేఱుగా తలంపకు. ఇక మా కనుమతి యిమ్ము. (లేచును)

(అందఱు లేతురు)

రథ : మీ కోరిక నిరాకరించినందుకు క్షమింపు డని మరల ప్రార్థించుచున్నాను. నమస్కారము.

అర్వ : ఎందు కింక ? ఒక్కమాట చెప్పెద వినుము.

ఔ నవగ దోచి కాదు కార్యం బొకండు,
కా దనగ దోచి యొక్కొక్క కార్య మగును
ద్రష్టలముగాని మనము కర్తలము గాము
కర్తయును కారయితయు ప్రేరకుడు నతడె.

(అందఱు నిష్క్రమింతురు.)

తృ తీ య ర ం గ ము

(అందే సుమేధయావాసము. ఆలోచించుచు నిట్టటు పచారుచేయుచున్న సుమేధ ప్రవేశించును.)

సుమే : ధీరుడు, ప్రజ్ఞాశాలి. ఆరంభించిన పని తుదముట్ట జూడక విడుచువాడు కాడు. సుశీలుడు. నన్ను మఱచి యింకొకతెను పెండ్లాడుననుట కల్ల. తన విషయము నా ! సుమంతయు తెలుపకుండెనని పరితపింప బనిలేదు. కార్యదక్షుడు పనిచేసి చెప్పును గాని, చెప్పిచేయడు. ఆ ప్రతిభాశాలి ఋషియై తీరును. నే నతని భార్య నై తీరుదును. మా హృదయములను ప్రేమపాశమున బంధించిన దైవ మేమైనది ? (పద ధ్వని విని) మా అమ్మగారిబోలు !

ఇరంమద : (ప్రవేశించి) పడుకొన్నా వను కొన్నాను.

సుమే : ఇంకా నిద్ర రాలేదమ్మా ! ఇప్పు డెందుకు వచ్చావు ?

ఇరం : ఏమీ తోచక. చూచిపోదామని.

సుమే : తల్లి ప్రాణం కాదూ !

ఇరం : ఔనులే ! అల్లాగు బెంగతో కుంగి పోతూఉంటే ఏమి తోస్తుంది ?

సుమే : నాకు పెళ్ళి కాలేదని నీకు బెంగ కాని నాకేమీ లేదు.

ఇరం : లేకేమి ? ఆ సంబంధం నేను చెడ గొట్టానని......

సుమే : ఎవ రన్నారమ్మా ?

ఇరం : ఆసే దేమిటి ? ఏడాదినుండీ చూస్తు న్నానుకాదూ ?

సుమే : అది పొరపాటు. వివాహములు దైవా యత్తములని నమ్మినవా రితరులమీద నెపం వేయరు.

ఇరం : అయితే మన యత్నమే లేదంటావా ?

సుమే : ఎంతమాత్రమూ లేదు.

ఇరం : నీతో నేను వాదించలేనుగాని, ఇపు డీ సంబంధముమాట యే మంటావు ?

సుమే : అపుడు నన్నడిగావా యిపు డడుగ డానికి ?

ఇరం : ఏమి టామాట ? ప్రాజ్ఞత వచ్చినా పిల్లలు పిల్లలే. వాళ్ళ శ్రేయస్సు కోరేవారు తల్లి దండ్రులే.

సుమే : నీకు కోపం వచ్చిందేమోగాని, నా యభిప్రాయమూ అదే. అల్లాగ కోరవలసిందే.

ఇరం : అయితే తేల్చు.

సుమే : ఎల్లాగో నాలుగు బుక్కలల్లి బుషి యనిపించుకొంటేనే ఒలకలేదు. సుజనరంజకములైన శుభలక్షణా లన్నీ పట్టవలెను.

ఇరం : ఇతడైనా, అనామకుడు కాడు.

సుమే : పోనీలే ! ఆ వర్ణన యెందుకు ?—మీ రింతకుమున్ను రాజర్షికి పిల్ల నిచ్చారా ?

ఇరం : ఇపు డానియమమంకూడా పెట్టుకొమ్మం టావా ? సరిలే, తెలిసింది. (వెళ్ళబోవును)

సుమే : ఉండు. ఒక్కమాట. మీ రింకా పెడ దారి నుంటారని చెప్పివేయుచున్నాను.

ఇరం : అసలు పెళ్ళే చేసుకోనంటావా యేమిటి తల్లీ ?

సుమే : ఈ జన్మలోగానీ, ఉత్తరజన్మలోగానీ నాకు శ్యావాశ్వుడే భర్త. ఈ మాట మఱచిపోకు.

ఇరం : (తెల్లబోయి) అయ్యో ! ఎంత ఘోర ప్రతిజ్ఞ ! (సవిషాదముగా) అమ్మా ! ఈశ్వరానుగ్రహ మున నతడు బుషియగుగాక. నీ శీలము లోకవిశ్రుత మగుగాక.

సుమే :

మీ ప్రతిన యేను మన్నించి మెలగుచుంట
ప్రతిన యేనమ్మ సతుల ధర్మంబుగాని !
విన వంశాన బుట్టినయట్టి కన్నె
మన సొకని కిచ్చి వే యికొకనికి నిడునె ?

(ఇరువురు నిష్క్రమింతురు)

## చతుర్థరంగము

(అత్రేయాశ్రమము: అశ్వత్థవృక్షముక్రింది వేదిక: నిలచి బద్ధాంజలియై ధ్యానించు శ్యావాశ్వుడు ప్రవే శించును.)

శ్యా : అమ్మా రాత్రిదేవీ ! నే నత్రిపౌత్రుడను, అర్చనానసుని పుత్రుడను, శ్యావాశ్వనామధేయుడను. నమస్కరించి విన్నవించుచున్నాను. సావధానవై దయతో నా విన్నప మాలకింపుము.

సకలజంతుజాలము సాగిలబడి మ్రొక్క సర్వతో ముఖివై సంచరించుచు సర్వంసహాచక్రమెల్ల వైభ వంబు మెఱయ సంచరించు నీవు గదా చక్రవర్తినివి ! నీ పరిపాలనము ప్రశాంతము. నిఖిలలోకంబును నిశ్శబ్దము గావించు నీ శాసన మప్రతిహతము. హెచ్చుతగ్గులు పాటింపని నీ సమదృష్టి జగద్విదితము. నీ హృదయము దయామయము. నీ చల్లని చేతులతో జోకొట్టి నిఖిల ప్రాణివర్గంబును నిద్రపుచ్చు నీవే నిజముగా లోక మాతవు. నీ దర్శనము దివ్యప్రభావము. ఉడికిపోవు చున్న యెన్నెన్ని హృదయములు నిన్ను చూచినంతనే యూఱట నందుచున్నవో ! మంట లెగయు నెన్నెన్ని మానసములు నీముఖము చూచినంతనే చల్లారుచున్నవో ! నిరంతరము నీ రాకకై యెన్నెన్ని చిత్తములు తత్త ఱిల్లుచున్నవో ! నీ మహిమ నేమని వర్ణింతును ?

దేవీ ! నీపేరు సార్థకము. నీవు సుఖాధిదేవతవు. లోకమంతయు దేని నాకాంక్షించుచుండునో, ఆ సుఖము నీచేతిలోనున్నది. సుఖదానము నీ నిత్యవ్రతము. నీవు సర్వసమూరాలవు. అయిననేమి ? కంటికి కనుకన్న మాట యెఱుంగక నిత్యము నిన్ను సేవించుచున్నాను

గాని నీ విచ్చు సుఖమునకు నేను నోచుకోలేదు. నేను దానపాత్రుడను గానా ?

నేను మహాతపస్విని. నా తపోనిష్ఠకు మెచ్చి మహారాజ్ఞి శశీయని రత్నాభరణము లిచ్చినది. ఆమె భర్త తురంగమును గోశతము లిచ్చి సత్కరించెను. అతని తమ్ముడు పురుమిత్రుడు విశేషధన మిచ్చి సన్మానించెను. మరుద్దేవతలు నాకు దర్శన మిచ్చి నాస్తుతి కానందించి సువర్ణ మిచ్చిరి. అంతటివారి యనుగ్రహమునకు పాత్రుడనైన నేను నీదయ కర్హుడను గానా ? నా స్తుతిసూక్తములకు నీమనను కరగలేదా ? నిన్ను ధన మిమ్మని కోరను. నా కున్న ధనము చాలును. సుఖ మిమ్మని కోరుచున్నాను. నాసుఖమంతయు నీ దౌత్యముతో నున్నది. లోకప్రసిద్ధురాలవు. పూజ్యురాలవు. నీమాట నమ్మనివా రుండరు.

శ్యావాశ్వ డెన్న డార్షమున భాసిల్లునో
 యని తపించుచు నున్న దా నుమేధ
ఆ ప్రేమమూర్తితో హాయి యెన్నం డన్న
 యుత్కంఠలో మున్గియుంటి నేను
వలవంత దత్తఅపడు కామినీ కాము
 కుల జేర్చు పని నీకు క్రొత్తగాదు
దాల్భ్యాశ్రమమునకు దారి చెప్పగ నేల ?
 విశ్వంబు కొట్టిన పిండి నీకు
'ఏను ఋషినైతి' నన్నట్టి యిష్టవార్త
అవనిపతియైన రథవీతి చెవిని వేసి,
'ధన్యవై' తంచు నా సుమేధకును జెప్పి
రమ్ము కరుణించి కదలు మోరాత్రిదేవి !

(తెరలో) ఋషివరా ! నీయభీష్టము సిద్ధించును.

శ్యా : మహాప్రసాదము, దివ్యవాణి యాశీర్వాదము. (నిష్క్రమి)

## పంచమరంగము

(అందే, అర్చనానసుని యింటిముందు పెళ్ళి పందిరి. బంధుమిత్రాదు లందఱు యథోచితముగా కూర్చుండియుందురు. వైవాహికాలంకారములతోడి సుమేధాశ్యావాశ్వులు కల్యాణవేదికపై నధివసించియుందురు.)

పురోహితుడు : అతివైభవముగా జరిగిన యీ వివాహమహోత్సవమునకు దేవదుందుభులు మ్రోగినవి. ఇట్లు మహారాజవైభవముతో జరిగిన బ్రాహ్మవివాహ మశ్రుతపూర్వము.

రథ : (సహర్షముగా) ఇదంతా బావగారి యనుగ్రహము.

అర్చ : (నవ్వుచు) కాదు, మీ నిష్ఠమునకు ఫలము.

రథ : (నవ్వుచు) దానికి మీ యంగీకారము మూలము.

అర్చ : అట్లును గాదు. వధూవరుల కార్యదీక్ష యనుట యుక్తము.

తరంమస : (సస్మితముగా) అన్నగారి మాట నిజము. ఆ దీక్ష కండయై మా నియమ ముభయత్ర మే లొనర్చినది.

రథ : (నవ్వుచు) బావగారు చెల్లెలిమాట కాదనజాలరు. శ్యావాశ్వుడు రాత్రి నేవిని దూతిగా బంపునంతటి తపోమహిమసంపన్నుడైనాడు. ఆ ఋషి రాజు మా కల్లుడైనాడు. దీని కంతకు మానియమము హేతువు కాదా ?

అందఱు : (సహర్షకరతాళధ్వనులు) ఈ సమర్థనము బాగున్నది.

అర్చ : (నవ్వుచు) ఇంకొకటి మఱచినారు బావగారు. రాచకన్యను పెండ్లాడి మావాడు రాజైనాడు.

అందఱు : (సహర్షధ్వనులు)

అర్చ : రాజా ! ఇదంతా పరిహాససంభాషణము. దీనికేమి గాని, అనుకోవలసిన దొక్కటే మాట— సుమేధ సౌశీల్య మీ శ్రేయస్సునకు మూలమై యనుకూల దైవముగా పరిణమించిన దని నా పరమవిశ్వాసము.

అందఱు : సత్యము సత్యము. (కరతాళములు)

సుమే : (చిఱునవ్వుతో అంజలి ఘటించుచు)

(తెరలో కలకలము)

అర్చ : ఏమి టా సందడి ?

ఋషికుమారుడు : (ప్రవేశించి) రథవీతి మహారాజుగారల్లునికి కూతురికి, నిచ్చుటకు రప్పించిన గోహయశతములు, ధనకనక వస్తువులతోడి శకటములు వచ్చినవి.

అర్చ : సంతోషము.

రథ : (లేచి) సభార్యాయై నమః. మహర్షీ! ఈ కడపటి పిల్ల వివాహమున కిన్నాళ్ళు వేచియున్నాము. మీ దయచే నిది సిద్ధించినది. ఇంక మా వానప్రస్థమున కనుమతించి యాశీర్వదింపుడు. నమస్కారము.

అర్చ : మహానందము. ఆరణ్యకవ్రతమున నాంతరజ్యోతి ప్రకాశించుగాక.

శ్యావా : (లేచి వచ్చి సుమేధంగూడి అత్తమామలకు నమస్కరించును)

ఇరం : దీర్ఘాయు రస్తు! అన్యోన్యం ప్రీతి రస్తు! వంశాభివృద్ధి రస్తు!

ఇరం : (సుమేధమూర్ధ మాఘ్రాణించి) అమ్మా! గురుజనభక్తితో నుభయవంశముల కుత్తమఖ్యాతి తెచ్చుదానవై పుత్రవతివై వర్ధిల్లుదువుగాక!

అందఱు : తథాస్తు. శుభం భూయాత్!

పురో :

ఆవిధుతారార్కముక
న్యావరుల వివాహముల కుదాహరణంబై
పావనమైన సుమేధా
శ్యావాశ్వవివాహ మార్యసన్నుతి గాంచున్.

(అందఱు నిష్క్రమింతురు.)



# ఆంధ్రవిజ్ఞాన సర్వస్వము

## ప్రథమ ద్వితీయ సంపుటములు

ప్రథమ సంపుటమునందు డిమ్మీ ౮-వ ఆకృతియందు ౭౦౦ పుటలు గలవు. ఇందు 'అ' నుండి "అధ్వర్య" వరకును గల విషయము గలదు. త్రివర్ణ పటములు ౬, యితరపటములు ౧౨౫, వివిధ విషయములు ౮౦౦ కలవు.

రెండవ సంపుటమునందు డిమ్మీ ౮-వ ఆకృతియందు ౭౦౦ లకు మించిన పుటలు కలవు. "అన" మొదలుకొని "అశ్విని" వరకు గల విషయము గలదు. త్రివర్ణపటములు ౧౦. వానిలో ౨ అమరావతీ స్తూపమునకును ౨ అనాహతమునకును చెందినవియు, ౭ దేశచిత్రపటములును గలవు. ఇవిగాక మరి ౫ సాదా దేశపటములు కలవు. ప్రాచీనాంధ్రుల కళాసంపదను వ్యక్తముచేయు అమరావతీ స్తూపమును గురించిన గొప్ప వ్యాసమునందు అమరావతీ శిల్పమునకు సంబంధించిన హాఫ్‌టోన్ బొమ్మలు రమారమి ౧౦౦ ను, వేషభూషాదుల వెల్లడించు బొమ్మలు ౫౦ వఱకును గలవు. మరియు అభినయమను వ్యాసమున భరత శాస్త్రమునందలి వేఱువేఱు హస్తములను సూచించు బొమ్మలు ౫౭ ను, 'అనాహతము' నందు షట్చక్రాదుల చిత్రములును గలవు. ఇట్లు ఆ యా వ్యాసములకు చెందిన చిత్రములు మొత్తముమీద ౨౫౦ కి పైగా నున్నవి. వివిధవిషయముల సంఖ్య ౮౦౦ వరకు నుండును. సంపుటము చక్కని స్వదేశీచర్మముతోడను బంగారు రేఖలతోడను సంపుటీకృతము. ప్రతిసంపుటమున ౭౦౦ పుటలుండును.

**సంపుటము 1-కి వెల రూ. ౧౪.**

ప్యాకింగు, పోస్టేజి వగైరా ప్రత్యేకము.

మేనేజరు,

ఆంధ్రవిజ్ఞానసర్వస్వ కార్యాలయము,

నెం. 7, తంబుశెట్టివీధి, మదరాసు.

# ప్రాచీన ఖగోళము

## ౬. సూర్యుడు

శ్రీ వేలూరి శివరామశాస్త్రి

వేదములందలి సూర్యుడు పరమేశ్వరుని మూర్తిభేద మగు అగ్నికి ప్రతినిధి. ఒక్కొకచో జ్ఞానమయుఁడగు ఈశ్వరునికి ప్రతినిధి.

ఋగ్వేదమునం దొకచో సూర్యు లారుగురు1; ఒకచో ఏడుగురు 2; తైత్తిరీయసంహితలో నెనమండ్రు. అందే వేరొకచో పన్నిద్దరు.

ఉపాధిభేదముచేగాని యీ సంఖ్యాభేదమున నేకవాక్యత కలుగదు—'నానాలింగత్వా దృతూనాం నానాసూర్యత్వమ్'. శతపథబ్రాహ్మణము పండ్రెండు మాసములను పన్నిద్దరు సూర్యులనుగా నిరూపించెను. దాన మాసభేదముచే సూర్యునకు నామభేదకల్పన జరిగెను. తరువాత ఉపనిషత్తులందును, పురాణములందును ఆదిత్యులు పన్నిద్దరు కానిపింతురు.

వేదమునం దచటనచట సూర్యకిరణము లేడనియు, సహస్రమనియు గలదు. సూర్యుని వెలుగు తెలుపనియు, కారునలు పనియు ఛాందోగ్యము 3. కన్ను గ్రుచ్చి చూచువానికి ఈ నల్లదనము కానిపించు నని శంకరులు 4. ఛాందోగ్యమునందే యింకొకచో సూర్యునకు పింగళత్వమును, పీతత్వమును, శుక్లత్వమును, లోహితత్వమును కానిపించును 5. సూర్యుని గమనము నకు సంబంధించిన కొన్ని సూక్తములు ఋగ్వేదమున కానిపించును. వానిలో నొకదాని కిది తెలుగు:

'ఉషలు నేటివలె ఎల్లివలె వరుణధామమున దీర్ఘముగా ఉనికిగొనుచున్నవి. అనవద్యము లగు అవి ముప్పదియోజనములు పరిక్రమించుచున్నవి. వానిలో నొక్కొకటియు తాను పోవలయు మేర పోవుచున్నది' 6.

---

(1) ౨-౨౭ ఋక్.

(2) ఏడుగురు సూర్యులవిషయమున శ్రీబాలగంగాధరు లిటులు చెప్పిరి: ఆర్యులు మేరుప్రాంతము లందు నివసించు కాలమున ఈ యేడుగురు సూర్యుల కల్పన ఉదయించెను. ఎటులనగా, అచట సూర్యుడు ఏడు మాసములే కానిపించును. ఏడునెలల పొడుగునను రేయింబవళ్ళను మాట లేక సూర్యుడు వెలుగుచుండుటచేసి ఆనాటి ఋషులు సూర్యుని సప్తరశ్మి యనియు, సప్తాశ్వు డనియు వ్యవహరించిరి. ఆర్యులు దక్షిణమునకు దిగి వచ్చినకాలదిని సూర్యసంఖ్య ఏడునుండి ఎనిమిదికిని, ఎనిమిదినుండి తొమ్మిదికిని, తొమ్మిదినుండి పదిపండ్రెండు లకును పెరిగెను. ఈ సూక్తము పూర్వయుగపు ఋషులు సప్తమాసవ్యాపియగు సూర్యునిగురించి రచించినది. ఇటులే కొండొకచో ఇంద్రునకు శతక్రతు వని పేరు కలదు. నాటివారలు ఇంద్రుని అనుగ్రహముకొరకు శత దినవ్యాపి యగు సత్రము చేయుచుండెడివారు. 'ఇంద్రుడు సోమపానము చేసి శంబరుని నవనవతిపురములు కూల్చి సూర్యుని విడిపించును'. ఈ యుపాఖ్యానములో మూడునెలల (నవనవతి) శీతర్తు వున్నది'. (చూ. Arctic Home in the Vedas- 'Vedic dawns'.

(3) 'ఆదిత్యస్య శుక్లం భా స్సైవ ర్గథ యన్నీలం పరః కృష్ణం త త్సామ' ౧-౬-౫.

(4) 'త ద్ధ్యైకాంతసమాహితదృష్టేర్ దృశ్యతే' చూ. ఛాందోగ్యశాంకరభాష్య. ౧-౬-౫.

(5) 'అసౌవా ఆదిత్యః పిఙ్గళ ఏవ శుక్ల ఏవనీల ఏవ పీత ఏవ లోహితః' ఛాందోగ్య. ౪-౬-౧.

(6) సదృశీ రద్య సదృశీ రిదు శ్వో దీర్ఘం సచంతే వరుణస్య ధామ. అనవద్యా స్త్రింశతం యోజనా న్యేకైకా క్రతుం పరియంతి సద్యః. ౧-౧౨౩-౮.

మరియొక సూక్తమున 7 'ముప్పది పదములు నడచెను' అనియు, వేరొకసూక్తమున 8 'ముప్పదిధామములు పతంగగ్యుతులచే ప్రకాశించె' ననియు చూపట్టును. ఈ ముప్పది యోజనములును (త్రింశతం యోజనాని) ముప్పదిపదములును (త్రింశత్పదాని), ముప్పది ధామములును (త్రింశద్ధామ) మేరుప్రాంతమునందలి ఉష లని శ్రీ బాలగంగాధరులు 9. సాయణుని అభిప్రాయము వేరు. (చూ. భారతి-౨౧ వ సంపుటము ౧ వ సంచిక-ప్రాచీనఖగోళము.) 'రవి ముహూర్తమునకు ముప్పది అంశలు నడచును' అను వాయుపురాణములతో (౪౩-౧౧౯, ౨ అంశ-౮) కూర్చి పై ఋక్కులు చూడవలయును.

అథర్వశ్రుతి సూర్యబింబవ్యాసము ౭౨,౦౦౦ యోజనములుగా చెప్పుచున్నదని మహామహోపాధ్యాయ శ్రీ చంద్రశేఖరులు10.

ఇక పురాణముల వైజ్ఞానికదృష్టిలో సూర్యుని చూతము.

సూర్యుడు అగ్నిప్రకృతి 11. సూర్యమండలము ఘనతేజోమయము. మరియు అది తెల్లనిది 12. సూర్యుని నుండి వేడిమి స్రవించును 13. సూర్యుడే వాన కురిపించును 14. గ్రహములన్నిటిలో ఆదిత్యు డాద్యుడు 15. చాక్షుషమన్వంతరమున విశాఖలలో సూర్యు డదితికి కొడుకై పుట్టెను. అతడు గ్రహములలో ప్రథమ

---

(7) ఇంద్రాగ్నీ అపా దియం పూర్వాగా త్పద్వతీభ్యః. హిత్వీ శిరో జిహ్వయా వావద చ్చర త్త్రింశత్పదా న్యక్రమీత్. ౬-౫౯-౬.

(8) త్రింశ ద్ధామ విరాజతి. వాక్ పతఙ్గాయ ధీయతే. ప్రతివస్తో రహ ద్యుభిః-౧౦-౧౮౯-3.

(9) చూ. Arctic Home in the Vedas. P. ౧౦3.

(10) 'ద్విసప్తతిసహస్రయోజనమితార్కబింబాయతి
ర్మహాపురుష వాచయే త్యనుజగా వథర్వా శ్రుతిః
మ యైతదనుసారతో నయనగోచరర్క్షగ్రహ
ప్రమాణపరిధిగ్రహాదిక మకల్మలం కల్ప్యతే'
('సిద్ధాంతదర్పణ')

(11) 'పఠ్యతే చాగ్ని రాదిత్య ఉదక శ్చంద్రమాః స్మృతః,
శేషాణాం ప్రకృతిం సమ్య గ్వర్ణ్యమానాం నిబోధత'. (వా ౫3-30)
సూర్యా దుష్ణం నిస్రవతే సోమా చ్ఛీతం ప్రవర్తతే
శీతోష్ణవీర్యా ద్వా వేతౌ యుక్తే ధారయతో జగత్. (వా ౫౧-౨౦)

(12) 'ఘనతేజోమయం శుక్లం మండలం భాస్కరస్య తు' (వా ౫3-౫౭.)

(13) 'సూర్యా దుష్ణం ప్రస్రవతే' (వా ౫౧-౨౦.)

(14) 'సూర్య ఏవ తు వృష్టీనాం స్రష్టా సముపదిశ్యతే' (వా ౫౧-౨౧)

(15) 'సర్వగ్రహాణా మేతేషా మాది రాదిత్య ఉచ్యతే' (వా ౫3-౧౧౧)

గ్రహము 16. నక్షత్రములును, చంద్రుడును, గ్రహములును 17 సూర్యసంభవములు' 18.

పురాణములలో సూర్యునకును, గ్రహములకును గల సంబంధ మిటు లున్నది—సూర్యుని కిరణములలో సుషుమ్న హరికేశ విశ్వకర్మ విశ్వశ్రవ సంయద్వసు అర్వావసు స్వర్ అను నీ యేడు కిరణములవలన క్రమముగా చంద్రుడును, నక్షత్రములును, బుధుడును, శుక్రుడును, మంగళుడును, బృహస్పతియు, శనియు పరిపుష్టు లగుదురు 19. ఈ రీతిగా గ్రహములకును, గ్రహరాజునకును పోష్యపోషకభావసంబంధము. కావున గ్రహములకు సూర్యు డాద్యుడు. ఈ గ్రహములే ఏడు లోకము లని కొంద రనిరి.

సూర్యుని కిరణము లసంఖ్యేయములు. వానిలో నాలుగువందల కిరణములు వర్షించును. వాని రంగు శబలము. వానికి వందనము లనియు, వంద్యము లనియు, ఋతనము లనియు, నూతనము లనియు, అమృతము లనియు పేళ్ళు.

మరి మూడువందల కిరణములు మంచు కురియును. వానికి దృశ్యము లనియు, మేధ్యము లనియు, బాహ్యము లనియు, హ్రాదిను లనియు, హిమసర్జనము లనియు, చంద్రు లనియు పేళ్ళు. ఇవి శీతసర్గములు.

మరి మూడువందల కిరణములు వేడిమి చిమ్మును, వానికి శుక్లము లనియు, కకుప్పు లనియు, విశ్వభృత్తు లనియు పేళ్ళు. వీనిరంగు తెలుపు. వీనితో సూర్యుడు మనుష్యులను, పితరులను, దేవతలను తృప్తిపరచును 20.

వాయ్వాదిపురాణములు కొన్ని సూర్యబింబ విష్కంభము ౯౦౦౦ యోజనములు, దాని పరిణాహము అంతకు మూడురెట్లనియు చెప్పుచున్నవి. (చూ. వా. ౫౦-౬౭ కూర్మ. పూర్వార్ధ. ౪౧-౧౩.)

భాగవతమునందు సూర్యమండలవిస్తారము

---

(16) 'వివస్వా నదితేః పుత్రః సూర్యో వై చాక్షుషేంఽతరే
విశాఖాసు సముత్పన్నో గ్రహాణాం ప్రథమో గ్రహః' (వా ౫౩-౧౦౪)

(17) 'ఋక్షచంద్రగ్రహా స్సర్వే విజ్ఞేయా స్సూర్యసంభవాః' (వా ౫౩-౭౮.)

(18) The Mysterious universe లో Sir James Jeans వ్రాసిన యీ దిగువవిషయ మిచట స్మృతికి తగులును. 'కోటానకోటులు నక్షత్రములు మహాశూన్యమున తిరుగుచున్నవి. వీనిలో కొన్నియే గుంపు కట్టి తిరుగుచున్నవి కాని చాల నక్షత్రములు విడివిడిగనే సంచరించుచున్నవి. ఇవి తిరుగు మహాశూన్యమునకు ఎల్లలు లేవు. కావున ఈ నక్షత్రములు ఒండొండ ఢీకొక్కలు కొట్టుకొను నను సంభావనయే లేదు. అట్టి దెన్నడేని జరగుట మన మూహింపజాలని ఒక పెద్ద వింత. ఆ నక్షత్రములు సముద్రముమీద పయనించు ఒంటరి ఓడలవంటివి. నక్షత్రములను ఓడలతో (సమపరిమాణములో) పోల్చినచో ఒక ఓడకును, దానికి మిగుల దాపుగానున్న మరియొక ఓడకును గల దవ్వు పదిలక్షలమైళ్ళ కెక్కుడుండును. ఇవి ఒండొండు ఏల ఢీకొక్కలు కొట్టుకొనవో యిపుడు సులభముగా తెలియును.

ఇటులయినను రెండు కోట్ల ఏండ్లక్రింద ఈ మహాశూన్యమున లక్ష్యము లేని యాత్రలో ఒక పెద్ద నక్షత్ర మానాటి సూర్యునకు చేరువుగా వచ్చెను. చంద్రసూర్యుల ఆకర్షణమున సముద్రమునందు పెద్దపెద్ద తరంగములు లేచినటులు ఆ నక్షత్రపు ఆకర్షణమున సూర్యునిలో గూడ నొక పెద్ద ఆవిరియల లేచెను. చంద్రుని లన సముద్రమున పొడుచు అలకును, ఆ యావిరిఅలకును ఎక్కడను పోలికయే లేదు. ఆ అల మన కల్పనకు గూడ అతీతము. విక్షోభము కలిగించు ఈ నక్షత్రము డాసినకొలదిని సూర్యునిలో ఈ యావిరియల మిన్నై పొడువ దొడగెను. ఆ నక్షత్ర మంతట ఎడముగా తిప్పకొని పోకముందే దాని ఆకర్షణప్రాబల్యమున ఆ యల పెరిగి పెరిగి తునియలుతునియలుగా విరిగిపడెను. తమ పాటువలన పొడమిన వాయువేగము, సూర్యుని ఆకర్షణము అను నీ రెండు విరుద్ధశక్తుల సామంజస్యమున ఆ అలతునియలు ఎనుపంటనే తమకు జనకు డగు సూర్యునిచుట్టును తిరుగాడ మొదలిడెను. అవియే చిన్నవియు, పెద్దవియు నగు ఈ గ్రహములు. వానిలో మన భూమి యొకటి అని మనము వినుచున్నాము.'

(19) చూ. వా ౫౩-౪౪ నుండి ౫౦ వరకు.

(20) చూ. వా ౫౩-౧౯ నుండి ౨౨ వరకు.

౧౦,౦౦౦ యోజనము లనియు (స్క. ౫-౧౯-౧౭) బ్రహ్మాండకపాలములగు భూమ్యంతరిక్షముల అంతరాళమున సూర్యుని ఉనికి; సూర్యాండగోళముల నడుము ఇరువదియయిదుకోట్ల యోజనములనియు (౫-౨౧-౪౨), సూర్యుడు క్షణమునకు రెండువేల నన్నూరుయోజనములు తిరుగు ననియు (౫-౧౯-౧౭) కలదు.

కాశీఖండము సూర్యుడు నిమేషార్ధమున రెండు వేలు నిన్నూట రెండుయోజనములు గడచునని చెప్పచున్నది.

ఈరీతిగనే పురాణములలో యోజనవిషయమున భేదము కనబడును. యోజనమానములు పెక్కులు. అవి తెలియనిదే వీనిని తెలియజెప్పుట దుస్తరము. ఈ లెక్కలలో కొన్నిపట్ల త్రైరాశికతురీయగణితములతో పనియుండును. కొన్నింటి సామంజస్యమునకు శ్రీధరస్వామి పైవిషయము చెప్పెను. భాగవతపంచమస్కంధ వ్యాఖ్య చూచునది.

ఇపుడు సంహితలు చెప్పు సూర్యుని చూతము.

సూర్యుని శరీరము నిర్మలము. బింబము అవక్రము, అనగా గోళము. కిరణములు స్పష్టములు, విస్తీర్ణములు, నిర్మలములు, దీర్ఘములు.

సూర్యబింబ ముదయాస్తమయ సమయములయందు మధ్యాహ్నబింబముకంటె పెద్దదిగా కానిపించును. క్షితిజమునుండి నడినెత్తిమీదికి సమీపించిన కొలది సూర్యబింబమును, చంద్రబింబమును చిన్నవిగా కనబడును. దీనికి కారణము శ్రీపతి, భాస్కరుడు మొదలగువార లిటులు చెప్పిరి: 'భూపృష్ఠముమీది ద్రష్ట భూగర్భమునుండి భూవ్యాసార్ధోచ్చస్థానమున నుండును. అపు డతడు మధ్యాహ్నసూర్యునకు దాపగును. కింజల్కములచే పద్మమువలె కిరణములచే సూర్యుడు నిండియుండును. కావున అపుడు సూర్యుడు సూక్ష్మరూపముతో కనబడును. ఇక సూర్యుడు క్షితిజముమీద నున్నపుడు భూమి గోళముకావున సూర్యుని కిరణములు నిరుద్ధము లగును. మరియు సూర్యు డపుడు దూరముగా నుండును. ఈ రెండు కారణములచేతను సూర్యు నపుడు మనము సుఖముగా చూడవచ్చును. అపుడు సూర్యబింబము పెద్దదిగా కనబడును' 21.

సూర్యుడు క్షితిజముమీద నున్నను, ఆకాశమధ్యమున నున్నను పెరుగడు, తరుగడు. కాని మన కంటి కటులు కనబడుటవలన గ్రహణము మొదలగువాని కనిపట్టు వేళ గణితఫలమున తగవు వచ్చును. కావున వరాహమిహిరుడు క్షితిజముమీది సూర్యబింబపు రెండు కలలు ఆకాశమధ్యమున నున్న సూర్యబింబపు మూడు కలలతో సమాన మని అనెను. అనగా ఆకాశమునడుము నున్న సూర్యబింబముకంటె క్షితిజముమీద నున్న సూర్యబింబము ⅔ పెద్దదిగా కనబడును. సూర్యసిద్ధాంతము ఉదయాస్తమయకాలములందలి సూర్యబింబపు మూడు కలలు ఆకాశమధ్యమునందలి సూర్యబింబపు నాలుగు కలలతోపాటుగా చెప్పెను. శిరోమణిమతమున ఉదయాస్తమయకాలములందలి సూర్యబింబపు ౨౧'' కలలు ఆకాశమధ్యమునందలి సూర్యబింబపు 3''° కలలతో సమానము.

సూర్యబింబమున మచ్చలు పుట్టును. చంద్రబింబమునను పుట్టును. వానికి తామసకీలకము లని పేరు. అనగా నల్లమేకులు. అవి ముప్పదిమూడు. ఇవి రాహుకుమారులు. అనగా ఛాయామయములు. కేతువులు. వీని వర్ణమునుబట్టి, స్థానమునుబట్టి, ఆకారమును బట్టి ఫలము చెప్పవలయును. ఇవి సూర్యమండలమున కానవచ్చినచో కీడు. చంద్రమండలమున కానవచ్చినచో మేలు. చంద్రమండలమునందును కాకివలె, కబంధమువలె, ఖడ్గాదులవలె కానవచ్చినచో కీడే 22.

సూర్యబింబమునం దివి కానిపించినచో నీరు కలుషమగును. ఆకాశమున దుమ్ము లేచును. సుడిగాడుపు తరుగిరిశిఖరములను నేలమీదికి బడనయిచును. చెట్లు చేమలు ఋతువిపరీతము లగును. ఆరణ్యకములగు మృగములును, పక్షులును ఆకాశముఖముగా పరుషధ్వని చేయును. సూర్యోదయకాలమునను, సూర్యాస్తమయ

(21) ఈహేతువులను కొందరు వ్యాఖ్యాతలు ఒప్పుకొనక సూర్యబింబము సమయభేదముచే పెద్దదిగను, చిన్నదిగను కనబడుటకు కన్ను చెదరుటగాని, మనసు చెదరుటగాని కారణ మని నిరూపించిరి.

(22) బృహత్సంహిత-ఆదిత్యచారాధ్యాయము.

కాలమునను బెడగొండలు వేయును. పిడుగులు పడును. భూకంపములు కలుగును. కాకాది-చిహ్నములు సూర్యబింబమున కానవచ్చినచో తరచుగా రాజాభావము తటస్థించును.

వరాహమిహిరు డీ మచ్చలను కేతువులని అనెను. కేతువు లన నేమి? గర్గు డిటులు చెప్పెను: 'ఇవి కృష్ణాభములు, కృష్ణపర్యంతములు, సంకులములు. రవిచంద్రులలో నివి కనబడును.' వరాహమిహిరుడు గర్గపరాశరాదిసంహితలలో చూచి కేతువులను దివ్యము లనియు, అంతరిక్షము లనియు, భౌమము లనియు విభజించెను. 'ఇవి అగ్ని కాదుగాని అగ్నివలె పొడకట్టును. మరి మిడుగురుపురువులందును శ్మశానభూములందును కనబడు తేజోరూపములును, చంద్రకాంతాది మణులయందును, మరకతాది రత్నములందును కానిపించు తేజోరూపములు కేతువులు కావు.' అని యనెను. మరియు నతడు 'ధ్వజములు గృహములు వృక్షములు శస్త్రములు గుర్రములు ఏనుగులు మొదలగువానియందు కనబడు అగ్నిరూపములగు కేతువులు అంతరిక్షములు. నక్షత్రములలో కనబడు కేతువులు దివ్యములు. వీనికి వేరుగా నేలమీద కనిపించునవి భౌమములు. పరాశరాదులు నూరునొక్క విధముల కేతువులను, గర్గాదులు వేయివిధములయిన కేతువులను, నారదాదులు ఒకే కేతు విన్నివిధములుగా కనబడుననియు చెప్పి రని వ్రాసెను 23.

భూవాయువునందలి ధూళికణముల పరిణామము చేతను, మేఘముల సంస్థానభేదముచేతను అపుడపుడు సూర్యబింబమునందు వర్ణాంతరము ఘటిల్లును. 'సూర్యబింబమునందు ఒకానొకపుడు నల్లని రేఖలు పొడకట్టును. అవి ఒక్కొక్క సమయమునందు వణకుచున్నట్టు లుండును' అని వరాహమిహిరుడు.

సూర్యుడు భూమి కెంత దవ్వు? సూర్యుడు భూమికంటె ఎంత పెద్ద?

సూర్యుని దవ్వు తెలియుచో వ్యాసము చెప్పవచ్చును. లంబనము తెలియుచో దవ్వుచెప్పవచ్చును.

ఇవి సూక్ష్మయంత్రసాహాయ్యమునగాని యించుమించుగానేని చెప్పనయితికానివి.

మన ప్రాచీనులు రవిచంద్రుల పరమలంబనము వారి దైనికగతిలో పదునేనవవంతుగా గ్రహించిరి. ఈ

(23) ఇపుడు యంత్రసహాయమున సూర్యునిలో మచ్చలు కనుగొనుచున్నారు. ఈ మచ్చ లెల్లపుడును ఉండవనియు, కొన్నికొన్ని దినములపాటును, కొన్నికొన్ని నెలలపాటును ఉండుననియు వీరు చెప్పిరి. పదునొకొండేండ్ల కొకసారి యివి వృద్ధి బడయునట. ఇవి కనుపట్టినపుడు సుడిగాడ్పులు వానలు రోగములు వృద్ధియగునని కొందరు వ్రాసిరి. దీనికి వాణిజ్యముతో సంబంధమును కొందరు తెల్పిరి. మొన్నటి సూర్యగ్రహణ సమయమున జపానులో కొందరు ఖగోళజ్ఞులు యంత్రసాహాయ్యమున సూర్యుని చూచి యీయేడు ఎక్కువ మచ్చలు కనుగొనినటులు ప్రకటన చేసిరి. బూర్జువా అర్థనీతిపండితులు సూర్యునిలో మచ్చలు కనిపించినపుడు ఆర్థిక సంక్షోభము కలుగునని చెప్పుచుందురు. అది జోస్యము. కాపిటలిస్టులు లాభములకుచేయు అధికోత్పత్తిలోనే ఆర్థికసంక్షోభమునకు బీజములు కలవు. ఆర్థికసంక్షోభము అధికోత్పత్తి వెన్నంటియుండును. [illegible] లో, '౬౬ లో, '౭౩ లో, '౮౨ లో, '౯౦ లో, '౯౦౦ లో, '౭ లో, '౨౧ లో, '౨౯ లో, [illegible] ఈసంక్షోభమును చూచితిమి. ఇటు లిది పదేండ్ల కొకమారు తలచూపుచున్నటులు గమనింపగలమని మార్క్సిస్టులు వ్రాసిరి.

డస సూర్యుని పరమలంబనము ౩' ౫౬'' 24. దానినిబట్టి కర్ణము ౬,౮౯,౩౭౭ యోజనము లని భాస్కరుడు నిర్ణయించెను. అనగా ౮౭౨ భూవ్యాసార్ధసమానము. ఆధునికమతమున నిది ౨౩,౪౫౯ భూవ్యాసార్ధసమానము. భాస్కరమతమున సూర్యుని మధ్యమబింబము ౩౨' ౩౧'' ౩౩. అనుపాతము చేయుచో సూర్యుని వ్యాసము ౬౫౨౨ యోజనములు. అనగా భూవ్యాసమునకు నాలుగు రెట్లకంటె కొంచె మెక్కుడు25. ఇతరాచార్యులును సూర్యుని వ్యాస మించుమించు ఇన్ని యోజనములే చెప్పిరి. సూర్యసిద్ధాంతమున సూర్యబింబవ్యాసము ౬౫౦౦ యోజనములు.

---

(24) సూర్యుని పరమలంబనము నిట్లు గ్రహించుటవలన సూర్యుడు భూమికి చాల దాపునకు వచ్చెను.

(25) సుమారు రెండువందల యేండ్లకు మునుపు పడమటి దేశములకును సూర్యుని దవ్వు తిన్నగా తెలిసి రాలేదు. చాలకాలమువెనుక గ్రీక్ దేశపు అరిస్టార్కస్ అనునతడు సూర్యుడు చంద్రునికన్న పందొమ్మిది రెట్లు దవ్వున నున్నాడని నిర్ణయించెను. అసలు ౩౯౦ రెట్లు. హిపార్కస్ అనునతడు సూర్యుని పరమలంబనము సుమారు ౩ కలలు అని చెప్పెను. అనగా ఇరువదిరెట్లుమాత్రమె యెక్కువ వచ్చును. టాలెమీ దీనినే అంగీకరించెను. అంతటితో అది వ్యాసప్రోక్తమైపోయెను. కెప్లర్ అనునతడు సూర్యుని పరమలంబనము ఒక కల కెక్కుడుండ దని యనెను.



మద్రాసు చిత్రకళాశాలా ప్రధానాచార్యులు సుప్రసిద్ధ శిల్పి, శ్రీ దేవీప్రసాదరాయ చౌదరిగారి తయారు చేసిన మహాత్ముని విగ్రహం, విగ్రహంప్రక్కనే శిల్పి చౌదరిగారు నిల్చొని ఉన్నారు.




# సృష్టిలోని కుంభకర్ణులు

"ఆదేమి నిద్రరా కుంభకర్ణుడి నిద్ర?" అని తిట్టూంటారు నన్ను మా నాన్న అప్పుడప్పుడు. రాత్రి తొమ్మిదిన్నరకు పడుకొని తెల్లవారి ఎనిమిదిన్నరకు లేచే నన్నే కుంభకర్ణుడు అంటాడు ఆయన. సృష్టిలోని కొన్ని జంతువుల నిద్రనుగూర్చి కాస్త విచారిస్తే ఆయన నన్ను ఇలా అననే అనరని నొక్కి చెప్పగలను.

*　　*　　*

వేసంగి అయిపోయి శీతాకాలము దగ్గరకు వస్తూంటే ఎన్నో కీటకాలూ, సర్పజాతిజంతువులూ తమ చలికాలపు నిద్రకు తయారవుతూంటాయి. సృష్టిలో సులభంగా గమనింప వీలయిన చిత్రాల్లో అతి విచిత్రమైన సంగతిది. ఈ నిద్రావస్థలో నున్న జంతువులలో కొన్ని అవయవాలు తమతమ కార్యకలాపాన్ని కొనసాగించడం పూర్తిగా మానేస్తాయి. మరికొన్ని అవయవాలు తమ పన్లను అవి నిర్వర్తిస్తున్నాయా అనే సందేహము కల్గించేంత నెమ్మదిగా నిర్వర్తిస్తూంటాయి.

*　　*　　*

"నిద్రపోవలసిన కాలము సమీపిస్తోంది" అని ఏదో చెప్పినట్లు ఆకులు రాలిపోకముందరనుంచే ఈ జంతువులు నిద్రకోసం కావలసిన పరిస్థితులు ఏర్పరచుకొన ప్రారంభిస్తాయి. ఇలాగ సిద్ధమవడంలో ముఖ్యంగా అవి అవలంబించే పద్ధతి శరీరంలో అత్యధికంగా కొవ్వు పదార్థాన్ని చేర్చడమే.

*　　*　　*

ఇలాగ నిద్రపోతూన్నప్పుడు ఆ జంతువుయొక్క శరీరోష్ణత మామూలుగా వుండవలసినదాన్లో సగము కావచ్చు. గుండెకాయ కొట్టుకోడం అతినెమ్మదిగా జరుగుతుంది; ఆకలి పూర్తిగా చచ్చిపోతుంది; మామూలుగా జరిగే కాలకృత్యాల అవసరమే వుండదు. శ్వాసక్రియ జరుగుతూందా అనిపిస్తుంది కొన్నిట్లో; మరికొన్నిట్లో శ్వాసక్రియే వుండదు. గబ్బిలా న్నొకదాన్ని ఇలాగ నిద్రావస్థలో నున్నప్పుడు నీళ్ళలో ముంచి, అలాగే గంటసే పుంచి మళ్ళీ పైకెత్తితే అది ఇంకా నిద్ర లేవలేదు; బ్రతకడానికేమో బ్రతికే వుంది. నిద్రపోతూండే చుంచును బంతి దొర్లించినట్లు దొర్లించొచ్చు; అదేమో నిద్ర లేవనేలేవదు.

*　　*　　*

చలికాలం వచ్చిందంటే, కొంచెం వెచ్చగా వుండే ప్రదేశాలకు ఎగిరిపోగలవు పక్షులు. పందికొక్కులు బయటవుండే వుష్ణాన్నిబట్టి తమ బొరియల లోతును ఎక్కువో, తక్కువో చేసుకొంటాయి. ఉడతలు తామెరిగిన మొదటి శీతాకాలముతోటే, ఆ కాలానికి కావలసిన ఆహారపదార్థాలను సేకరించి దాచుకొనడం నేర్చుకొన్నాయి; తేనెటీగలు వసంతకాలములో చేర్చిపెట్టుకొన్న తేనెను చలికాలములో వుపయోగిస్తాయి—తాముండే తెట్టెను రెక్కలాడిస్తూ వెచ్చగా వుండేటట్లు చేసుకొంటాయి. ఇవేమీ చేసుకోలేని ఈ జంతువులకు ప్రకృతి శీతాకాలపు బాధలు తప్పించుకోడానిగ్గా నిద్రావస్థను బారిగా చూపెట్టిందేమో!

*　　*　　*

దేహంలో అధికంగా వున్న కొవ్వుపదార్థా

న్నింతా గుండె, వూపిరితిత్తులు వుపయోగించేసిన తర్వాత జంతువుయొక్క వుష్ణత చాలా తగ్గిపోతుంది. అల్లా తగ్గినప్పుడు అవి నిద్రనుంచి మేల్కొంటాయి. అప్పుడే కనక లేవకపోయినట్లయితే అంతటితో చని పోతాయి. చలికాలములో నిద్రపోతూండవలసిన జంతువులు కొన్ని తిరుగుతూండడము చూస్తాము అప్పుడప్పుడు. అప్పు డవి ఆహారముకోసం నిద్ర లేచి వుండొచ్చు.

*　　　*　　　*

పాములు ఒకటే నిద్రపోతాయి. లాన్సకోలమ్ అనే ఆయన నిద్రపోతూన్న 'మాంబా' అనే పాము నొకదానిని నిద్రలేపాడు. అసలు అతిభయంకరప్రవర్తన కల దది. కాని అప్పుడుమాత్రము మొద్దులాగ పడి వుండేదట! కప్పలు కాలవగట్లన బొరియల్లో నిద్రిస్తూంటాయి. నిద్రలేపితే, ఎందుకు బ్రతుకుతున్నామా అన్నట్లుంటాయి.

*　　　*　　　*

తొండలూ, తాబేళ్ళూ సాధారణంగా నిద్రావస్థ లోనికి పోవు. అడవుల్లో పెరిగే ఎలుగ్గొడ్లల్లో ఆడవి మాత్రము నిద్రావస్థలోకి పోతాయి. అవి నిద్ర లేచేసరికి, వాటిప్రక్కనే రెండురెండు నెలల పిల్ల ఎలుగ్గొడ్లు ఆడు కొంటూంటాయి!

*　　　*　　　*

కొన్ని, వాటికి ఆహారంగా వుండే జంతువులు నిద్రావస్థలో వున్నాయి కనుక అవీ నిద్రపోతాయి. ఇలాంటి జంతువుల్లో గబ్బిలము ఒకటి. సాలెపురుగులు మాత్రము వాటి ఆహారపురుగులు నిద్రిస్తూన్నా అవి మాత్రం నిద్రావస్థలోకి పోవు. నెలలకొద్దీ ఆహారము లేకుండా వుండిపోగల వవి!

శ్రీ కాసుఖేల నరసింహారావు.



ఇంట్లో ఎగిరే విమానాలు

రబ్బరుదారాల విసురువల్ల ఎగిరే ఈ బొమ్మ విమానాలు పిల్లల ఆటలకోసం బ్రిటనులో పెద్దపెట్టున తయారుచేస్తున్నారు.

# వేములవాడ చాళుక్యులు

శ్రీ నేలటూరి వెంకటరమణయ్య

## ౧

### ఆధారములు

చాళుక్యవంశజులగు రాజులు దక్షిణాపథమున పెక్కుతావుల దొరతనము సల్పిరి. చాళుక్యవంశమున కెల్ల మూలకందప్రాయమైనది బాదామిశాఖ. బాదామివంశమునుండియే తక్కిన చాళుక్యరాజకుటుంబము లన్నియు నుత్పత్తిల్లినవి. వేంగీపూర్వచాళుక్యకుటుంబమును, కల్యాణిపాశ్చాత్యచాళుక్యకుటుంబమును, గుజరాతు చాళుక్యకుటుంబమును సుప్రసిద్ధమైనవి. ఇంతటి ప్రఖ్యాతి నందకపోయినను ఆంధ్రదేశమున వర్ధిల్లిన రాజకుటుంబములు మఱి రెండు కలవు: (౧) వేములవాడవంశము, (౨) ముంచికొండవంశము. ఈ రెండు వంశములును స్వతంత్రములై రాచరికము సలుపకపోయినను, సార్వభౌమత్వము నంది, దక్షిణాపథమున చాల భాగమును పాలించిన సంస్థానములకు దోడ్పడి యనేక మహత్కార్యముల నొనర్చియుండు కారణమున నివియు చిరస్మరణీయములు.

ప్రథమమున వేములవాడచాళుక్యవంశచరిత్రను గనుగొందము. వీరి చరిత్ర కాధారము లిరుదెఱగులవి: ౧. శాసనములు; ౨. వాఙ్మయము. శాసనములు ద్వివిధములు: శిలాశాసనములు, తామ్రపట్టికలు. శాసనసామగ్రి విస్తారము గాదు. ఇంతవఱకు లభ్యమైనవి ఈ వంశమువారి శాసనములు మూడు. వీనియందు రెండు తామ్రపట్టికలు, తక్కినది శిలాశాసనము.

(౧). కొల్లిపఱతామ్రశాసనము :— గుంటూరు మండలమందలి కొల్లిపఱ యను గ్రామమున దొరకినది. శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారిచే పరిష్కరింపబడి భారతియందు ప్రకటింపబడినది1. ఇందు వరాహముద్రికతోడి వలయమున గ్రుచ్చబడిన ఐదు రేకులు గలవు. ఈ శాసనము నిచ్చిన రాజు చాళుక్యవంశసంభూతు డగు నరికేసరి. ఇతని వంశవర్ణన కలదు. చాళుక్యవంశమున సత్యాశ్రయుడు పుట్టెను; ఇతని కుమారుడు పృథివీపతి. అతనికి మహారాజును, మహారాజునకు రాజాదిత్యుడును కలిగిరి. రాజాదిత్యుని పుత్రుడు వినయాదిత్యుడు. ఇతనికి శ్రీరాముడు రామవిక్రముడు విశ్వరాట్ యుద్ధమల్లుడు నృపాంకుశుడు అను బిరుదనామములు గలవు. ఇతడు సాగరవేలావేష్టితమైన సకలధరామండలమున కధిపతియట! తురుష్క, యవన, బర్బర, కాశ్మీర, కాంభోజ, మగధ, మాళవ, కళింగ, గంగ, పల్లవ, పాండ్య, కేరళ ప్రభృతిరాజలోకముచే నర్చ గొనెనట! భగవన్నారాయణుని వరాహలాంఛనముచే భూచక్రమునంతటిని స్వాధీనపఱచుకొనెనట! ఈ వినయాదిత్యుని కుమారుడే ప్రస్తుతశాసనమును వ్రాయించిన యరికేసరిమహారాజు. ఇతని సుగుణసంపత్తియు, శాంతిశ్యాతిశయమును, విద్యాధిక్యమును విశేషముగ వర్ణింపబడియున్నవి. సమస్తలోకాశ్రయుడు, త్రిభువనమల్లుడు, రాజత్రినేత్రుడు, సాహసరాము డనునవి ఇతని బిరుదనామములు. ఇతడు శ్రీపర్వతమున కుత్తరద్వారమైన ఏలేశ్వరమున నివసించుచుండిన సద్యశ్శివాచార్యుని శిష్యుడగు ముగ్ధశివాచార్యునకు 'రామడు' విషయమున 'ఊరిగ' యను మహాప్రసిద్ధగ్రామమునకు దక్షిణదిగ్భాగమున నున్నట్టియు, 'తువతోలు', 'పరివాతుర్ల', 'పుల్చెలుపుల', 'పోతువాడుపి' గ్రామముల మధ్య నున్నట్టియు, 'బెల్మొగ' మని విశ్రుతమైన గ్రామమును విద్యాదానముగ నిచ్చెను.2 ఈ దానము ప్రకటించుటకొఱకే ఈ శాసనము వ్రాయబడెను.

1. భారతి. సం. ౩, భా. ౨, పుటలు ౨౯౭-౩౧౮.

2. Ibid ౩౦౦-౩౦౧.

(౨) పరభణితామ్రశాసనము :—హైదరాబాదు రాజ్యములోని పరభణివాస్తవ్యుడగు శ్రీ కిం. నా. జోశిగారి కడ నుండెను. ఇది పూనానగరమందలి భారతఇతిహాససంశోధకమండలివారిచే బ్రకటిత మగు మహారాష్ట్రత్రైమాసికపత్రిక (భాగ. ౧౩. అంక. 3) యందు మొదట ప్రచురింపబడెను. 'జైనసాహిత్య ఔర్ ఇతిహాస్' అను హిందీగ్రంథమున 'సోమదేవసూరికా నీతివాక్యామృత్' అను వ్యాసమునకు పరిశిష్టముగ ముద్రింపబడినది3. లిపి యప్పటి తెలుగు-కన్నడ లిపి. భాష సంస్కృతము. ఇందు మూడు రేకులపై నేబదియొక పంక్తుల యక్షరములు గలవు. ఈ శాసనము నొసగిన రాజు సూర్యునినుంచి యుద్భవమైన చాళుక్య వంశమున బుట్టిన ముమ్మడి యరికేసరి. ఇందు అరికేసరి యొక్క వంశప్రశస్తి కలదు. ఆదిత్యభవమగు విశ్రుత చాళుక్యవంశమున యుద్ధమల్లు డను రాజు పుట్టెను. ఇతడు సపాదలక్ష దేశము నేలెను; పోదనమున బైలపాపి యందు ఏనుగుల యవగాహోత్సవమును గావించెను. ఇతని పుత్రుడు అరికేసరి సకలింగత్రయవేంగిదేశమును స్వపరాక్రమమునన్ల జయించెను. అతనికి నరసింహ, భద్రదేవు లను పుత్రు లిరువురు కలిగిరి. నరసింహుని కుమారుడు యుద్ధమల్లుడు. అతనికి బద్దిగ డను తనయు డుదయించెను. ఈ బద్దిగడు నీటిలోని మొసలివలె యుద్ధమున భీమపరాక్రముడైన భీముని జయించెను. బద్దిగని కొడుకు యుద్ధమల్లుడు. ఇతనికి నరసింహు డుదయించెను. నరసింహుని కుమారుడు అరికేసరి. ఇతడు రాష్ట్రకూట కులసంజాతయగు లోకాంబిక యను కన్యకను పెండ్లియాడెను. వీరికి భద్రదేవు డను కుమారుడు పుట్టెను. భద్రదేవుని పుత్రుడు అరికేసరి. ఈ యరికేసరిమహారాజు 'సమధిగతపంచమహాశబ్ద మహాసామన్తాధిపతి సమస్తభువనసంస్తూయమాన ... పామ్బరాంకుశామ్మనగంధవారణగన్ధేభవిద్యాధరప్రియగల్లత్రిభువనమల్లోదాత్తనారాయణ ప్రత్యక్షవాద్యలి విక్రమార్జునగుణనిధి గుణార్ణవసామన్తచూడామణిప్రముఖానేక ... విజయాంకమాలికాలంకృతుడు'. ఇతడు శకాబ్దములు ౮౮౮ గతించిన పిమ్మట ప్రవర్తమానక్షయసంవత్సర వైశాఖ పౌర్ణమాస్యాం బుధవారమునాడు గౌడసంఘమునకు జెందిన యశోదేవమునిశిష్యుడును, యశోధరచరిత్ర స్యాద్వాదోపనిషదాదిగ్రంథకర్తయు నగు సోమదేవసూరి యను జైనవిద్వాంసునకు సబ్బిదేశాంతర్గతమైన రేపాకద్వాదశగ్రామీమధ్యస్థకుప్పుంవృత్తి నికటుపలు గ్రామమును నిజరాజధానియగు లెంబులపాటకమున దన తండ్రియగు బద్దిగనియొక్క 'శుభధామజినాలయ' మను పేరు గల వసతికి ఖండస్ఫుటితనవసుధాకర్మబలినివేద్యార్థముగ దాన మొసగెను4.

ఈవంశమునకు సంబంధించిన శిలాశాసన మొక్కటియే లభ్యమైనది. ఇది వీరి రాజధానియైన వేములవాడయందే కలదు. దీనిని హైదరాబాదునందలి లక్ష్మణరాయ సంశోధకమండలివారు సంపాదించిరి. వారికడ గ్రహించి శ్రీ భావరాజు వేంకటకృష్ణారావు పంతులు ఎం.ఏ., బి. ఎల్. గారు ప్రథమమున ఆంధ్రేతిహాసికసంఘమువారి త్రైమాసికపత్రికయందును, తరువాత ఆంధ్రమున భారతియందును బరిష్కరించి ప్రకటించిరి5. లక్ష్మణరాయసంఘమువారు ప్రకటించిన తెలింగాణశాసనముల సంపుటమునందును నీ శాసన గ్రంథము ప్రచురణమైయున్నది.6 కాని ఇందు శాసనగ్రంథము పెక్కుతావుల యథామాతృకము గాక యపపాఠములతో నిండియున్నది; కాని రావుబహదూరు సి. ఆర్. కృష్ణమాచార్యులవారు మాతృకను జూచి తప్పులను సవరించుకొని యుంచిన తమ ప్రతిని నాకు దయచేసి యొర వొసగిరి. వీరి సవరణల ననుసరించియే ఇచ్చట నీ శాసన గ్రంథమును సంగ్రహముగ దెల్పుచున్నాము:- పరమండైకరాముడు చాళుక్యకులతిలకుడు వినయాదిత్యు డను నామాంతరము గల యుద్ధమల్లు డను రాజొక డుండెను. అతడు అనవద్యరాజ్యమగు సపాదలక్షదేశమును పాలించెను. పోదనమున తైలపూరమగు గాలినిలో ఏనుగులను స్నానమాడించెను. అసురేంద్రుల

3. జైనసాహిత్య ఔర్ ఇతిహాస్. పుట. ౯౦.

4. Ibid.

5. JAHRS VI. P. 16; భారతి. సం. ౧౦. భాగ ౨. పుటలు ౨౫౦-౬౦.

6. తెలిం. శాసనములు. ఇతర. పం. ౨౧.

కైనను సమీపింప శక్యముకాని యా చిత్రకూటమును హరించెను. అతని పుత్రుడు అరికేసరి వేంగీదేశము నఖిలమును బలవంతముగ గ్రహించెను. అతని పుత్రుడు రాజాదిత్యనామాంతరుడగు నరసింహవర్మ్మడు; యుద్ధమల్లు డతనికి బుట్టెను. అటు వెనుక బద్దిగడును, మరల యుద్ధమల్లు డను రాజును ప్రభుత్వమొనర్చిరి. తదనంతరము నరసింహదేవుడు రాజాయెను. ఇతడు దుస్సాధ్యతగలుగు సప్తమాళవముల రాజులను సమరాంగణమున నోడించి తనకు గప్పమిచ్చువారినిగా జేసుకొనెను. తా నొక్కడే యెదురువచ్చిన గూర్జర రాజసేనను నిర్జించి కాళప్రియ మను చోట శిలాస్తంభమున స్వశౌర్యమును లిఖించెను. ఇతనికి అరికేసరి యను తనయు డుదయించెను; గోవిందరాజు క్రుద్ధుడు కాగా వెఱచి తన మఱుగుజొచ్చిన బిజ్జని కభయ మిచ్చి యాతని నరికేసరి సంరక్షించెను. ఇంద్రరాజుపుత్రికయైన రేవకనిర్మడి నిత డుద్వాహము జేసికొనెను. 'సమధిగతం పంచమహాశబ్దమహాసామన్తాధిపతి...పాంబరాంకుశనమ్మనగంధవారణం గన్ధేభవిద్యాధరనారూఢసర్వజ్ఞనుదాత్తనారాయణంనోడుదం తెగల్వాం గుణనిధిగుణార్ణవం శరణాగత వజ్రపంజరం ప్రియగళ్ళం త్రిభువనమల్లసామన్తచూడామణి' యను నవి యరికేసరినృపాలుని బిరుదులు.

బద్దెగభూమిపాలుని తంత్రాధిపాలుడు నాగమార్యు డనునతడు పుట్టెను; అతనికి గుణార్ణవోర్వీపతి యొక్క తంత్రపాలుడు పెద్దణార్యుడను కుమారుడు కలిగెను. ఈ పెద్దణార్యునిచే నిర్మింపబడిన యాదిత్య గృహమునందలి దేవతారాధనమునకు వచ్చిన యభ్యాగతజనసత్రమునకొఱకు అతనిచే నభ్యర్థింపబడినవాడై యరికేసరిక్షితిపతి యుత్తరాయణ సంక్రాంతిదినమున లెంబులవాటకపట్టణమున కీశాన్యదిశయందు నూఱు నివర్తనల భూమిక్షేత్రమును, అష్టనివర్తనల పానీయ భూమిక్షేత్రమును ఇచ్చెను. దీని కచటి రాజేశ్వర గృహాదిత్యగృహబద్దెగేశ్వరనగరేశ్వర ప్రభృతిచతుస్థానాధివాసులైన సాక్షిమల్లికార్జున ముక్తలింగివిద్యారాశి వ్యాఖ్యానభట్టారకులు సాక్షులు. చంద్రశ్రేష్ఠి ప్రభృతులు తొమ్మండుగురు శ్రేష్ఠులు సాక్షులు 7.

శాసనముల మూలముననే కాక కర్ణాట సంస్కృతవాఙ్మయములవల్లగూడ లేములవాడచాళుక్య రాజుల చరిత్ర కొంత తెలియుచున్నది. కర్ణాట కవిశ్రేష్ఠుడైన పంపకవి ఇతని కాశ్రితుడు. స్వవిరచితవిక్రమార్జునవిజయమునందు పంప డరికేసరివంశ చరిత్రమును గుణగణములను వర్ణించియున్నాడు 7-అ.

చళుక్యవంశమున దుగ్ధమల్లు డను రాజు నెగడెను (౧:౧౫); అతడు సపాదలక్షక్షితి నేలెను (౧౬); మఱియు పోదనమున తైలపూరితదీర్ఘికలయం దేనూఱేనుగుల నవగాహమాడించెను (౧౭); అతని కరికేసరి యను పుత్రుడు గలిగెను. ఈ యరికేసరి నిరుపమదేవుని రాజ్యకాలమున వేంగిమండలమును, త్రికళింగమును జయించెను (౧౮–౨౦).

నిరుపమదేవన రాజ్యదొ
ళరికేసరి వెంగివిషయమం త్రికళింగం
బెరసాత్తికొండు గర్వద
బరెయిసిదం పెసర నఖిలదిగ్భిత్తిగళోళ్.

అరికేసరికి నరసింహ భద్రదేవు లను కుమారు లిరువురు సంభవించిరి (౨౧); నరసింహునియొక్క జ్యేష్ఠపుత్రుడు యుద్ధమల్లుడు; అతని పెద్దకొడుకు బద్దెగడు(౨౨); ఇతనికి 'సోలదగండ'డని బిరుదునామము కలదు; నలువదిరెండు సంగ్రామములయందు విజయ మందెను. భీము డను రాజును నీట మొసలిని పట్టినట్లు పట్టెను (౨౩, ౨౫–౬).

బల్వరికె యొళిరి నృపర ప
డల్వడె తత్తిఱిసు రణదొళా విక్రమమం
పొల్వెవ మావజిఱసిదం
నాల్వత్తెర డఱిక గాళగంగోళ్ శితం.

వనదిపరీతభూతళదొ
ళితని సోలదగండ నెంబ పెం

---

7. తెలింగాణశాసనములు. ఇతర. సం. ౨౧

7-అ. పంపవిక్రమార్జున విజయము. ఆశ్వా. ౧౧౫-౬౨.

పిన పెసరంనిమిర్చుదుదు
మల్లద విక్రమదింద నిందను
కళావళితిదాంతరం మొసళె
యం పిడి ంతిర నీరొళొత్తి భీ
మనగరిగర్వదిం పిడియె
మెయ్గలి బద్దిగ నన్నవావనో.

బద్దెగనిపుత్రుడు యుద్ధమల్లుడు; ఇతని కుమారుడు నరసింహదేవుడు (౩౦-౧). ఇతడు లాటుల నోడించెను; ఏడు మాళవములను దిగులవట్టి పాడుగావించెను. విజయారంభపురస్సరవిజయగజములను బట్టుకొని, గూర్జరరాజసైన్యము నెదిర్చి నిర్జించెను; పిడుగువలె పైబడిన నరసింహుని దళమునకు జడిసి యుమ్మలించుచు గుడిచినచో గుడువజాలక, పడుకొనినయెడ బడుకొననేరక, నిలచినచోట్టున నిలువలేక మహీపాలుడు పాఱిపోయెను; గంగాజలముల నిజతురంగమమును తాన మాడించి, ప్రసిద్ధమైన కాళప్రియమున దన యసిలతను నిజభుజవిజయగర్వముసల్ల స్థాపించెను (౩౩-౩౭)

తఱిసెందు లాఱిగొళ్ త
త్తిఱిదేఱం పేఱికేళ్దు మండలమిన్నుం
తిఱునీరిక్కువుదనిసిద
తఱిసలవిన చలదబలద కలినరసింహం.

ఏఱుంమాళముమం పా
ఱుఱె తనుల్దిగుదు నరగ నురిపిదొడకరిం
కేఱిసిదాతన తేజద
బీఱిలనుకరిపు వాదు వొగదురివురిగళ్.

విజయారంభపురస్సర
విజయగజంగళను పిఱిదు ఘూర్జరరాజ
ధ్వజనియ నిఱిదోడిసి భుజ
విజయద విజయనుమనిఱిసిదం నరసింహం;

సిడిలవొలెఱువనరగన
పడెగగిదుమ్మళదినుండడెరయొళుణ్ణదెయుం
కడెదడెరయుళ్ కెడయదనిం
దడెరయుళ్ నిల్లదెయుమోడిదం మహీపాలం.

గంగావార్ధియొ ళాత్మతు
రంగమమం మిసిసి సెగల్ది కాళప్రియదోళ్
సంగతగుణనసిలతెయన
సుంగొళె భుజవిజయగర్వదిం స్థాపిసిదం.

నరసింహుడు జాకవ్వను పెండ్లియాడెను (౩౯). ఈ దంపతుల కరికేసరి యను సుపుత్రు డుదయించెను (౪౧-౨). ఇతనికి పెక్కు బిరుదనామములు గలవు. అందు ముఖ్యమైనవాని గొన్నిటి నిచట చేర్కొని యెదను: 'ఉదాత్తనారాయణం ...... నుదార మహేశ్వరం, కదనత్రినేత్రం, జగదేకమల్లం, పాణ్బరంకుశం, అమ్మన గంధవారణం, పడెమెచ్చెగండం, ప్రియగళ్ళం, గుణనిధి, గుణార్ణవం, సామంతచూడామణి' ఇత్యాది (౧౪౭-౧౪౯ మధ్యవచనం). అరికేసరియొక్క సాహసకార్యములు సంస్మరణీయములు. చళుక్యకుల తిలకుడగు విజయాదిత్యునిపై గోవిందరాజు కోపించగా వాతని వెనుక జేర్చుకొని రక్షించెను; గొజ్జిగ డను సకలచక్రవర్తి యాజ్ఞపై దనమీద దండెత్తి వచ్చిన మహాసామంతులను మాఱుమొగముపడవోడిచి గెల్చెను; అతివర్తియై తన్ను మార్కొన్న చక్రవర్తిని గడపి తన్ను నమ్మివచ్చిన బద్దెగదేవునికి సామ్రాజ్యము నొసగెను; సమదగజఘటాటోపముతో గూడి నేల యదరునట్లు వచ్చి తాకిన కక్కలుని తమ్ముడగు బప్పువనంకకాఱుని యొక మదాంధగంధసింధురముచే నోడించెను.

"చళుక్యకులతిలకనప్ప విజయాదిత్యంగె గోవిందరాజం ముళియతళరద పెఱగిక్కికాద శరణాగతజలనిధియుపెంపుమం గొజ్జిగనెంబ సకళచక్రవర్తి బెససెదందు వంద మహాసామంతరం మరలిఱిదు గెల్ద సామంతచూడామణియ బీరము మనలివర్తియాగి మామఱెవ చక్రవర్తియం కిడిసి తన్న నంబి బంద బద్దెగదేవంగె సకళసామ్రాజ్యవనోరంతుమాడి నిఱిసి దరికేసరియ తోళ్వలముమం సమద గజఘటాటోపం బెరసు నెలనదిరె వందు తాగిద కక్కలనతమ్మనప్పబప్పువనంకకాఱనొంద మదాంధగంధసింధురదోళ్ోడిసిద వైరగజఘటా విఘటననదటుమం..."[౪]

౪. పంప. విక్రమార్జునవిజయము. ఆ.౪.౫౨, ౫౩ లకు మధ్యవచనము.

"నొణ్జిగనెంబ సకళచక్రవర్తి మురియె తనగె శరణాగతనాద విజయాదిత్యనం కాద బల్లాళ్ళనదోళ్ శరణాగతజళనిధియుం..."9

కన్నడమునందే కాక సంస్కృతవాఙ్మయము నందును వేములవాడచాళుక్యుల ప్రశంస కొంత కలదు. సోమదేవసూరి యను జైనపండితవర్యుడు యశస్తిలక మను చంపూకావ్యమును శకాబ్దము ౮౮౧ గతించగా వర్తమానసిద్ధార్థినామసంవత్సరాంతర్గత చైత్రమాసమదనత్రయోదశినాడు పాండ్యసింహల చేరమప్రభృతిరాజులను సాధించి కృష్ణరాజదేవుడు మేల్పాటియం దుండగా తత్పాదపద్మోపజీవి చాళుక్య కులసంజాతుడు అరికేసరియొక్క ప్రథమపుత్రుడగు వా(ద్ది)గదేవుడు గంగధారయందు ప్రవర్ధిల్లుచుండి నపుడు విరచించితి నని తెల్పుచున్నాడు.

'శకనృపకాలాతీతసంవత్సరశతేష్వష్టస్వేకాశీత్యధికేషు (అఙ్కతః ౮౮౧) సిద్ధార్థసంవత్సరాన్తర్గతచైత్రమాసమదనత్రయోదశ్యాం పాండ్యసింహల చేరమప్రభృతీన్మహీపతీన్ ప్రసాధ్య మేల్పాటీ ప్రవర్ధమానరాజ్యప్రభావే శ్రీకృష్ణరాజదేవే సతి తత్పాదపద్మోపజీవినః సమధిగతపఞ్చమహాశబ్దమహాసామన్తాధిపతేశ్చాలుక్యకులజన్మనః సామన్తచూడామణేః శ్రీమదరికేసరిణః ప్రథమపుత్రస్య శ్రీమద్వా(ద్ది*)గరాజప్రవర్ధమానవసుధారాయాం గఙ్గధారాయాం వినిర్మాపిత మిదం కావ్యమితి' 10.

వేములవాడ చాళుక్యవంశచరిత్రను రచించుటకు గల సాధనము లివియే. వీని యాధారముననే వీరి చరిత్రను రచించవలసియున్నది.

## ౨

## వంశానుక్రమణిక - వంశవృక్షము

పూర్వప్రకరణమున వర్ణించిన యాధారముల యందు నాల్గింట వేములవాడశాఖయొక్క వంశానుక్రమణికలు గలవు. ఇందు మొదట పేర్కొనదగినది కొల్లిపఱతామ్రశాసనము. సత్యాశ్రయుడాది యరికేసరిపర్యంతము గల రాజులందు వర్ణింపబడి యున్నారు. ఇందలి వంశవృక్ష మిది:

చాళుక్యవంశమునందు—

సత్యాశ్రయుడు
|
పృథివీపతి
|
మహారాజు
|
రాజాదిత్యుడు (పృథువిక్రముడు)
|
వినయాదిత్యుడు (యుద్ధమల్లుడు)
|
అరికేసరి.

వినయాదిత్యుని పూర్వికులను పేర్కొనున దీశాసన మొక్కటియే. ఇతరశాసనములలోగాని, కర్ణాట సంస్కృత గ్రంథములలోగాని వీరి ప్రస్తావన యెచ్చటను గానరాదు. శాసనాంతరములందేమి, కన్నడ సంస్కృతగ్రంథములయందేమి వేములవాడ చాళుక్య వంశము వినయాదిత్యాపరనామధేయు డగు యుద్ధమల్లుని తోడనే యారంభ మగుచున్నది. వేములవాడ శిలాశాసన మున వీరి వంశవృక్ష మీ క్రిందివిధమున వర్ణింపబడి యున్నది:—

(చాళుక్య కులతిలకుడు)

వినయాదిత్య-యుద్ధమల్లుడు ౧
|
అరికేసరి-౧
×
నరసింహవర్మ-రాజాదిత్యుడు-౧
×
యుద్ధమల్లుడు-౨
×
బద్దెగడు
×
యుద్ధమల్లుడు-3
×
నరసింహదేవుడు-౨
|
అరికేసరి-౨

9. పంప, విక్రమార్జునవిజయము. ఆ. ౧౪. ౩౭, ౩౮ మన్యవచనము.

10. యశస్తిలక, (కావ్యమాలగ్రంథపరంపర సం. ౭౦) పుట ౪౧౯.

ఈ వంశవృక్షమున జెప్పిన మొదటి ముగ్గురికిని, కడపటి యిద్దరికిని గల యన్యోన్యసంబంధము స్పష్టము సేయబడియున్నది. పైజెప్పినవారికిని, క్రిందివారికిని పితృపుత్రబాంధవ్యము గలదని శాసనభావము దెల్లముగు చున్నది. కాని తక్కినవారి కొంపరగులకు గల పరస్పర సంబంధమును నిశ్చయించి చెప్పుటకు వలనుపడదు. 'అతః' 'తతః' 'పశ్చాత్' అను పదములే యొక తరమును దాని కొకటితరముతో గూర్చుటకు వాడబడియుండుట చేత మొదటి నరసింహుని యనంతరము రెండవ యుద్ధమల్లుడును, తదనంతరము బద్దెగడును, నతనివెనుక మూడవ యుద్ధమల్లుడును, వానిపిమ్మట రెండవ నరసింహుడును రాజ్యము జేసిరని తెలియుచున్నది; కాని వారికి గల పరస్పరబాంధవ్యమును నిర్ణయించుటకు వీలుగాదు. పంపకవి తన విక్రమార్జునవిజయపీఠికయందు వర్ణించిన వంశానుక్రమణికయందును నీరాజులందఱుని యీక్రమమున బేర్కొనబడి యున్నారు; కాని యందు పై వంశవృక్షమున జెన్నబడినట్టి యన్నితరములయందును పైవారు క్రిందివారి పితృపుత్ర బాంధవ్యము గలవారని చెప్పియున్నది. పంపకవి పై వంశవృక్షములో గడపటివాడగు ఇమ్మడి యరికేసరినరపాలుని కాశ్రితుడగుటచే నతనిచే జెప్పబడిన బాంధవ్యము వాస్తవమైన దని నమ్మవచ్చును.

ఈ వంశవృక్షము వేములవాడ శాసనోక్తవంశవృక్షములో నీవక్ష్యేదముతో సరిపోవుచున్నది. మొదటి భేదమేమనగా వేములవాడశాసనములలో నాలవ యారవ తరముల రాజులకు మూలపురుషునికి బోలి యుద్ధమల్లుడను పేరు గలిగినట్లు చెప్పియుండగా విక్రమార్జునవిజయమునందు వీరి పేళ్లు దుగ్ధమల్లుడని యున్నది. కాని యీ భేదము తాళపత్రగ్రంథలేఖకుల ప్రమాదమువల్ల గలిగిన దని తోచుచున్నది; కావున నిది యంతగ పరిగణింపదగినదిగాదు. మొదటి యరికేసరికి భద్రదేవుడను నొక తమ్ముడుండె నని పంపకవి తెల్పుచున్నాడు.11 వేములవాడశాసనమున 'భూయోస్మి న్నరసింహభద్ర నృపతిః భూమిం సమాపాదయ[illegible]' అను శ్లోకమున నరసింహుడొక్కడే పేర్కొనబడియున్నాడు. వాస్తవ




11. డాక్టరు ఫ్లీటుగారు ప్రమాదవశమున మొదటి యరికేసరికి నరసింహభద్రదేవు డను కుమారు డొక్కడే యుండినట్లు వ్రాసిరి. (Bom. Gaz Vol. I, Part II. P 380) ఇది తప్పని యెంచి శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు విక్రమార్జునవిజయమునుబట్టి దీనిని సవరించి 'ఇతనికి నరసింహ, భద్రదేవనామాంకితులు ఇరువురు తనయులు కలరు' అని వ్రాసిరి (భార. సం. ౩ ప్రమాదూతి, శ్రావణ. పుట ౩౦౭). కాని వీరి సవరణ శ్రీ భావరాజు వేంకటకృష్ణరావుగారికి నచ్చినది కాదు. వేములవాడ శిలాశాసనమును బ్రకటించుచు పై సవరణ నిట్లు నిరసించియున్నారు: "ఇందు ఫ్లీటు ఇచ్చిన విక్రమార్జునవిజయోదాహృత వంశకథాసారమునుండియే యీ విషయమును గైకొనుచున్నాను. శ్రీ శర్మగారును అద్దానినుండియే తా మిచ్చిన వంశావళిని ఎత్తి వ్రాసిరని యూహింతును. కాని వా రిచ్చిన వంశక్రమమునందు కొన్ని ప్రమాదకరములయిన తప్పులు దొరలినవి. అవి యెట్లు సంభవించెనో యూహింపజాలకున్నాను. (భారతి సం. ౭, పుట ౨౫౬) ఈ విషయమును మఱింత విపులీకరించి యాంధ్రేతిహాసికసంశోధక

ముగ నిది యొక భేదమని తలంచరాదు; ఈ శాసనగ్రంథకర్త యనవసరమని స్వవిరచితప్రశస్తియందు వేములవాడ చాళుక్యవంశమునుండి యుత్పన్నమైన యుపశాఖలను, దత్సంబంధీకుల నామములను వదలివేసిన ట్లున్నది. ఇది నిరాధారమైన యూహ కాదు: పంపకవివాక్యము యొక్క సత్యమును సమ్మతి యరికేసరనాటి పరభణితామ్రశాసనము రుజువుసేయుచున్నది.

"నరసింహో భద్రదేవః తేజఃకాన్తినిధీ స్వయం,
తస్యాసూతాం సుతౌ సాక్షాత్సూర్యచంద్రమసావివ."

కాని ఇది యొక యల్పభేదము; పరిగణింపదగినది కాదు. ఇట్టి యల్పభేదము గానవచ్చుచున్నను పంపకవియు వేములవాడశిలాశాసన గ్రంథకర్తయు వర్ణించిన వంశవృక్షము రెండును నొక్కటియే యని యంగీకరించుట యుక్తము.

మఱియు వేములవాడశాసనమునందు—

"దేవీం వేవకనిమ్మడి క్షితిపతే
రింద్రస్య పుత్రీన్నృణాం
పౌలోమీమివ వాసవశ్రియ మివ
శ్రీమన్మురధ్వంసకః
స్త్రీరత్నం పరిణీయ యేన నితరాం
తస్యాః స్వపత్నీకృతా
నూనాం సప్తసముద్రముద్రితమహీ
మ్మాన్నోన్నతే నాధునా."

అను శ్లోకమున నింద్రరాజుపుత్రికయగు వేవక నిమ్మడి యను స్త్రీరత్నమును బరిణయమైనట్లు చెప్పియున్నది. పంపకవి రొచ్చటను నీయంశమును జెప్పలేదు. విక్రమార్జునుని పట్టాభిషేకసందర్భమున—

'ఆగళ్ రాజ్యాభిషేకదనంతరదొళ్ ధర్మనందనం వాయునందనం దేవకీనందనవశ్యాసీనందన రయ్యాగు మనేకమంగళాలంకృత శరీరం కేసరియం కేసరివిష్టరదొళ్ కుళ్ళిరిసి పంచరత్నశిఖా విరాజమానమప్పపట్టమనెత్తి యాదవవంశసంభూతెయు మనేకలక్షణోపేతెయు మప్పసుభద్రెగ మహాదేవియ పట్టమం కట్టిదాగళ్'12 అని చెప్పియుండుటచే నరకేసరికి సుభద్ర యను పట్టమహిషి యుండె నని తలంపు కలుగవచ్చును; కాని పంపకవి కృతిపతియగు నరకేసరికి కథానాయకుడగు నర్జునునకు నైక్యము గల్పించి చెప్పుటచేతను, నర్జునునికి యాదవవంశభవయగు సుభద్ర

---

త్రైమాసికపత్రికయం దాంగ్లమున నిట్లు చెప్పియున్నారు:

"Mr. Somasekhara Sarma, also discusses in his editorial notes the genealogy as given by Pampa, but gives it with some variations. Dr. Fleet or Mr. Somasekhara Sarma must have made a mistake in understanding the statements of Pampa. Mr. Sarma gives two sons to Arikesari I, Narasimha and Bhadradeva, while Dr. Fleet read the whole as one name Narasimha-bhadra.. There is, in my opinion good reason to assume that Dr. Fleet, who is a greater scholar of the Kanarese than Mr. Sarma, correctly rendered the statements of Pampakavi" JAHRS. VI. P. 175.

సోమశేఖరశర్మగారి కన్నడపాండిత్యమును గొంచెపఱచ బ్రయత్నము సల్పుటకు బదులు పంపకవి ఈ సందర్భమున నేమి వ్రాసెనో కనుగొనగడగియుండిన శ్రీ కృష్ణరావుపంతులవారింత దృఢముగ వ్రాసియుండజాలరు.

ఈ క్రింది పంపభారతపద్యము శర్మగారు చెప్పినట్లు మొదటి యరికేసరికి నరసింహభద్రదేవు లను పుత్రు లిరువు రుండి రని స్పష్టముగ దెల్పుచున్నది:

"అరికేసరిగాత్మజరిరి
నరపతిగోదళన పరణలోగ్రానిభయం
కరకరరాయిస్వరారార్
దొరెయెను నరసింహభద్రదేవర్ నెగళ్ద్ర్".

సర్వత్ర బహువచనప్రయోగము [ఆత్మజర్, భయంకరర్, నెగళ్ద్ర్] కల్గియుండుట 'ఇయిస్వరార్', అనగా ఇయిగురుగ అను మాట శ్రీ శర్మగారి వివరణమే సరియైనదని తేటతెల్లము గావించుచున్నది.

13. పంప, విక్రమార్జున విజయము ౧౪: ౧౩-౧౫ ల మధ్యవచనము.

భార్య యగుటచేతను, సుభద్రయను శబ్దమునకు మంగళవతి యని సామాన్యమగు నర్థము జెప్పుటకు వీలగుటచేతను అరికేసరియొక్క పట్టమహిషి పేరు సుభద్ర యని నిశ్చయించి చెప్పుటకు వలనుపడదు.

ఇక పరభణితామ్రశాసనములోని వంశవృక్షమును పరిశీలింతము.

(ఆదిత్యభవమైన చాళుక్యవంశము)




పరభణితామ్రశాసనమునందు కొల్లిపఱతామ్రశాసనమున వర్ణింపబడిన ప్రథమయుద్ధమల్లుని పూర్వుల ప్రస్తావము గానరాదు. వేములవాడ శిలాశాసనవిక్రమార్జునీయముల బోలి ఇందును వంశకర్త యుద్ధమల్లుడే; వంశానుక్రమణిక ఇతనితోడనే యారంభమగుచున్నది. కాని ఇందలి వంశవృక్షము మించుక పెద్దది. ఇది సహజమే; దీనియందు మఱి రెండుతరముల చాళుక్యరాజులు చేర్చబడిరి. వేములవాడశాసనమును వేయించిన ఇమ్మడియరికేసరియొక్క మనుమడగు ముమ్మడియరికేసరినాటి దగుటచే నిం దిమ్మడి యరికేసరికి ఓమ్మటి రాజులను చేర్చుకొనుట యవసరమాయెను.

పరభణిశాసనోక్తవంశానుక్రమణిక విక్రమార్జునీయ వేములవాడశాసనములందలి వంశానుక్రమణికకంటె భిన్నము గాకపోయినను నందు విశేషాంశములు రెండు గానవచ్చుచున్నవి:—

(౧) చాళుక్యుల వంశము:—వేములవాడ చాళుక్యులేమి, యన్యశాఖలవారేమి తమ వంశ పెద్దియో యింతకుపూర్వ మెచ్చటను జెప్పుకొనియుండలేదు. బాదామివంశమువా రగ్నిష్టోమ పౌండరీకవాజపేయాశ్వమేధాదియాగములను జేసియుండుటచేతను, వర్మాంత నామధారు లగుటచేతను, మఱియు క్రీ. శ. ౭ వ శతాబ్ద పూర్వార్ధమున దక్షిణాపథమునకు వచ్చియుండిన చీనాయాత్రికుడగు హ్యుయన్‌త్సాంగు అప్పుడు దక్షిణాపథమున కధిపతియై యుండిన చాళుక్యుడు ఇమ్మడి పులకేశి క్షత్రియు డని చెప్పియుండుటచేతను వీరిని క్షత్రియులని చెప్పవలసియున్నది. వీరివలె చాళుక్యవంశమునందలి యన్యశాఖలవారిని సైతము క్షత్రియు లనుట యొప్పును; కాని క్షత్రియజాతికి సహజమైన సూర్యచంద్రకుటుంబములలో నే కుటుంబమునకు జెందినవారో తెలియదు. క్రీ. శ. ౬౮౦ నుండి ౬౯౬ పర్యంతము రాజ్యమొనర్చిన పాశ్చాత్యచాళుక్య వినయాదిత్యుని సోరబతామ్రశాసనములో దనది 'హిమకరకరవిమలకుల'మని చెప్పుకొనియున్నాడు 13. దీని గాంచి కొందఱిది చాళుక్యులు చంద్రవంశజు లని సూచించుచున్న దని చెప్పిరి; కాని ఇది యంగీకరింపదగినది కాదు. 'హిమకరకరవిమలకుల'మని యున్నదే కాని 'హిమకరకుల' మని లేదు. కాముదివలె స్వచ్ఛమైన కుల మని చెప్పవచ్చును; గాని చంద్రవంశ మనుట చెల్లదు. చాళుక్యుల వంశప్రస్తావన మొట్టమొదట నీ పరభణిశాసనముననే కానవచ్చుచున్నది. అర్వాచీను లగు పూర్వపాశ్చాత్యచాళుక్యరాజు లెల్ల దాము చంద్రవంశజుల మని యేకగ్రీవముగ బల్కుచుండగా దీనికి విరుద్ధముగ నీ శాసన మొక్కటిమాత్రము చాళుక్యులది సూర్యవంశమని తెల్పుచున్నది.

13. E. VIII. SB.

'అస్త్యాదిత్యభవో వంశ శ్చాలుక్య ఇతి విశ్రుతః'

అను శాసనవాక్యమున కన్యథా యుక్తమైన యర్థ మేదియు గానరాదు. పరస్పరవిరుద్ధమైన ఈ వంశనిర్దేశమునకు సమన్వయ మెట్లో తెలియదు. చాళుక్యుల కింతకుపూర్వము వంశవిషయమై జిజ్ఞాస గలిగినట్లు తోచదు. సూర్యచంద్ర వంశములలో దను దిద్దమైనదియు వారెఱుగనట్లున్నది. కావున వంశమును బేర్కొనవలయు నని ఇచ్ఛ కలిగినప్పుడు అప్పటి పౌరాణికాభిప్రాయము ననుసరించి వారు సూర్యవంశజుల మని మొదట జెప్పుకొనియుండవచ్చును. అర్వాచీనులు దీని నేకారణముచేతనో యొప్పుకొనక సూర్యవంశమునకు స్వస్తి చెప్పి చంద్రవంశమువార మని ప్రకటించుకొని తదనుగుణముగ నూతనవంశానుక్రమణికలను, గాథలను నిర్మించుకొని యుండవచ్చును.

(౨) మఱియొక యంశము: వేములవాడ శాసనమునందు—

దేవీం రేవకనిర్మ్మడి క్షితిపతే
రిన్ద్రస్య పుత్రీం స్తుతాం
పౌలోమీమివ వాసవ శ్శ్రియ మివ
శ్రీమన్మురధ్వంసకః
స్త్రీరత్నం పరిణీయ యేన నితరాం
తస్యా స్స్వపత్నీకృతా
నూనాం సప్తసముద్రముద్రితమహీ
మ్మాన్యోన్నతేనామునా.

అని చెప్పియున్నది. ఇందువల్ల నింద్రరాజు కుమారిత రేవకనిర్మ్మడి యను స్త్రీరత్న మిమ్మడి యరికేసరికి సతి యైనట్లు తెలియవచ్చుచున్నది. ఈ ఇంద్రరాజు నానవాలుపట్టుటకు దగు సాధనము లీ శాసనమున గాని, యన్యత్రగాని కాన్పించవు. పంపకవి తన విక్రమార్జునీయపీఠికయం దొక ఇంద్రరాజు అరికేసరిని బాల్యావస్థయందు తొట్లయందు బోలి నిజభుజముపై నుంచుకొని పెంచినట్లు చెప్పియున్నాడు.

చంద్రాంభోధిపరీత మ
హీంద్రరదారిన్నరీనరేంద్రం సాక్షా
దింద్రం తానెనెసలెనెగ
ల్దింద్రేంద్రనతోళ తొట్టిలాగిర బళెదం.[14]

అర్జునుడు అమరావతికి బోయి ఇంద్రుని యర్ధాసనమున గూర్చుండి యోలగమున్న తెఱగు వర్ణించుచు—

దనుజానీకద నిందదొందు నెలెయం
ముట్టుత్తె మాదేవని
త్తనిజోగ్రాస్త్రది దైత్యాంబ పెసరి
ల్లెంబంకుటం మాడిబం
దని తానుం మహిమానుణక్కె కణియా
గిర్వాణంను పెంపింద మిం
ద్రనోళర్ధాసన మేఱి దొప్పహరి గం
గక్కం పెఱంగక్కమే.

అని పొగడియున్నాడు. 'హరిగంగక్కం పెఱంగక్కమే' అను వాక్యమువల్ల నర్జునుడు దేవేంద్రుని యర్ధాసనమున గూర్చొనినట్లు అరికేసరి యింద్రరాజు నర్ధాసనమున గూర్చుండెనేమో యను శంక కలుగుచున్నది; కాని యర్జునునికిని, కృతిపతియగు నరికేసరికిని నైక్యము గల్పించి పంపకవి చెప్పియుండుటచేతను, నర్జును డింద్రుని యర్ధాసనము నెక్కుట సుప్రసిద్ధతైహాసికగాథ యగుటచేతను నీ విషయమును నొక్కి చెప్పుటకు వలనుగాదు. అరికేసరి యింద్రరాజుతో నర్ధాసనమున నాసీను డగుట చారిత్రకాంశమైనను గాకపోయినను బాల్యమున నతని నింద్రరాజు తన భుజముపై నిడుకొని సాకినది నిశ్చయము. కావున నతని నెత్తి పెంచిన ఇంద్రరాజే ఇతనికి పిల్ల నిచ్చిన ఇంద్రరాజు కావచ్చును. ఇం దసామంజస మేమియు లేదు. ఈ యింద్రరాజెవ్వరో యనామధేయుడై యుంచిన పంపకవి నిజప్రభువగు నరికేసరి యాతని భుజములే డోలగా పెరిగె నని గొప్పగ జెప్పియుండెను. ఇంద్రరాజు విఖ్యాతు డగుటచేతనే పంపకవి యంతటి సుప్రసిద్ధు డెత్తుకొని పెంచిన ఘనుడు దన ప్రభు వని ప్రకటించెను. ఈ ఇంద్రరాజు క్రీ.శ. ౯౧౫ నుండి ౯౩౦ వఱకు దక్షిణాపథమునకు సార్వభౌముడై ప్రజాపాలన మొనర్చిన రాష్ట్రకూటవంశజుడగు ముమ్మడి ఇంద్రరాజని తలచెదను.

---

14. విక్ర. విజ. ఆ. ౧: ౪౪.

పరభణిశాసనమున నింద్రరాజు మాటకాని, యాతని పుత్రికయగు రేవకనిర్మడి ప్రస్తావముగాని కానరాదు. 'అం దిమ్మడియరికేసరియొక్క భార్య రాష్ట్రకూటవంశసంజాతయగు లోకాంబిక యని చెప్పి యున్నది.

'రాష్ట్రకూటకులే ఖ్యాతే జాతా లోకాంబికా సతీ
వీరశ్రీరివ వీరస్య తస్యాసీ త్సుదతీ ప్రియా.'

ఇంద్రరాజు నిచట జేర్కొనకపోవుట గమనార్హమైన యంశము. ఇతడు లోకాంబికకు జనకుడై యుండిన యీ విషయ మిందు క్తము గాకపోవుట చిత్రము. కాని శాస. గ్రంథకర్త యేకారణముచేతనో యిమ్మడియరికేసరినరపాలుని మామగారిని జేర్కొనక విడిచియుండవచ్చు ననుకొన్నను నతని భార్యపేరు రేవకనిర్మడి యని చెప్పక లోకాంబిక యని కొన్నిం చియున్నాడు. లోకాంబిక యనునది రేవకనిర్మడియొక్క మాఱు పేరని తలచుటకు దగిన యాధార మేమియు నున్నట్లగపడదు. పరభణిశాసనమున నింద్రరాజుప్రస్తావము లేకపోవుటచేతను, నిమ్మడియరికేసరిభార్యపేరు లోకాంబిక యని యుండుట చేతను, రేవకనిర్మడి లోకాంబికకంటె భిన్నమైన వ్యక్తి యని తలచెదను. ఇది యుక్తమేని యిమ్మడియరికేసరి కిరువురు భార్య లుండి రని చెప్పవలసియున్నది.

ఇక యశస్తిలకయందు జేర్కొనబడిన యరికేసరియు, నాతని ప్రథమపుత్రుడగు వాగరాజును ఎవ్వరో విచారింతము. యశస్తిలకరచయితయగు సోమదేవసూరి క్రీ. శ. ౯౬౬ వ సం. నాటి పరభణిశాసనము వేయించిన ముమ్మడియరికేసరి కాశ్రితుడని యీ శాసనమునందే కలదు. కాని యశస్తిలకయందు జేర్కొనబడిన యరికేసరి యాతడు కాజాలడు. ఏలన నా గ్రంథము పరభణిశాసనకాలమునకు ముందే రచియింపబడెనని—

"తేషాం శత స్యాగ్రజః శతస్య
తయా భవ త్పూర్వజఏవ ధీమాన్
శ్రీసోమదేవ స్తపసః శ్రుతస్య
స్థానం యశోధామ గుణోర్జితశ్రీః.
అపిచ యో భగవానాదర్శ స్సమస్తవిద్యానాం
రచయితా యశోధరచరితస్య..."

ఇత్యాది శాసనవాక్యములవల్ల దెలియును; మఱియు నీ సోమదేవసూరి యశస్తిలకయంత్యమందు శకాబ్దములు ౮౮౧ సిద్ధార్థి సంవత్సరాంతర్గతమదనత్రయోదశినాడు (అనగా క్రీ. శ. ౯౫౯ ) అరికేసరి ప్రథమపుత్రుడగు వాగరాజు రాజ్యము సేయుచుండగా వ్రాసి ముగించితి నని చెప్పియున్నాడు. కావున నీ వాగరాజుతండ్రియగు నరికేసరి పరభణిశాసనోక్తదానము నొసగిన యరికేసరికంటె భిన్నుడగుట తెల్లము; అతడు పరభణిశాసనదాతకు దాతయగు నిమ్మడియరికేసరి యని తోచుచున్నది. 'వాగ'రా జను పది బద్దెగ, లేక వద్దెగ శబ్దమునకు లేఖకప్రమాదజనితమైన భ్రష్టరూప మను నూహ పొడముచున్నది. బద్దెగ శబ్దమునొక్క సంస్కృతరూపము భద్రగ యగుట చేతను, పరభణిశాసనమున నిమ్మడియరికేసరి పుత్రుడును ముమ్మడియరికేసరి తండ్రియు నగు భద్రదేవు డొకడు జేర్కొనబడియుండుటచేతను నీ వాగరాజును, భద్రదేవుడును నొక్కరే కావచ్చు నను తలంపు కలుగుచున్నది. కాని దీని నిర్ధారించి చెప్పుటకు వీలులేదు; 'శ్రీమదరికేసరిణః ప్రథమపుత్రస్య' యని సోమదేవసూరి చెప్పుటవల్ల పరభణిశాసనమున జేర్కొనబడిన ముమ్మడియరికేసరితండ్రియగు భద్రదేవుడు భిన్నపురుషుడు కావచ్చును. ఇమ్మడియరికేసరికి వాగరాజు భద్రదేవు లను నిరువురు పుత్రు లుండియుండవచ్చును. ఇం దసంగత మేమియు లేదు.

పై జేర్కొనిన శాసనములయందును, సంస్కృత కర్ణాటగ్రంథములను జెప్పియుండు వంశానుక్రమణికల నన్నిటిని గ్రోడీకరించిన నీ క్రింది వంశవృక్ష మేర్పడుచున్నది :




## 3

## అంతశ్శాఖాసంబంధము

శాసనములందున్నను, వాఙ్మయములందును దెలియవచ్చు చాళుక్యరాజకుటుంబములు పెక్కు కలవు. వేములవాడ శాఖవారికి వీనితో నెద్దియేనియు సంబంధము గలదో విచారించవలసియున్నది. వేంగినేలిన పూర్వచాళుక్యుల వలెను, కల్యాణి రాజధానిగ కర్ణాటకమును పాలించిన పాశ్చాత్యచాళుక్యులవలెను దమను బాదామి చాళుక్య

లతోగాని, యన్యశాఖలవారితోగాని సంబంధముండినట్లు నీ రెచ్చటను విస్పష్టముగ జెప్పఁబడియుండలేదు. ఈ విషయమును లభ్యమైన వాఙ్మయశాసనాదిచారిత్ర కాధారములను బరిశీలించి యూహింపవలసియున్నది. పరిశోధకు లీ విషయమునుగూర్చి కొంత కృషి సల్పి కొన్ని సిద్ధాంతములను జేసియున్నారు. ఈ సిద్ధాంతము లన్నియు మొదటి యరికేసరికొల్లిపఱశాసనముపై నాధారపడియుండుటచేత దాని యోగ్యతను విచారించి యది యెంతవరకు విశ్వాసపాత్రమో కనుగొనవలసి యున్నది. ఈ శాసనదాతయగు మొదటి యరికేసరి క్రీ శ. ౭౭౦ మొదలు ౭౯౩ వఱకును రాజ్యపాలనము గావించిన రాష్ట్రకూటచక్రవర్తియగు నిరుపమదేవునికి సమకాలికుఁడని విక్రమార్జునవిజయమువల్ల దెలియ వచ్చుచున్నది. కావున కొల్లిపఱశాసనము గూడ నప్పటిదే కావలయును; శాసనాక్షరములుగూడ దీనికి బ్రతికూలించవు. కాని శాసనోక్తచారిత్రకాంశములను బట్టి యది కల్పనమై యుండునేమో యను సంశయము గల్గుచున్నది. పంపని విక్రమార్జున విజయమందును, ఇమ్మడిముమ్మడి యరికేసరి నరపాలుర శాసనములందును వేములవాడ వంశమునకు మూలపురుషుఁ డనదగిన మొదటి యుద్ధమల్లుడు సపాదలక్షదేశమును పాలించెననియు, చిత్రకూటదుర్గమును సాధించెననియు, బోదనపురమున తైలభూర దీర్ఘికయం దేనూటేనుగుల నవగాహమాడించె ననియు జెప్పియున్నది. మఱియు మొదటి యరికేసరి నిరుపమదేవుని యేలుబడియందు త్రికలింగసహితముగ వేంగిని జయించినట్లు చెప్పియున్నది. మొదటి యరికేసరిదగు నీ శాసనమున నీ విజయముల ప్రస్తావనయే లేదు. త్రికలింగసహితవేంగిరాజ్యమును జయించక పూర్వ మరికేసరి ఈ తామ్రశాసనము వ్రాయించియుండు ననుకొన్నను తన తండ్రి కీర్తిలతకు పాదులగు చారిత్రాత్మకవిషయముల నేల పేర్కొనలేదో తెలియదు. 'కురుమ్వ యవన బర్బర కాశ్మీర కాంభోజ మగధ మాళవ కళింగ గంగ పల్లవ పాండ్య కేరళ ప్రభృతి దేశములను జయించె నని చెప్పిన ప్రశస్తికర్త సపాదలక్షపై ప్రభుత్వమును జిత్రకూటదుర్గ క్రమణమును బేర్కొనకుండుట చిత్రము. ఇక వంశానుక్రమణిక యపూర్వమైనది. అన్యచాళుక్య శాసనములలో నెచ్చటను గానరాదు. చూడుడు:




ఈ పట్టికలోని రాజులకు బాదామి చాళుక్య వంశముతో సంబంధమును గలుపుటకు కొందఱు పరిశోధకులు ప్రయత్నములు సల్పిరి. కొల్లిపఱతామ్ర శాసనపరిష్కర్తలు శ్రీ సోమశేఖరశర్మగారు ఇట్లు నుడివియున్నారు:

"మన శాసనమునందలి మొదటి రాజు సత్యాశ్రయుడు. ఇతనికి రణవిక్రమబిరుదము కలదు. బాదామి చాళుక్యవంశములోని మొదటి పులకేశికిని రణవిక్రమ, సత్యాశ్రయనామములు కలవు. ఈ కారణమున ఇరువురు నొక్కరే యగుదు రన్నచో మన శాసనమునందలి పృథివీపతి మొదటి పులకేశికుమారుడైన మొదటి కీర్తివర్మ కావలయును. మొదటి కీర్తివర్మశాసనములలో నెచ్చటను అతనికి పృథివీపతి యను రూఢిపేరున్నట్లు తెలియరాదు. ఒకవేళ పృథివీపతి కీర్తివర్మయే యగునేని అతని కుమారుడైన(?) మహారాజు సత్యాశ్రయ రెండవ పులకేశి కావలయును. రెండవ పులకేశి యే శాసనములందును వట్టి మహారాజనామమున పేర్కొనబడలేదు. రెండవ పులకేశికి ఆదిత్యవర్మ, చంద్రాదిత్యుడు, విక్రమాదిత్యుడు, జయసింహవర్మ యను నలుగురు తనయులు కలరు. మన శాసనమునందలి మహారాజును, రెండవ పులకేశియు నొక్కరే యని మనము విశ్వసించినచో మన శాసనమున మహారాజుకొడుకుగ దెలుపబడిన రాజాదిత్యుడు ఆదిత్యవర్మయో, చంద్రాదిత్యుడో కావలయును. చంద్రా

దిత్యుని శాసనము లేవియు ఇంతవఱకు గనపడలేదు. కాని యతని భార్యయైన విజయమహాదేవి దానములను దెలుపు రెండు శాసనములు కలవు: ఒకటి సావంతవాడి సంస్థానములోని నేరూరుశాసనము; రెండవది రత్నగిరిమండలములోని కొచ్రేమ్‌శాసనము. ఈ శాసనములు దొరకిన స్థలములు ధార్వాడమండలమునకు సమీపస్థములే. ఇక నాదిత్యవర్మది ఒక్క శాసనముమాత్రమే కలదు. అది కర్నూలు శాసనము. ఇందు శకవర్షము లేదు కాని, శాసనకాలము "ప్రవర్ధమాన విజయరాజ్యసంవత్సరే కార్తికపౌర్ణమాస్యాం" అని మాత్రము కలదు. పైతామహీహిరణ్యగర్భమహోత్సవమున ఆదిత్యవర్మ కొంతమంది బ్రాహ్మణులకు చేసిన ముండికల్లు పగ్గిడె గ్రామములకు సంబంధించిన 'ఉంభమన్నపన్నాసవృత్తి' దానమును దెలుపుటకీ శాసనము పుట్టినది........చంద్రాదిత్యుడో, ఈ ఆదిత్యవర్మయో మన శాసనమునందలి రాజాదిత్యుడు కాదగును. లక్ష్మేశ్వరమే పులిగెఱె యన్న ఫ్లీటుదొరగారి సిద్ధాంతము నంగీకరించినచో ప్రాంతసన్నిహితత్వము ననుసరించి మన రాజాదిత్యుడు చంద్రాదిత్యుడు అగు నవచ్చును. పులిగెఱె లక్ష్మేశ్వరము కాదన్నచో ఆదిత్యవర్మ శాసనమున మఱియొక పగ్గిడె (పుల్గిఱె?) కానవచ్చుచున్నందువలనను కర్నూలుమండలముననో, దానికి చేరికగనో ఎచ్చటనో మఱియొక పుల్గిఱె (పులి చెఱువు, పుల్చెఱువు, పుల్చెగువు) ఉండుననని భావించుకొని మన శాసనపు రాజాదిత్యుని యీ ఆదిత్యవర్మతో ముడిపెట్టవలసియుండును......కర్నూలుమండలమున నొక పులచెఱువు కలదు......మన శాసనమునందలి ముగ్ధశివాచార్యుల గురువగు సద్యోశివాచార్యులు (?) ఏలీశ్వరము నివాసముగ చేసికొన్నట్లు చెప్పబడియుండుట వలనగూడ ప్రాయికముగ మన శాసనమునందలి అరికేసరి ఏలీశ్వరప్రాంతమువాడనియు నూహింప నవకాశము కలదు.........అరికేసరిరాజ్యము కర్నూలుమండలమునగాని, లేక దాని యిరుగుపొరుగుల నిజాం రాజ్యమునందలి మండలములలోగాని వ్యాపించియుండవలయును. ఇదియే మన మంగీకరించుచో నెడల శాసనమునందలి రాజాదిత్యుడు బాదామిచాళుక్యవంశజుడైన ఆదిత్యవర్మ యగునేమో యని యనుమానము కలుగుచున్నది. అట్లయిన మన శాసనదాత బాదామి చాళుక్యులలోని ఆదిత్యవర్మ వంశమునకు చెందినవాడు కావలెను."15

ఇంత విపులముగ చర్చ చేసినను శర్మగారికి అరికేసరికి బాదామిచాళుక్యులతో సంబంధము కలదన్న నమ్మకము కుదురలేదు. కొల్లిపఱ శాసనోక్త వంశావళి సర్వత్ర సంశయగ్రస్తమగుటయే వీరి యపనమ్మకమునకు ప్రధానకారణము.

"మన శాసనమునందలి వంశావతారక్రమము ననుసరించి చూచినయెడల నీ వంశ మొక వేఱె బాదామి చాళుక్యవంశశాఖ యగునేమో యని తోచును. కాని యీ విషయమును నిర్ధారణగ జెప్పుటకు వీలు కనుపించదు. ఏలయన, తరతరమునకు అన్నియు సందేహములుగనే యున్నవి."16

శ్రీ శర్మగారివలెనే శ్రీ ములియ తిమ్మప్పయ్యగారు కొల్లిపఱ వంశావళికి మూలపురుషుడగు సత్యాశ్రయ రణవిక్రముడే బాదామిచాళుక్యవంశములోని సత్యాశ్రయ రణవిక్రమాపరనామధేయుడగు మొదటి పులకేశి యని నిశ్చయించినారు. వీరును కొల్లిపఱవంశావళిలోని పృథ్వీపతియు మహారాజును మొదటి కీర్తివర్మయు నతని పుత్రుడగు నిర్వడి పులకేశియు నగుదురని గుర్తించిరి. కాని యటుతరువాత వీరు శర్మగారి మార్గమును విడిచి నూతనపంథ నవలంబించిరి.

"సర్వకర్ణాటసంపదకు సారభూతుడగు రెండవ పులకేశి సత్యాశ్రయమహారాజునకు నలుగురు పుత్రులు. వారియందు మొదటివాడగు చంద్రాదిత్యుడు తండ్రికొక్క బాదామిసింహాసనము నెక్కలేదు. సంస్కృతకవయిత్రులందు సమానకీర్తికి నెలవగు వల్లభయైన విజయభట్టారికతో గూడ నతడు సావంతవాడియం దుండె. బాదామిసింహాసనము నధిష్ఠించిన యతని తమ్ముడు విక్రమాదిత్యుడు చక్రవర్తి యాయెను. పెద్దవాడు అన్న యుండగా తమ్ము డేకారణముచే నెట్లు

---

15. భారతి. సం. ౭. భా. ౨. పుటలు ౩౦౭-౮.
16. భారతి. సం. ౭. భా. ౨, పుట ౩౦౭.

ప్రభు వారొసంగు విషయమును పరిశీలించి చూచిన మన్నవది మనదారికి రాదు. బహుశః విక్రమాదిత్యుడే రాజ్యరక్షణసమర్థుడై యుండియుండవలె ననుకొందును. మూడవవాడగు ఆదిత్యవర్మ వేంగియందు రాజ్యముసేయుచుండెను. మొదటనే సత్యాశ్రయపులికేశియొక్క సహోదరుడగు కుబ్జవిష్ణువర్ధనుడు వేంగివిషయమునకు ప్రభువై యుండుటచే నీ యాదిత్యవర్మ అతనికి లోబడి యటుమీద వేంగియందు సామంతుడై యుండవలెనని తోచుచున్నది. నాలవవాడగు జయసింహుడు లాటదేశము నేలుచుండెను. సహోదరులగు నీ నలువురు రాకుమారులలో విక్రమాదిత్యుడు బాదామియందధిరాజై యుండినది క్రీ. శ. ౬౩౪ నుండి ౬౮౦ వఱకు 17. చిన్నతమ్ముడైన లాటజయసింహుడు విక్రమాదిత్యుని కంటె యెంతయో చిన్నవాడై యుండవలయు ననుటకు సంశయము లేదు. వానికి శీలాదిత్య, వినయాదిత్య-యుద్ధమల్లులను పుత్రులు పెద్దగుండిరి. వారియందు రెండవవాడగు వినయాదిత్య-యుద్ధమల్లు ఒసగిన భూదత్తిశాసన మొకటి యీ లాటప్రాంతమున 'నవసారి' యను చోట దొరకినదనియు, నా శాసనకాలము శా. శ. ౬౫౩ (క్రీ. శ. ౭౩౧) అనియు శ్రీ భండార్కరుగారు సూచించియున్నారు... పశ్చిమచాళుక్యశాసన పంపవిక్రమార్జున విజయములందు రెండిటియందును ఈ (వేములవాడ) కులమూలపురుషుని పేరు కట్టి యుద్ధమల్లు డనియే కానవచ్చుచున్నను వేములవాడశాసనమునందు వినయాదిత్య-యుద్ధమల్లుడని డాక్టరు భండార్కరు చెప్పినట్లే కానవచ్చుచున్నది. అంతమాత్రమే కాదు. పంపడనినట్లు 'అరికేసరివంశశిఖామణి'యైన ఈ యుద్ధమల్లుని కొడుకగు మొదటి అరికేసరియొక్క శాసన మొకటి 'కొల్లిపాఱ' యను చోట దొరకినది. అందుకూడ 'విశ్వరాడ్వినయాదిత్యో యుద్ధమల్లో నృపాంకుశః' అని యున్నది. వినయాదిత్యుడను బిరుదుతోగూడ ఆ యుద్ధమల్లుడు పిలువబడుచుండె ననుటకు సంశయము లేదు18." కావున లాటవినయాదిత్య - యుద్ధమల్లుడను కొల్లిపాఱ వినయాదిత్య-యుద్ధమల్లుడును నొక్కడే యని నిశ్చితమగుచున్నది.

"కాని, ఈ యభిప్రాయమును వదిలించి కదలించునట్లుగ పదు యాక్షేప మింకొకటి తలచూపుచున్నది. వెనుక నూహించిన యభిప్రాయము బట్టి వినయాదిత్య-యుద్ధమల్లుని తండ్రి లాటజయసింహుడు గావలయును గదా. ఆ కొల్లిపాఱశాసనమునందు వినయాదిత్య-యుద్ధమల్లుని తండ్రిపేరు 'రాజాదిత్య పృథువిక్రమ' యనియే కానవచ్చుచున్నది. ఈ యాక్షేపము పైదానికంటె సబలముగనే కన్పించుచున్నది." కాని చక్కగ విచారించి చూచితిమేని ఇది యంతటి ప్రబలమైనది కాదని విదితము కాగలదు. కొల్లిపాఱశాసనమందలి వంశమునందు వినయాదిత్య యుద్ధమల్లుని తండ్రిపేరు జయసింహవర్మ యని కాన్పించలే దనుటమాత్రము నిజము. అయినను, వినయాదిత్య-యుద్ధమల్లునికి పూర్వీకు లందరిపేర్లును బిరుదములు గనే తోచుచున్నవే కాని యంకితనామములుగ భాసమగుట లేదని యందఱు నొప్పుకొనకపోరు. అట్లగుటచే క్రింద నిరూపించిన శ్రీ భండార్కరుగారి గ్రంథమునందలి వంశచరిత్రలోను కొల్లిపాఱ శాసనములోను తెలియవచ్చు వంశావళిభాగముల నొండొంటి దిగువ నిచ్చి యీ యీ వాలు రాజు లభిన్నులై యుండవచ్చునేమో పరీక్షింతము.

శ్రీ ఆర్. భండార్కరుగారిది—

౧. పులికేశి I

౨. కీర్తివర్మ I

౩. పులికేశి II

౪. జయసింహవర్మ

(లాట)

కొల్లిపాఱశాసనమున గన్పట్టునది—

౧. సత్యాశ్రయ-రణవిక్రమ

|

౨. పృథ్వీపతి

|

౩. మహారాజ

|

౪. రాజాదిత్య-పృథువిక్రమ

17. ఇది తప్పు. విక్రమాదిత్యుడు క్రీ. శ. ౬౫౫ సంవత్సరమున సింహాసనము నధిష్ఠించెను. మఱియు నతడు ౨౫ యేండ్లు రాజ్యపాలనము గావించిన ట్లతని శాసనముల్ల దెలియుచుండుటచే నతని యేలుబడి క్రీ. శ. ౬౮౦-౧ వఱకు సాగె ననుట తెల్లము.

18. నాడోజపంప, పుటలు ౨౩-౨౫.

వీనియందు కొల్లిపారశాసనవంశావళిలో గనుపడు మొదటి 'సత్యాశ్రయ-రణవిక్రమ'యను పేరును జూడుడు. శ్రీ ఆర్. భండార్కరుగారు చెప్పినట్లు పడు నా మొదటి పులకేశియే ఈ కులమునందు పరంపరను బట్టి వచ్చు 'సత్యాశ్రయ' బిరుదునకు మూలపురుషుడగు 'సత్యాశ్రయ-రణవిక్రము' డనుట తప్పు కాదు. ఆ సత్యాశ్రయుని తండ్రి 'రణరాగు' డని (యున్నది). అందువల్ల తండ్రిసంజ్ఞతో గూడ స్వబిరుదును జేర్చుకొనిన మొదటి పులకేశిని అట్లే 'సత్యాశ్రయ-రణవిక్రమ'యను అంకితముల్ల శాసనకారుడు నిరూపించియున్నా డని యూహించునది సకారణముగనే యున్నది. పై కొల్లిపారశాసనోక్తమైన (సత్యాశ్రయ-రణవిక్రమునికి) దగురాత (చ్చు) ముగ్గురు పేళ్లను బిరుదులుగ వ్యక్తపరచుట ఈ యభిప్రాయమునకు ప్రబలమైన యాధార మగుచున్నది. అంతమాత్రమే కాదు. మువ్వటి వినయాదిత్య-యుద్ధమల్లునికి 'రామవిక్రమ, రాజాశ్రయ' మొదలగు బిరుదుల నిచ్చి, మొదటి యరికేసరిని 'త్రిభువనమల్ల-రాజత్రినేత్ర సాహసరామః ఇత్యేతై రభిధానై రభిష్టుతః' అని వర్ణించుటను జూడగా ఆ శాసనకారుడు రాజబిరుదులలోనే యొక్కడు ప్రవీణత గలవా డని సిద్ధమగుచున్నది. ఆ కొల్లిపారశాసనము సుమారు క్రీ.శ. ౬౫౦ సంవత్సర పరిసరమున దల చూపియుండవచ్చునని ఆ యాంధ్రచారిత్ర పత్రికా లేఖకులు సూచించియున్నారు. ఆ సూచన వల్ల వంపారిశాసనపు వినయాదిత్య-యుద్ధమల్లుడును ఆ కొల్లిపారశాసనపు వినయాదిత్య యుద్ధమల్లుడును అభిన్నులే అయియుండవలె ననుట మఱింత దృఢమగుచున్నది.19"

తిమ్మప్పయ్యగారి సిద్ధాంతము నంగీకరించుటకు వీలులేదు. కొల్లిపారశాసనోక్తవంశావళి చరిత్రాత్మకమని వీరు ఋజువుపఱచ నవలంబించిన మార్గము వింతయైనది. ఈ వంశావళియందు వినయాదిత్య-యుద్ధమల్లునికి పూర్వీకుల పేరులు బిరుదు లని నిశ్చయించినారు. కాని యందలి పృథ్వీపతి రాజాదిత్య నామములు తిమ్మప్పయ్యగారు చెప్పినట్లు కేవల బిరుదు లని యెంచుటకు వీలులేదు. పృథివీమహారాజు, పృథ్వీపతి, రాజాదిత్య యనునవి యంకితనామములుగ ప్రాచీన శాసనములయందు వాడబడియున్నవి. ఒకవేళ తిమ్మప్పయ్యగారనునట్లు బిరుదులే యని యొప్పుకొనినను కొల్లిపరశాసనవంశావళిలోని రాజులలో నొక సత్యాశ్రయ-రణవిక్రమునిదప్ప తక్కినవారిని బాదామిశాఖవారని నిర్ధారించి చెప్పుటకు వలనుపడదు. తిమ్మప్పయ్యగారి సమన్వయము నొప్పుకొనినచో బాదామిశాఖలోని మొదటి కీర్తివర్మకును, రెండవ పులకేశికిని, నతని పుత్రుడగు (లాట) జయసింహునకును వరుసగ పృథివీపతి, మహారాజ, రాజాదిత్య - పృథువిక్రము లను బిరుదులుండిన వని చెప్పవలసివచ్చును. బాదామి చాళుక్య రాజుల శాసనములును, వారిని పేర్కొను వారి వంశజుల శాసనములును పెక్కు ప్రకటితమై యున్నవి. ఎచ్చటను మొదటి కీర్తివర్మకు పృథ్వీపతి యను నామాంతరము గాని, బిరుదుగాని యున్నట్లు సాక్ష్యము లేదు. ఇక 'మహారా' జనునది యొక బిరుదని చెప్పుటకంటె రాజ్యపదమును సూచించు నామవాచక మనుట యొప్పును. ఇది భూపాలుర కెల్లరకు సామాన్యమే. కావున కొల్లిపరశాసనావళిలోని 'మహారాజు' బాదామిశాఖలోని ఇమ్మడి పులకేశియే యని నిర్ధారించుట కెట్లు వీలగును? అట్లు చేసిన నిర్ధారణ సమంజస మని యొప్పుకొనుట యెట్లు? బాదామిశాఖయందే కాక చాళుక్యకులమంతటియందును ఇమ్మడి పులకేశి గడు సుప్రసిద్ధుడు. పూర్వచాళుక్యు లేమి, కళ్యాణిచాళుక్యు లేమి, యన్యు లేమి తమ వంశచరిత్రయందతని ప్రస్తావన వచ్చినప్పుడు గడు గొప్పగ జెప్పుకొనియున్నారు. కొల్లిపారిశాసనకారు డితనినే పేర్కొన నుద్దేశించినచో నతని నామము నేనియు వలపెట్టక సర్వసామాన్యమైన మహారాజశబ్దమును ప్రయోగించుట చిత్రము గదా. ఇక (లాట) జయసింహుని విషయము విచారింతము. ఇతనివేమి, ఇతని సంతతివారివేమి శాసనములు కొన్ని ప్రకటితములై యున్నవి. ఇందు మొదట పేర్కొనదగినది త్రిభువనాశ్రయజయాశ్రయబిరుదాంకితుడగు నాగవర్ధన మహారాజుయొక్క నిర్పణతామ్రపటికలు. ఇతడు లాటజయసింహుని కుమారుడు. ఇందితడు తన తండ్రి

19. నాడోజపంప, పుటలు ౨౫-౨౬.

ధరాశ్రయజయసింహవర్మ యని చెప్పియున్నాడు[20]. రాజాదిత్యపృథువిక్రమబిరుద ముండినట్లు చెప్పలేదు. రెండవది క్రీ.శ. ౬౭౧ వ సంవత్సరమునాటి శ్రయాశ్రయశీలాదిత్యుని నౌసారితామ్రపట్టికలు. ఇతడును లాటజయసింహుని పుత్రుడే; మఱియు యువరాజు. నాగవర్ధనునివలె నితడును తన తండ్రి ధరాశ్రయజయసింహుడని చెప్పియున్నాడు. రాజాదిత్యపృథువిక్రమ యను బిరుదులమాట యెత్తలేదు[21]. ఇతనివే క్రీ.శ. ౬౯౨ నాటి సూరతుతామ్రపట్టికలు గలవు. ఇందును రాజాదిత్య-పృథువిక్రమప్రస్తావన గానరాదు. తన తండ్రిపేరు ధరాశ్రయజయసింహుడనియే చెప్పియున్నాడు[22]. మూడవది మంగళరసరాజునొక్క బల్సార్ తామ్రశాసనము. ఇతనికి వినయాదిత్య-యుద్ధమల్లుడనియు, జయాశ్రయుడనియు బిరుదులు గలవు. ఇతడు తాను మొదటి విక్రమాదిత్యుని తమ్ముడగు ధరాశ్రయజయసింహవర్మకుమారుడనని చెప్పుకొని యున్నాడు. క్రీ.శ. ౬౯౧-౨ వ సంవత్సరమున నితడు రాజ్యము సేయుచుండెను[23]. లేములవాడ వంశమునకు మూలపురుషుడని తిమ్మప్పయ్యగారు వాదించునతడితడే. తన తండ్రికి రాజాదిత్యపృథువిక్రమబిరుదు లున్నట్లితడును జెప్పలేదు. నాల్గవది పులకేశివల్లభుని నౌసారితామ్రపట్టిక. ఇతడు మొదటి విక్రమాదిత్యుని తమ్ముడగు జయసింహవర్మకు పుత్రుడు; పై శాసనమున జేర్కొన బడిన జయాశ్రయమంగళరసరాజునకు దమ్ముడు. ఇతడును తన తండ్రికి ధరాశ్రయబిరుదున్నట్లు చెప్పెనే కాని రాజాదిత్యపృథువిక్రమ బిరుదు లుండినట్లు చెప్పలేదు[24]. లాటచాళుక్యుల శాసనములయందెచ్చటను గానరాని రాజాదిత్యపృథువిక్రమబిరుదులు లాటచాళుక్యవంశమునకు మూలపురుషుడును, బాదామి చాళుక్యవంశజుడగు నిమ్మడి పులకేశికి గడగొట్టు కొడుకును, మొదటి విక్రమాదిత్యుని తమ్ముడును నగు ధరాశ్రయజయసింహునకుండెనని నమ్ముట యెట్లు? నిరాధారమైన యీ నమ్మకమును నూతగా గొని లేములవాడ చాళుక్యవంశజుడగు వినయాదిత్య-యుద్ధమల్లుని తండ్రియగు రాజాదిత్యపృథువిక్రముడే పై లాటజయసింహుడని యొప్పుకొనుట యెట్లు? విషయమును చక్కగా సమాలోచనము జేసి చూడగా లాటజయసింహునికి లేములవాడ చాళుక్యులతో నెట్టి సంబంధ ముండినట్లును దోచదు.

ఇక లాటజయసింహుని పుత్రుడగు జయాశ్రయ మంగళరసరాజ వినయాదిత్యయుద్ధమల్లుడును, లేములవాడ చాళుక్యవంశకర్తయగు వినయాదిత్యయుద్ధమల్లుడును నొక్కరుడు రేమో చూతము. ఇద్దఱికిని వినయాదిత్య యుద్ధమల్లనామములు సామాన్యములగుటచే వారిద్దఱు నొక్కరే యను తలపు కలుగవచ్చును. కాని యిది సాధ్యము గాదు. ఈ సందర్భమున మొదట చింతింపదగిన విషయ మొకటి కలదు. లాటవినయాదిత్యయుద్ధమల్లుని కది యంకితనామము గాదు, బిరుదు. అతని వాస్తవనామము మంగళరసరాజు; జయాశ్రయుడను మఱియొక బిరుదుగూడ కలదు. ఇక లేములవాడ వినయాదిత్యయుద్ధమల్లునికి మంగళరసరాజను పేరు గాని, జయాశ్రయుడని బిరుదుగాని యున్నట్లెందును జెప్పియుండలేదు. వినయాదిత్యయుద్ధమల్లనామము మిగుల రకు నుండుట వారి యైక్యమును సూచింపదా యను ప్రశ్న రావచ్చును. అన్యులకీ పేరు లేకుండిన దీని యాధారమున వారి కైక్యము గల్పించవచ్చును. యుద్ధమల్లుడని మొదటి విక్రమాదిత్యుని కుమారుడైన వినయాదిత్యునికి నామాంతర ముండినట్లు మిరజ్ దేవూరు శాసనములవల్ల దెలియుచున్నది[25]. అతడును వినయాదిత్య

---

20. ఇండి. ఆంటి. సం. ౯. పుట ౧౨౩ త.

21. ఎపి. ఇండి. సం ౮. పుట ౨౨౯ త.

22 ఇంటర్నేషనల్ కాంగ్రెస్ ఆఫ్ ది ఓరియంటలిస్ట్సు. (వియన్నా) ౧౮౮౬, ఆర్యన్ సెక్షన్. పుట. ౨౨౫.

23. బాం. బ్రాం. జే. ఆర్. ఏ. ఎస్. సం. ౧౬. పుట ౫.

24 ఇంటర్నేషనల్ కాంగ్రెస్ ఆఫ్ ది ఓరియంటలిస్ట్సు (వియన్నా), ౧౮౮౬, ఆర్యన్ సెక్షన్ పు. ౨౩౨ త.

25. ఇండి. ఆంటి. సం. ౮. పుట ౧౨౮.

'తస్సుతో విక్రమాదిత్యో విక్రమాక్రాన్తభూతలః,
తతోపి యుద్ధమల్లాఖ్యో యుద్ధేయమసమో నృపః'

యుద్ధమల్లుఁడే యగును. కావున వినయాదిత్యయుద్ధమల్లనాఁడుము వేములవాడచాళుక్యుల మూలపురుషునికిని, లాటజయసింహుని పుత్రుఁడగు మంగళరసరాజానకును సామాన్య మగునంతమాత్రమున వారికి వ్యక్త్యైక్యము గల్పించుట సమంజసము గాదు.

మఱియొక విషయము : వేములవాడ చాళుక్య వంశకర్తయగు వినయాదిత్యయుద్ధమల్లుఁడు క్రీ. శ. ఎనిమిదవ శతాబ్దతృతీయపాదమున వెలసె నని దృఢముగఁ జెప్పవచ్చును. ఇతని పుత్రుఁడగు మొదటి యరికేసరి క్రీ. శ. ౭౮౦-౭౯౧ ల మధ్యమున రాజ్యముజేసిన రాష్ట్రకూటచక్రవర్తియగు నిరుపమధ్రువకలివల్లభునికి సమకాలీనుఁడు. ఇతని తండ్రియగు వినయాదిత్యయుద్ధమల్లుఁడు నిరుపమధ్రువుని తండ్రియగు మొదటి కృష్ణ అకాలవర్షుని కాలముననో, తత్పూర్వము క్రీ. శ. ౭౫౪ నుండి ౭౫౬ వఱకు రాజ్యముజేసిన దంతిదుర్గుని కాలముననో, లేక యిరువురి కాలముననో వెలసియుండవలయును. ధారాశ్రయుని కుమారుఁడగు వినయాదిత్యయుద్ధమల్లాపరనామధేయుఁడు క్రీ. శ. ౭౩౧-౨ లో రాజ్యము సేయుచుండినందువల్లను, దరువాత నిరువదియైదేండ్ల వెనుక రాష్ట్రకూటులక్రింద సామంతుఁడై యుండిన వేములవాడ వినయాదిత్యయుద్ధమల్లుఁడును సమకాలీనులై యుండి రనుట యసంగతము గాదు. సమకాలీను లనుటచే చాళుక్యవంశజులగు వా రిరువురికి నైక్యము గల్పించుటయందు వైపరీత్య మేమియు లేదు; కాని దీని కొక యాక్షేపము గలదు. వినయాదిత్యయుద్ధమల్ల బిరుదాంకితుఁడగు జయాశ్రయ మంగళరసరాజురాజ్యము క్రీ.శ. ౭౩౧-౨ తరువాత నచిరకాలముననే ముగిసిపోయినది. పిమ్మట నతని తమ్ముఁడు పులకేశివల్లభుఁడు రాజ్యమునకు వచ్చెను. ఈ విషయము క్రీ.శ. ౭౩౯ నాటి ఇతని నౌసారిపట్టికల వల్ల దెల్లమగుచున్నది. ఇందు వరుసగ దన పూర్వీకులగు మొదటి కీర్తివర్మ, రెండవ పులకేశి, మొదటి విక్రమాదిత్యుఁడు, ధరాశ్రయజయసింహుఁడు, జయాశ్రయమంగళరసరాజు మున్నగువారిని బేర్కొని తరువాత దన్నుఁ జెప్పుకొనియున్నాఁడు. ఇతఁడు బహుశూరుఁడు. సైంధవ, కచ్ఛెల్ల, సౌరాష్ట్ర, చావోటక, మౌర్య, గుజ్జరాజులను జయించిన తాజికుల నోడించి దేశమును గాపాడెను. వల్లభనరేంద్రుఁడు, అనగా నప్పుడు సామ్రాజ్యాధిపతియై యుండిన బాదామిచాళుక్యఇమ్మడివిక్రమాదిత్య డితని దేశసేవకు మెచ్చి దక్షిణాపథసాధక, చలుకికులాలంకార, పృథివీవల్లభ, అనివర్తకనివర్తయిత్రి యను బిరుదుల నొసగెను. మఱియు నితఁడు రాజ్యాధిపతులను బోలి తన యాజ్ఞను విషయపతులు మున్నగువారికి విదితపఱచియున్నాఁడు మఱియు నీ శాసనమున జయాశ్రయమంగళరసుని జెప్పి యటుపిమ్మట 'తత్పాదానుధ్యాత' యగు పులకేశి పేర్కొనబడెనని స్మరణ యందున్నది. కావున క్రీ. శ. ౭౩౯ వ సంవత్సరమునకు పూర్వ మితని యన్నయగు జయాశ్రయమంగళరసరాజ వినయాదిత్యయుద్ధమల్లుఁడు గతించగా నితఁడు తదనంతరము లాటరాజ్యమున కధిపతి యాయె ననుట తెల్లము. కావున క్రీ. శ. ౭౫౪ నకు తరువాత రాష్ట్రకూటుల క్రింద సామంతుఁడై యుండె ననుట యుక్తముగాదు. ఈ కారణములచేత దిమ్మప్పయ్యగారు వాదించునట్లు లాటజయసింహవర్మపుత్రుఁడగు జయాశ్రయ మంగళరసరాజ వినయాదిత్యయుద్ధమల్లుఁడును, వేములవాడచాళుక్యుల మూలపురుషుఁడగు వినయాదిత్యయుద్ధమల్లుఁడును నేకపురుషులు గారు. వారు భిన్నవ్యక్తు లనుట యొప్పును.

ఈ పై దీర్ఘచర్చవలన తేలిన సారాంశ మేమనగా: కొల్లిపఱశాసనమందలి వంశావళిని గుర్తించుటకు సాధ్యము గాదు. ఇతరచాళుక్యశాఖలకు దీనితో సంబంధము గానరాదు. ఒకవేళ నిది కల్పనయేని గావచ్చును. బాదామిశాఖతోడను, లాటశాఖతోడను దీనికి సంబంధములను గలుప దలపెట్టి చేసిన సిద్ధాంతములు లభ్యమైన శాసనసాక్ష్యములకు విరుద్ధము లగుటచే నిలువజాలవు. కావున లభ్యమైన సాక్ష్యమును నిష్పక్షపాతముగ విమర్శించి చూచిన వేములవాడశాఖవారి కన్యశాఖలవారితో గల సంబంధము తెలియదని చెప్పవలసియున్నది. (సశేషము)

# పట్టు చొక్కా

[కథానిక]

●

## శ్రీ క్రొవ్విడి లక్ష్మన్న

వారంరోజులయి ప్రయత్నం ఎగ్జిబిషను చూద్దాం అని. ఎంతో యిదిగా చెప్పుకుంటున్నారు ఊళ్ళో మహా గొప్ప ప్రదర్శనం అనీ, ఆ అపురూపపు వస్తువులతో కళ్లు మణిగిపోతున్నాయనీని. ఆవేళ తప్పకుండా వెళ్ళితీరా లనుకున్నాను.

ఆరూ కొట్టేగు. వేడిగాడుపు వీస్తున్నా, సాయంత్రపు నీరెండ ఆహ్వానిస్తూనే ఉంది. కాంపౌండులో చెట్లూ చేమలూ స్వర్ణాభను ధరించి, త్వరగా శెలవర్ణాన్ని పైకొంటున్నాయి. గిలకనూతిదగ్గర అరటిపిలకలకి నీళ్లు పోస్తూన్న మాలీ మరో రెండు బాల్చీలు తోడి చపటామీద పెట్టేడు నాకోస మని.

స్నానం అయింది. పట్టు లాల్చీ, సన్నధోవతీ యిచ్చేడు నౌకరు.

వాకిట్లో పిలుపు. జానకమ్మగారి యింటినుంచి మళ్ళీ కబురు వొచ్చింది.

"వస్తున్నానోయ్, తమ్ముడూ."

"జ్వరం చాలా తీవ్రంగా ఉందండి. రాత్రి నుంచీ కన్ను పొడుచుకున్నా కునుకు పట్టలేదు అక్కయ్యకి. పరధ్యానపుమాటలు కూడాను."

"ఎలాగ చెప్పను, నాయనా, టైఫాయిడు లక్షణమే అది"

"ఏమిటోనండి. మీ రొకమాటు వచ్చి చూస్తే మాకు ధైర్యంగా వుంటుంది."

"ఊఁ, పద. ఈ హేండ్ బేగు కారులో పెట్టు."

పట్టుమని పావుగంటఅయినా శాంతంగా ఉండనివ్వరు యింటిదగ్గర. ఏ టౌనుహాలుకో పోతే అక్కడా తయారవుతారు. ఇంకో పేషంటుని చూడ్డానికి వెళ్ళమంటే, ఆ యింటిముందూ వీళ్ళే పికెటింగు! తీరా వెళ్ళి చూస్తే అంతా పైవాళ్ళ పడే కంగారే. పేషెంటు నిక్షేపంలాగ ఉంటాడు. పరిస్థితి ఏమాత్రం విషమంగా ఉన్నా డాక్టరు ఆ మంచం వదిలివెళతాడా? ఇంకాయిదిగా ఉంటే యింకో డాక్టర్ని తనే పిలుచుకు రాడూ కన్సల్టేషనుకి? ఈ ముక్కలు వాళ్ళకి తోచవు. ఏ ఉద్యోగస్థునికయినా పనివేళా, తీరుబాటూ అంటూ వుంటాయిగాని డాక్టరుకు మాత్రం ఉండవు.

*　　*　　*

ఎగ్జిబిషను చేరుకునేసరికి ఎనిమిది కొట్టేగు. వసంతోత్సవం మూర్తీభవించినట్టుంది ఆవరణ. ఏమి జనసమ్మర్దం! చూసినకొద్దీ యింకా చూడాలనీ, బయటికి రాగానే అప్పుడే వచ్చేసేమా అనీ అనిపిస్తున్నాయి ఆ అంగళ్ళలో వస్తువులు. ఎంత నాజూకు! ఏమి పనివాడితనం!! ఎంతటి నైపుణ్యం!!! జేబులో ద్రవ్యానికి పరిమితి అంటూ ఉండబట్టి కొనడానికికూడా అంకు ఒకటి ఏర్పడుతోంది గాని, లేకపోతేనా! అనాకర్షణీయమయిన వస్తువేదీ అక్కడ? చూస్తూన్నకొద్దీ యినుమడిస్తూన్న కళాతృష్ణతో ఒక్కొక్క 'స్టాలే' చూసుకుంటూ కాశ్మీరశాలువల దుకాణంలో ప్రవేశించేను.

శ్రీనగరంలో నేత్రపర్వంగా చూసేనాయిరి ఆ నేతగాళ్ళ హస్తనైపుణ్యం.

చుట్టూ కాకరపువ్వు అంచూ, నాలుగు మూలలా మామిడిపిందెలూ ఉన్న, పాలమీగడలాంటి శాలువ ఒకటి పరీక్షిస్తున్నాను. ప్రక్కనే ఎవరో గొంతుక సవరించుకుంటున్నారు. చిన్నగా దగ్గి—

"ఈ లతలఅంచు ఎంత చమత్కారంగా చిత్రించేరో చిత్తగించేరూ!" అన్నా డాయన.

"శేషగ్గానే వుంది. కాని, నాకు కాకరపువ్వు అంచు అంటే కొంచెం ప్రీతిలెండి" అన్నాను.

"అలాగే. 'లోకో భిన్నరుచిః'. కాని, చిత్తగించేరూ, యీ లతలో పువ్వులూ, మొగ్గలూ అవీ వున్నచోట ఆయా రంగులకి అనుగుణంగా ముచ్చిపనీ..."

"చిత్తం చిత్తం. ఆ చిత్రం ఊహించడానికీ, రంగుల యెన్నికకీ ప్రత్యేకించి ఉంటారు ఆరితేరిన మనుష్యులు."

"ఆ ఊహాచిత్రపుప్రతిభ రసవత్తరంగా బట్టమీద ప్రస్ఫుటీకరించే కుట్టుపనివాళ్లుకూడా..."

"శిల్పనైపుణ్యంలో ఏమాత్రమూ తీసిపోరు. కళా చాతురీ కాదటండీ"

"అసలు కాశ్మీరదేశమే ఓ కళానిలయం"

"తమరూ పర్యటించే రన్నమాట."

ఇంక బాతాఖానీలో పడ్డాం. ఆ దేశ సౌందర్యం, అప్పటివారి జీవితవిధానాలు, ఆ కళారాధన, అక్కడి స్త్రీపురుషుల అందచందాలు...అబ్బో, ఆయనా ఆసేతుశీతనగపర్యంతం తిరిగినవాడే! మాటలాడుకుంటూనే ప్రదర్శనంగేటు దాటేం. మాయింటికి ఆహ్వానించేను. ఫలానావీథిలో తనకు పని ఉన్నదనీ, అందాకా దిగబెడితే సంతోషిస్తాననీ అన్నాడు. స్విచ్ వేసి, ఛోక్ లాగి, ఏక్సిలరేటరు కొద్దిగా నొక్కేను. హేండిలు త్రిప్పి వచ్చి నా ప్రక్కనే అధిష్ఠించేడు ఆయన. పది గజాలు సాగింది కారు.

"తమరు అన్యథా భావించరు కదా పంతులుగారూ, ఓ చిన్నవిషయం మనవిచేస్తాను"—ఆయనే ఆరంభించేడు.

"సెలవివ్వండి"

"అహాఁ, మరేమీ లేదు...ఆ లాల్చీ...మీరు తొడుక్కున్నదీ...మీది కాదేమో ననీ..." అర్థోక్తిలో వదిలేసేడు.

ఆశ్చర్యంతో నిలువునా స్తంభించిపోయేనంటే నమ్మండి. నిజమే, నాది కాదది. కాని, నాకు సరిగ్గా సరిపోయింది. కాగా, నాదానికన్నా కొత్త కొత్తదీని. రెండూ పట్టుచొక్కాలే. యీయనకి ఎలాగ తెలిసింది చెప్మా?

"తమరు నేషనల్ లాండ్రీలోనే యిస్తూ ఉంటారా బట్టలూ?" మళ్ళీ అడిగేడు ఆయన.

"చిత్తం చిత్తం. నా చొక్కా మారుగిళ్ళయింది లెండి. యిదిగానీ తమదా ఏమిటి?" అన్నాను కంగారుగా.

"అబ్బే. నాది కాదు లెండి. మీదికూడా కాదని తెలిసీ..."

"జానాను. అసలు యిచ్చేద్దామనే అనుకున్నాను, కాని మడతలు విప్పి తొడుక్కున్నదాకా అది నాది కాదని తెలియలేదు. తీరా తొడుక్కున్నాక ఊహూ, ఎలాగా తొడుక్కున్నాంకదా, రేపు యిచ్చీవొచ్చును అని అనుకున్నాను—మరి" అన్నాను క్షంతవ్యుణ్ణి అని వ్యంగ్యంగా తోచేటట్టు.

"దానికేం లెండి. మీ చొక్కామాత్రం లాండ్రీలోనే ఉంది అని చెప్పొచ్చేను. దానిమీద మీ పేరు పొడిఅక్షరాలు 'వ. సు.' అనికూడా ఉన్నాయి. దీనిమీద ఉన్న అక్షరాలు 'క. సో.' కదూ?"

అయ్యో, వీడి అసాధ్యం గూలా! సి. ఐ. డీ. కన్నా దారుణం అయిపోతేనూ!

౨

వీథిమలుపులో కారు ఆపమన్నాడు. ఆ యిల్లు తనదే నట. అభ్యంతరం లేకపోతేలోపలికి రమ్మన్నాడు. ముద్దుగా చిన్న యిల్లు—బొమ్మరిల్లులాగ. వీథివీథికి పైగా పది పదిహేనుగజాల ఆవరణ, చిన్న గేటూను. బండీగూడులాగ వంచి కట్టిన వెదురుబద్దలపైకి దట్టంగా అల్లుకు పాకిన 'నైట్‌క్వీన్' గుమ్ముమని కమ్మని వాసనలు వెదజిమ్ముతోంది. ఆవరణకి నాలుగు మూలలా నాలుగు చంద్రకాంతమొక్కలున్నాయి. మధ్యని వర్తులంగా పదిలపరిచిన మట్టిపళ్లెరంలో ఒక్కటే ఒక్క గులాబీచెట్టు, చిగురుకొమ్మని రెండు విచ్చీవిచ్చని మొగ్గలతో పిల్లగాలికి తల ఊపుతోందో, యజమాని మనస్సు కనిపెట్టి నన్ను ఆహ్వానిస్తోందో తెలియడం

లేదు. జాగ్గెట్టుచీరమీద నగిషీపనిలాగ తోచింది వెండి వెన్నెలలో ఆ దృశ్యం.

అతని కళాదృష్టికీ, ఆ అలంకారాలకీ ముగ్ధుణ్ణి అవుతూ లోపల అడుగుపెట్టేసరికి కళ్ళు చెదిరిపోయినా యంటే నమ్మండి. ఎదురుగా గోడకి ఓ పులి చర్మం వేలాడగట్టిఉంది, తోక సరంబీని అంటు తూను. ముందరికాళ్ళు రెండూ యిటూ అటూ చాచి ఉన్నాయి, పంజాలు విప్పి. భీకరంగా కనపడేటట్టు తల ఒక చిన్న మేజాఆధారంగా నిలబెట్టబడి ఉంది. ఆ పోజులో పులి గోడమీద నుంచి దుముకుతోందా అనిపిస్తోంది. ఆ పులిచర్మానికి యిరుప్రక్కలా రెండు నిలువుటద్దాలు. గదిని ఆవరించుకుని నీలిరంగుజంబుఖానా పరిచిఉంది. దాని మధ్యస్థంగా నగిషీ చేసిన సింహపుకోళ్ళ ఆగ్రాబల్ల, చుట్టూ మెత్తని సోఫాసెట్టూను. రెండే రెండు రవివర్మ చిత్రాలు ఆ గోడనీ యీ గోడనీ జీ కళలు ఉట్టిపడుతున్నాయి. సోఫాలో కూర్చుని తన్మయత్వంతో చూస్తున్నాను.

ఆయన తెర తొలిగించి ప్రక్కగదిలోకి వెళ్లేడు. స్విచ్ వేసిన వెలుతురులో ఓ పందిరిమంచం, దాని ప్రక్కని చిన్న మేజామీద 'నగ్నసుందరి' చేతిలో టేబిలులైటూ కనిపించేయి. మంచానికి యివతలిప్రక్క గోడ నానుకుని మార్బులుపలకమేజా ఒకటి అందాలు ఒలుకుతోంది. దాని చివరి అంచునే మూడు రేకలుగా విడిన అద్దం అమర్చి వుంది. వెండితొడితో ఉన్న దంతపు దువ్వెనలు రెండూ, చక్కటి పౌడరుడబ్బీ, స్నోసీసా, గిల్టువేసిన పన్నీరుబుడ్డీ వున్నాయి దానిమీద. నీలి రంగు దీపకాంతి అందంగా వున్నగదిని శోభావంతంగా కనబరుస్తోంది. ఇతోధికం అవుతూన్న కుతూహల అహ్లాదాలతో నాకలోకానికి కాస్త దూరంలో ఉన్నాను.

ఇంతలో చంటిపిల్లడు గగ్గోలు! ఆ ఏడుపుకి యిల్లు మారుమ్రోగిపోతోంది. ఇల్లు అంతా అంత శుభ్రంగా ఉండబట్టిగాని లేకపోతే ఏ తేలో, జెర్రో అంటబొడిచింది అనుకునేవాణ్ణే.

లోపలినుంచి ఆయనభార్యకాబోలు, చదువుతూన్న పత్రికతోనే పరుగెత్తుకు వచ్చి నన్ను చూసి గుమ్మంలోనే ఆగిపోయింది. ఆయన పిల్లణ్ణి ఎత్తుకున్నాడు. ఎంత సముదాయించినా ఊరుకోవడం లేదు పిల్లాడు. కళ్ళు నులుముకుంటూ మరీ యిదిగా ఏడుస్తున్నాడు.

"బేబీ, బేబీ" అంటూ నాచేతుల్లోకి తీసుకున్నాను.

"చప్పికి చేతిమీద పెట్టిన జింక్ ఆయింటుమెంటు కళ్ళలోకి వెళ్ళింది గాబోలు. పెద్ద ప్రమాదం ఏమీ లేదుకాని, మంట భరించడం కష్టంగాదూ? ఇలాంటివి పెట్టినప్పుడు ఎవరైనా దగ్గిర వుండి చూడాలి మరి" అన్నాను.

"ఇంతసేపూ వాడితోనే ఉన్నాను. 'అలా పాకురుకుని వెళుతూఉంటే తండ్రిదగ్గిరికి పోతున్నాడు గదా అని పత్రిక పుచ్చుకున్నాను, మరి. అయినా, నిమిషంలో చేస్తాడు ఏవో చిలిపిపధవపనులు!" ఆవిడ అన్న ఆ మాటల్లో వాత్సల్యం, ఆవేదనాకూడా కనబడ్డాయి.

"కొంచెం గోరువెచ్చని నీళ్ళు తెప్పించండి. గుడ్డ ముంచి తుడిస్తే మంట తగ్గుతుంది."

పదినిమిషాల్లో పిల్లడు మళ్ళీ బంతిలాగ ఆడుకుంటున్నాడు.

"అమ్మయ్య! నిమిషంలో వూరుకున్నాడు. ఎంతలో కనిపెట్టేరూ?" అన్నాడాయన, కృతజ్ఞత వ్యక్తపరుస్తూ.

"దానికేం లెండి. నా వృత్తే యిది" అన్నాను.

"ఇంకా నయం, మీరు ఉండబట్టి సరిపోయింది కాని, లేకపోతే కడుపు పొంగిపోను చంటివెధవకి" అంది ఆమె—నేను ఏదో మహోపకారం చేసినట్టూ, లేకపోతే పిల్లడు యింక వారికి దక్కనట్టూను.

"పోనీ లెండి, యిప్పుడు మళ్ళీ మామూలుగా ఆడుకుంటున్నాడుగా"

"ఇలాంటివి జరుగుతాయనే దాసీదాన్ని పెట్టేను, ప్రత్యేకించి వాడికోసమని. ఉండి చస్తేనా

ఒక్కర్తె అయినాను! ఈ ఊరికి వచ్చిన యీ సెల్లాళ్ళలోనూ ముగ్గురు పనిమనుషులయినా మారేరు. ఒక్కతయినా పట్టుమని పదిరోజులు ఉన్నపాపాన్ని పోలేదు. ఇళ్లకి వెళ్లేటప్పుడు పదిమందీ కట్టగట్టుకుని తగులబడుతారారాయె, ఊళ్లో భోగట్టాలు ఉపన్యాసాలు అఘోరిస్తూను."

ఆమెకళ్లు చెమ్మగిలడం దీపపుకాంతిలో స్పష్టంగా కనిపించింది. ఆమెహృదయంలో ఏదో చెప్పలేని చికాకు!

## 3

మర్నాడు ప్రొద్దున్నే ఆ చొక్కా పట్టుకుని నేషనల్ లాండ్రీకి వెళ్ళేను. అది తీసుకుని నా లాల్చీ యిచ్చేసేడు, మామూలుగా బల్లదగ్గర కూర్చునే ముసలాడు. ఎవరి నోటా పల్లెత్తు అనవసరప్రసంగం లేకుండా పని జరిగిపోయింది.

ఆ వెంకట్రావుగారూ యిక్కడికే వస్తూ ఉంటానన్నాడుగా. ఆయనపేరు తలుచుకుంటే నిన్నటి సంగతి జ్ఞాపకం వచ్చి గుండె జల్లుమంది. ఎంతసున్నితంగా వ్యవహరించేడూ! మొహమొటానికి కాదన్నా ఆ చొక్కా తనదే అయివుంటుంది. ఔను, తను మనిషి, యీమాత్రపు మహద్భాగ్యానికి వెలితిబడిపోతాడా? అసలు అది ఏ పుట్టినరోజు 'ప్రెజెంటో' అయిఉంటుంది. వస్తువుమీది ఆ వ్యామోహంలోనే తెలియడంలేదూ అతనికీ, దానికీ ఉన్న ఆంతర్యం!

ఏదో ఘరానాఉద్యోగస్థుడే అయివుంటాడు. లేకపోతే ఆ నాజూకూ, ఆ మాటసరసతా అలవడుతుందా?

సందర్భం తరచిచూస్తున్నకొద్దీ ఆయన అంటే అమితమయిన ఆదరభావం ఏర్పడింది. ఇంకా ఇంకా యెన్నో విషయాలు కళకీ, నాగరికతకీ సంబంధించినవి ముచ్చటించాలనిపించింది. లాండ్రీదగ్గిర ఎవరైనా ఉన్నారు గాని ఆయన కనిపించలేదు. ఇంతకూ, ఆయన వచ్చేడో లేదో యివాళ.

అడిగేసేను, యెందుకీ సందుకొమ్ముల అనుమానం అని—

"వెంకట్రావుగారు యివాళ వచ్చేరుటయ్యా?"

బల్లదగ్గర ఉన్న ముసలాడు రెండు నిమిషాలు నన్ను ఎగాదిగా పరీక్షగా చూసేడు.

"వెంకట్రావుగారు వచ్చేరా అని అడిగితే అలా చూస్తావేమిటి, సర్కస్సు జంతువుని చూసినట్టు?"

"ఆ. లోపల ఆగదిలో వున్నాడు; వెళ్ళండి" అన్నాడు ముసలాడు.

ఏకవచనప్రయోగం! మాటలో నిరాదరణ! 'ఎద్దుకేమి తెలుసును అటుకుల రుచి!' అనుకున్నాను.

ఆ గదిలో ఓమూల మాసినబట్టలు గుట్టగా పడి ఉన్నాయి. నలుగురు చాకలివాళ్ళు వాటిని చిన్న చిన్న మూటలుగా, నంబరువారీగా విడబరుస్తున్నారు. ఇంకోవార, గోడచేర్పుగా సన్నని, పొడుగాటి బల్లమీద యిస్త్రీబట్టలు పడిఉన్నాయి దొంతరదొంతరలుగాను. వాడ్రోబులో కొయ్యలకి వేలాడదీసి కొన్ని కోట్లు, 'బుష్షర్టు'లూ వున్నాయి కాగితంమడతల్లాగ యిస్త్రీచేసి. వీటి కన్నిటికీ రసీదులు ఏర్పరచి, బిల్లునంబర్ల ప్రకారం సబ్బుకాగితాల్లో పేకింగు చేస్తున్నారు ఓ కొంతమంది. ఈ జట్టుని కాస్తూ, వాళ్లల్లా కళ్ళు చేసుకుని చూస్తూ కార్యనిమగ్నుడయి ఉన్నాడు వెంకట్రావుగారు, చేతుల్లేని బనీను వేసుకొని, తెల్లని గూడకట్టుకట్టుకుని. నా కళ్ళు నేనే నమ్మలేకపోయేను.

నన్ను చూడ్డంతోటే నమస్కరించి ఆసనం చూపించేడు. వేషం మారిందికాని, ఆ సంస్కృతీ, ఆ నాజూకూ ఉట్టిపడుతూనే వున్నాయి అతను ఆడుతూన్న ప్రతీమాటలోనూ. వెంకట్రావుగారే!

గ్రహించేను.

ఆయనకి రజకవృత్తి కులవిద్య. అయినప్పటికీ శాస్త్రదౌర్లక్షణశుద్ధి అవడంవల్ల నెమ్మదిగా స్థూలు ఫైనలు ప్యాసయే వనిపించుకున్నాడు. యుద్ధంమూలాన్ని రాజకీయాలతో ఎక్కువగా పరిచయం కలిగింది. నలభైరెండులో జరిగిన ఆ సంఘటనలు ఏ హిందూయువకుని రక్తనాళాల్లోకి చొచ్చుకుపోలేదు! ఏ భారతీయుని హృదయాన్ని ఉత్తేజితం చెయ్యలేకపోయినాయి!!

సమయం మించిపోకుండా యుద్ధంలో చేరేడు వెంకట్రావు. దేశదేశాలు పర్యటించడంతో విజ్ఞానం, సంస్కృతీ అతనిలో ఇతోధికం అయినాయి. పరాయి దేశాల్లో తన కులవిద్య ఎలా నడిపించేదీ చూసి తెలుసుకున్నాడు. ప్రవర్తనాసౌశీల్యం జీవికి నికషోపలం అని పాఠం చెప్పుకున్నాడు. "నేషనల్ లాండ్రీలో దొంగలు పడ్డా బట్టలు మాత్రం పోవు" అని లోకులు చెప్పుకునేటట్టు మెలిగేడు.

సంస్కృతి గల జీవికి జీవితం తెరచాప ఎత్తిన పడవలాగ సాగిపోతుంది అంటారు. నిజమే. అతని ఆర్జనకి లోటులేదు. ఆర్జన ఎక్కువ అవుతూన్న కొద్దీ అతనికి ఒక అంతస్తు ఏర్పడుతూ వచ్చింది.

తన కళోపాసన తన్మాత్మగుర్యాన్ని అతిశయింప జేసింది.

అయితేనేం? పున్నమవెన్నెల్లోనే అమావాస్య చీకట్లు గోచరిస్తూఉంటాయి. సౌఖ్యవారాశితరంగాల లోనే తుపాను చెలరేగుతూ ఉంటుంది. వెంకట్రావు గారికీ ఓ కొరత! ఎన్ని విధాల యత్నిస్తూన్నా అది తీరడంలేదు. అనేకవిధాల యత్నించేడు. పలువిధ మార్గాలు త్రొక్కి చూచేడు. లాభం లేకపోయింది. నాడా అర్ధాంగి అడిగినప్పుడు 'ఆఁ! యిదేనా మహద్భాగ్యం' అన్నాడు ఎంతో తేలికగాను. బూరుగు దూదికన్నా తేలిక అనుకున్నది భూమికన్నా బరువైనట్టు తోస్తున్నది పరిస్థితులు చూస్తూన్నకొద్దీని.

తను ఎంత చదువుకుంటేనేం? ఆమె ఎంతటి సుగుణసంపత్తి కలదయితేనేం? వారికి ఉన్న డబ్బువల్ల మాత్రం ఏం పని జరిగింది?

కొన్నికొన్ని విషయాల్లో సంఘం "తాబట్టిన కుందేటికి మూడే కాళ్ళ"ని కూర్చుంటుంది. వెంకట్రావు గారు పిల్లలని ఆడించడానికి పనిమనిషిని కుదర్చలేక పోయారు. చాకలివాళ్ళ యిళ్ళల్లో కాపువాళ్ళు పని చెయ్యరు నిలువెత్తు ధనం పోసినానూ! కులం తక్కువట.

అందుకా, నిన్న ఆమె కంట నీరు పెట్టుకుంది. నిజమే. పనిమనుష్యులు పదిమందీ కట్టుకట్టుకునే యిళ్ళకి పోతారు. ఊళ్ళో భోగట్టాలు ప్రాకిపోవడానికి వాళ్ళకి మించిన 'గెజెటు' లేదు. "ఏ మనిషీ పట్టుమని పదిరోజులయినా ఉండలేదు" అంటే ఆశ్చర్యం ఏముందీ? ఆమె ఎంత చిన్నబుచ్చుకుంటోందో!

"నేను చూస్తానులెండి" అని యింటికి వచ్చేసేను, దారిలో నర్సింగు హోముదగ్గిర ఓ పావుగంట ఆగి.

* * * *

కిరస్తానపుదాదిని ఒకర్తెని వాళ్ళ యింటికి పంపినట్టు నర్సింగుహోముడాక్టరు మర్నాడే నాకు ఫోనులో చెప్పేడు.



# పరిణామరీతి

## శ్రీ కోసూరి శ్రీహరిరావు

ఆధునికశాస్త్రదృష్ట్యా మనము ఏ విషయాన్ని విమర్శించవలసివచ్చినా పరిణామవాదాన్ని పట్టుకొని రాకుండా ఉండలేము. ఈ నవీనభావనాపద్ధతిలో పరిణామవాదము ఒక విశిష్టమైన స్థానం సంపాదించుకొంది. లోకంలో సంభవమయ్యే యథార్థవిషయాల్ని సమగ్రంగా గ్రహించవలసి వచ్చినప్పుడెల్లా, ఆయా సందర్భంలోని పరిణామగతి ఎట్లా ఉందో, ఆ గతి వలని ప్రయోజనం ఏమిటో వ్యాఖ్యానించుకోవలసి వస్తూ ఉంటుంది. యథార్థవిషయాల్ని సహేతుకంగా అవగాహన చేసికొనేందుకై మన మీ రీతిగా పరిణామ సూత్రాన్ని తెస్తూ ఉంటాము. కాని సహేతుకావగాహనకూ, విషయవివరణకూ చాలా భేదం ఉంది. అందుచేత యథార్థవిషయాలను హేతుపూర్వకముగా నిర్ణయించి, వాని స్వభావవివరణను మఱచిపోరాదు. అప్పుడే మన పరిణామవాదము యుక్తంగా అన్వయిస్తుంది.

లాయడ్ మోరన్ చెప్పినట్లు క్లుప్తంగా చెప్పాల్సివస్తే, నిన్నటి జీవకోటిలోనుంచి నేటి జీవకోటి సంభవిస్తుంది. నేటి జీవకోటినుండి రేపటి జీవకోటి ఆవిర్భవిస్తుంది. ఇంకో తత్త్వశాస్త్రజ్ఞుడు "లోకంలో ఉండే సర్వసూత్రాలు మనకు కనుపించే సులభతమరూపస్థితులనుండి సంకీర్ణతమరూపస్థితులకు మారే సూత్రమే పరిణామ మన్నాడు. అవ్యక్తంనుండి ఆవిర్భవించే వ్యక్తలోకమే పరిణామగతిని రుజువు చేస్తుంది. ఆ లోకంలో ప్రవర్ధిల్లే సర్వజీవక్రమమూ ఈ పరిణామసూత్రానికి లోబడే నడుస్తూఉంటుంది." ఈ పై నిర్వచనాలు ఆధారంగా తీసికొని చూస్తే విశ్వస్థితికి వ్యాఖ్యానం చేయటంలో, ఇది ఎట్లా సంభవించిం దనే ప్రశ్నకుమాత్రమే సమాధానం వస్తుంది కాని, ఎందు కిట్లా సంభవించాలి? అనే ప్రశ్నకు సమాధానం ఎంతమాత్రం కుదురదు. అయినా సృష్టిలో ఈ అనుగమ్యరీతిని సందర్శించి, డార్విన్, వాలెస్ అను శాస్త్రజ్ఞులు జీవశాస్త్రానికి అన్వయించారు కాని హెర్బర్టు స్పెన్సరు ఈపరిణామసూత్రాన్ని సర్వశాస్త్రాలకు వర్తింపజేసి, ఒక ఉన్నతస్థాయికి తెచ్చాడు. డార్విన్, వాలెస్ అను శాస్త్రజ్ఞుల వివరణలో ప్రకృతివిషయాల గమనము కేవలము వర్ణితమైందే కాని, ఆ గమనానికి ప్రయోజనంకాని, అంతర్యంగాని ప్రస్తావితం కావటంలేదు. "ప్రకృతిలోని రీతిని గుఱించిన పూర్వవాదం నేటి ప్రాకృతికసంగ్రహణసిద్ధాంతం (Natural Selection) బయల్పడినప్పటినుండీ నిలువటంలేదు. జీవస్థితులలో తటస్థించే మార్పుకు ఉద్దేశం ఏమీ కనుపడదు. గాలి వీస్తుందంటే ఏమి ఉద్దేశం ఉంటుం దానికి అంతే" అని డార్విన్ ఒకచోట వివరించాడు. ఇంకా "సృష్టిలో ఏ కొంచెపు పరివర్తనమైనా అది జీవసంఘర్షణలో నెగ్గుటకు ప్రయత్నించు ప్రతిజీవికి ఉపకరించితీరుతుం"దని కూడా డార్విన్ ఇంకోచోట అన్నాడు. డార్విన్‌దృష్టిలో పరిణామోద్దేశం అనేది కేవలం మన భావంచేత సృష్టింపబడిందేనని, ప్రకృతిలోని జీవచైతన్యమే, అందును ప్రాకృతికసంగ్రహణమే (Natural Selection) సత్యమని తేలుతుంది. డార్విన్ తెల్పిన ప్రకృతిసంబంధమైన ఈ జీవచైతన్యంలో జ్ఞానం మృగ్యము. కాని వాలెస్ మరియొకచో "సమర్థత గలిగినదానికే ఉనికి" అనునదే యథార్థమనియు, ప్రకృతిలోని ఎన్నిక (Natural Selection) జరుగు ననుట కేవలం అతిశయోక్తి అనియు చెప్పియున్నాడు. "సమర్థత గలిగినదానికే ఉనికి"అనే సూత్రాన్ని మొదట వాడుకలోనికి తెచ్చింది హెర్బర్టు స్పెన్సర్. కాని ఈ సూత్రానికీ, డార్విన్‌వాదానికీ ఏమాత్రం అతకదు. డార్విన్ సిద్ధాంతరీత్యా జీవచలనశక్తియున్నా, దాని పరిసరమున్నూ పరస్పరం కేవలం బాహ్యసంబంధంమీదనే ఆధారపడి నడుస్తూఉంటాయి. కాని జీవచలనశక్తి, పరిసరము వీనిలోని క్రమానుగతమగు మార్పులకు జరిగే సంఘర్షణమే కొంచె మించుమించుగా జీవపరిణామమునకు దృఢస్థిరత్వమును సిద్ధింపజేస్తూ ఉంటుంది. ఈ విధమగు డార్విన్‌సిద్ధాంతవ్యాఖ్యానమును చూచినప్పుడు మన కందులో యాదృచ్ఛికపరివర్తనసిద్ధాం

తము (Accidental Variation Theory) స్ఫురిస్తూ ఉంటుంది. ఈ సందర్భంలో యాదృచ్ఛికమనే మాటకు కారణరహితసంభవ మనుకోరాదు. అనంతపరివర్తనలో ఉద్దేశింపరాని సంభవమే యాదృచ్ఛిక మాతుంది.

ఇట్టి సిద్ధాంతానికి ప్రాకృతికక్రమములో ఆధారము లేకపోలేదు. ఒక తాత్త్వికుడు అన్నట్లు ప్రకృతిని నిష్పాక్షికంగా పరిశీలించినవానికి, అది జీవుల సుఖస్థితికి చెందిన ఒక అవధికి చేర్చగల ఉపాయ మెట్లా అవుతుంది? ప్రకృతిగమనానికీ, జీవుల ఉత్పత్తిక్రమానికి తాదృశత్వ మెచ్చట నున్నది? ప్రకృతిలో ఒక పరిపూర్ణ జీవవికాసము రావలెనంటే వేలకొలది జీవికలు పరిణామములో భిన్నమైతేనే అది జరుగుతోంది. అందుచే చివరకు తేలే దేమిటంటే, ప్రకృతిమూలసూత్రము జీవవినాశనము; పోగా జీవసంరక్షణ, జీవపరిణామము అనేవి ఆ మూలసూత్రానికి భిన్నముగా అప్పుడప్పుడు జరిగే అంశాలు.

ఈ పై వాదంలో ఒకటిరెండు అంశాలు కొంచెం యోచించతగ్గవి. ఈ పైవిధంగా ప్రాకృతికపరిణామంలో జీవికలు వృథాఅయిపోతూఉండటం అనేది డార్విన్ వాదానికి బలం తగ్గించకపోగా ఒకవిధంగా ఊత నిస్తుంది. ఎందుకంటే, ప్రకృతిలో ఎన్ని ఎక్కువ జీవికలు సంఘర్షణ చెందితే అన్ని ఎక్కువతరగతులు పరిణామం చెందే ఉపాయ ముం దని డార్విన్ వాదము. అంతేకాక ప్రకృతిలో చైతన్యం కలిగిన జీవికలు మన చూపులకు ఎంత మిక్కుటంగాను, అనవసరంగాను కనుపించినా అవి ప్రకృతిలో అన్ని ఎక్కువతరగతులను పరిపూర్ణతకు చేర్చటకును, బహుముఖజీవికావికాసమును, పరిణతిని కొనివచ్చేటందుకును, మన మనుకొన్నట్లు జీవికలకు సుఖస్థితిని ఏర్పరచేటందుకును ఎంతో అవసరమై తీరాలి.

ఈ రీతిగా ప్రకృతిజన్యఫలితాలు సహేతుకములుగా కనిపిస్తున్నప్పుడు ప్రకృతి అవలంబించే పద్ధతులు అహేతుకము లెట్లా అవగలవు? లేదా ఈ ప్రకృతిజన్యఫలితాలు సహేతుకాలని నిర్ణయించేటందుకు మన బుద్ధి చాలనిదైనా కావాలి.

“విశ్వంలోని ప్రతిపరమాంశమున్నూ కొన్ని శక్తులను ఇమిడ్చికొని ఉంది. వీటి గమనసూత్రాన్ని అనుసరించే ప్రపంచంలోని ప్రతివస్తువున్నూ—జీవ మున్నదైనా, లేనిదైనా—పరస్పరాంతరకర్మవలన తటస్థిస్తూ ఉంటుంది. ఇదే నిజమైతే అగమ్యగోచరమైన విశ్వావకాశంలోని ప్రపంచస్థితికూడ తక్కువ నిజమైంది కాదు గదా.”

అని హక్స్లీ అన్నాడు. అత డింకా చెప్పాడు: “శాస్త్రాభ్యుదయచరిత్ర తెలిసినవారెవ్వరైనా దాని పురోగామిత్వం అన్ని యుగాలలోను తన ఆధిపత్యాన్ని విస్తరింపజేసుకొంటూ పోవుటేకాక పదార్థము, కార్యకారకత్వము వీని ప్రచారమున పారలౌకికము, అద్భుతము అను ఊహలను మానవుని ఆలోచనల నుండి నెట్టివేస్తోంది అనే విషయాన్ని ఒప్పుకుంటారు.”

యాంత్రికదృష్ట్యా హక్స్లీ ఈ విధంగా చెప్పినా కొన్ని సందర్భాలలో ప్రకృతిలోని యథార్థాలు కొన్నిటికి (అనగా మానవుని పారలౌకిక జీవనమునకు సంబంధించినవి) ప్రస్తావన వచ్చినప్పుడు, అవి తన పై దృష్టికి వ్యతిరేకములైనా తప్పనిసరిగా ఒప్పుకోవలసివచ్చింది. కాని తత్త్వము, పరిణామము అనేవి వస్తుతః వ్యతిరేకసంబంధము కలవేనని, విశ్వక్రమానికీ, నైతికావసులకూ సంబంధం లవలేశమైనా లేదని అత డింకోచోట తెలియపరిచాడు. “విశ్వక్రమానికి సంఘపరిణామంమీద గల పలుకుబడి అధికం. అందుచే సంఘాభివృద్ధి అంటే విశ్వక్రమానికి అడుగడుగుకీ అడుతగలటమే అవుతుంది. ఆ విశ్వక్రమానికి బదులుగా తాత్త్వికాభ్యుదయాన్ని ఆదేశం చేస్తున్నాం. కనుక సంఘంయొక్క తాత్త్వికాభ్యుదయం విశ్వక్రమాన్ని అనుకరించటంమీదను, దానినుండి పైతొలగిపోవటం మీదను కాక, దానిని ఎదుర్కోటంలోనే ఉన్న దని తెలిసికోవలసి ఉంది.” ఇది హక్స్లీవాదము. పరిణామానికి, తత్త్వానికి వ్యతిరేకత ఉందనే ఈ వాదము కొంచెం యోచించతగ్గది. హక్స్లీ తన వాదంలో విశ్వక్రమంలో నుండి తత్త్వాన్ని బహిష్కరించడంలో ఉద్దేశం కనుపించదు. అందుచే అతని దృక్పథంలో సందిగ్ధత ఏర్పడింది. అతడు మొదటినుంచి చివరవరకు చేసిన పరిణామవాదము సంబద్ధముగా నడవలేదు. మనం విశ్వమంతా ఒక ఏకమని తీసుకొంటే తత్త్వమనేది స్వాభావికంగానో, యుక్తంగానో విశ్వక్రమంలోనుంచి ఉద్భవించిన ఆరోగ్యాంశ మాతుంది. లేదా అది (తత్త్వము) శరీరమునే (విశ్వక్రమము)నే తిని వేయునంతటి అస్వాభావిక, అయుక్త జాడ్యమైయుండాలి. మొదట అసలు హక్స్లీకి విశ్వ మేకమను విషయమే అనుమాన మైనట్లుంది. పోగా

అది ఒప్పుకొన్ననూ అతని దృష్టిలో తత్త్వము తన ఉనికికై తా నాశ్రయించిన విశ్వక్రమానికే ముప్పు తెచ్చునంతటిది. కావున తత్త్వము, తత్త్వపరమార్థము అనేవి ఒకానొక సహజక్రమంలో మూలానికి భిన్నం కాని అంశాలుమాత్రమే ననటం సబబుగా ఉంటుందేమో. పోగా సృష్టి అనుసరించే పద్ధతులనుమాత్రం గమనించి, సృష్టిక్రమాన్ని పాటించకుండా ఆలోచించమనడం కూడ సంగతంగా లేదు.

ఇక హెర్బర్టు స్పెన్సరు పండితుని విచారించి చూస్తే ఈవిషయానికి ఇంకా కొంచెం తృప్తికరమైన వ్యాఖ్యానం లభిస్తుంది.

యాంత్రికమైన వ్యాఖ్యానం జీవశాస్త్రానికి ఎంత వర్తిస్తుందో, తాత్త్వికమైన యథార్థాంశాలకూ అంతే వర్తిస్తుందని స్పెన్సరువాదము. అతని వాదం తాత్త్వికైకత్వానికి దారితీస్తూఉంటుంది. అతడు తన వాదనలో జీవారంభంతో ఎత్తుకొని, అంతకు పూర్వమున్న పరిస్థితులు, జ్ఞానారంభము, తత్పూర్వపరిస్థితులు క్రమంగా వివరించి ఒక సమగ్రమైన సూత్రాన్ని నిర్వచించాడు. అనిర్ణీతమై అసంబద్ధమైన సారూప్యమునుండి నిర్ణీతమై, సంబద్ధమైన బహుళరూప్యతకు జరుగు మార్పున్నూ, ఆ సందర్భంలో పదార్థంలో జరిగే బహుళ సంగమతయున్నూ, తదనుయుక్తమైన చలనవికారమున్నూ పరిణామక్రమంయొక్క సహజగుణాలని స్పెన్సరు నిర్వచనం.

స్పెన్సరు ఉద్దేశంలో “తాత్త్వికంగా లభించే తుట్టతుది వ్యాఖ్యానం, ప్రత్యేకసంశ్లేషణలను (special synthesis) సంఘటించి పరిపూర్ణమొనరించే సైక్వికసంశ్లేషణమాత్రమే ఔతుంది.” అతడింకా తాత్త్వికంగా లభించే సైక్వికసంశ్లేషణ, పదార్థముల చలనము, వీటి రీతిలో మార్పులను నిర్ణయింపగలిగితే చాలు నన్నప్పుడు మన కంత నచ్చడం కష్టం. ప్రాథమికసూత్రాలు అనే పుస్తకంలో అతడు మనం అర్థించే సిద్ధాంతము పదార్థచలనాలను పునర్విభజించే అనుచారికసిద్ధాంతమై తీరాలని వ్రాశాడు. కాని అట్లాంటి సూత్రము పూర్తిగా పారమాణుకసంబంధమునకు చెందింది. కనుక అది మానవానుభవంలో పాత్ర వహించే గుణవిభేదాల్ని వివరించలేకపోతోంది. మనము ఎఱుపురంగును చూస్తాము. ఆకుపచ్చని రంగునూ చూస్తాము. కాని ఈ రెండింటిలోను ద్యోతకమయ్యే వివిధమైన అనుభవం ఎందుకని విభేదమైనదో వాటివాటి కాంతితరంగదూరముల పరిమాణములవలనకూడా అవగాహన కాదు. ప్రాకృతిక శాస్త్రంనుండి మానసిక శాస్త్రంవరకూ తీసుకొనిరాబడ్డ కారణసూత్రం అనుభవాల పరిమాణాన్ని వివరించటానికి చాలదు.

శక్తియొక్క స్థిరానుగమనంనుంచే పరిణామరహస్యాన్ని బయటకు తీయాల్సిఉందని స్పెన్సరు పండితుడు చెప్పినప్పుడు విశ్వాన్ని సుశీలించిన అతని యాంత్రికవివరణలోని అపవాదాన్ని గ్రహించగల్గుతాము. అనుభవాన్ని సంపూర్ణంగా వివరించవలసిన తత్త్వశాస్త్రాన్ని, యంత్రశాస్త్రానికి సంబంధించిన ఒక చిన్న ప్రాథమికసూత్రంమీద నిలిపి వ్యాఖ్యానించడం సబబుగా లేదు. పదార్థము, శక్తి వీనితో సంబంధించిన ఓ చిన్నసూత్రం మానవుడు, బుద్ధి, సంఘం, తాత్త్వికపద్ధతులు మున్నగు అంశాలనన్నింటిని ఇముడ్చుకొనేటంతటిది మాత్రం కాదు. కాంతితరంగదూరములను సరిగా నిర్ణయించడంమూలాన కాని, విషయాల్ని గ్రహించే మానవశరీరంలోని నరాల కేంద్రానుకంపాలను స్పష్టీకరించటంమూలానకాని, రంగులను దర్శించినప్పుడు నేత్రాంతరమున జరిగెడు మార్పులను విచారించినంత మాత్రంచేతకాని, సూర్యోదయమో, సూర్యాస్తమయమో, ఇంకా అట్లాంటి ఏ ఇతర ప్రదర్శనాన్నో చూచినప్పటి సౌందర్యానుభూతి ప్రస్ఫుటితం కావడం కష్టం.

ఈలాంటి యాంత్రికవివరణలలో మనకు కనపడే అపవాదమల్లా, సమగ్రమైన విషయాన్ని అసంపూర్ణ విషయాలమూలాన వివరింపజూడటం. కాని వ్యాఖ్యానమన్నా, వివరణ అన్నా తక్కువగా తెలిసిన విషయాలను ఎక్కువగా అర్థమైన విషయాల ఆధారంవల్ల తెలుసుకోగల్గటం. కాని పైప్రయత్నంలో సమగ్రమైన విశ్వతత్త్వాన్ని, పరిణామాన్ని తెలుసుకొనేటందులకై అసమగ్రమూ, అసంపూర్ణమూ అయిన అంశాల ఆధారంతో ప్రయత్నించడమే కనిపిస్తుంది. విశ్వగమనానికి తృప్తికరమైన వ్యాఖ్యానం కావాలంటే జీవనము, భావన అను పదాలను ఉపయోగించుకొని వివరణ చేస్తే వీలుగా ఉంటుందికాని పదార్థము, చలనము అనే పదాల ఉపయోగంవలని వివరణ ఏమీ ప్రయోజనం లేదు. బాగా యోచిస్తే పదార్థమూ, చలనమూ అనే పదాలు మనము మన భావనాక్రమంలో సృష్టించుకొన్నవే కదా! ఎప్పుడూ వర్తమానానుభవాన్ని బట్టి భూతకాలాన్ని వ్యాఖ్యానం చేయగలు

తాము. అట్లాగే జీవితము, బుద్ధి వీటి ననుసరించే విశ్వాన్ని వ్యాఖ్యానించడం సముచితం. జీవితం, భావన అనేవి విశుద్ధమై ముఖ్యమైన ఈ భౌతిక విశ్వానికి సంబంధించిన కథాంతర సముచ్ఛవాలన్నా కావాలి; లేదా తనకు తానే అవధిగా నిలిచిన ప్రకృతికి జీవితము, భావన అనేవి వ్యాఖ్యాన మన్నా అయిఉండాలి.

భూతకాలాన్ని బట్టి వర్తమానాన్ని వ్యాఖ్యానించే పరిణామవాదము మొదటగా వర్తమానాన్ని అనుసరించి భూతకాలాన్ని వ్యాఖ్యానించే వాదానికిన్నీ దారి ఇవ్వాల్సిఉంది. అట్లా జరిగితే భవిష్యత్తును అవధిగానో, ప్రయోజనంగానో, లేక ఆదర్శంగానో భావించుకొని, వర్తమానాన్ని అనుసరించే వ్యాఖ్యానించవచ్చు, ప్రస్తుతస్థితమైన పరిజ్ఞానాన్ని అనుసరించి, సమగ్రము, సంపూర్ణమైన విశ్వజ్ఞానాన్ని వివరించగలిగినదే తత్త్వమనబడుతుంది. అట్లా జరిగిన తర్వాత సిద్ధించిన అంశాలలో విశ్వాసముండాలి.

ఈ విధంగా జీవితానికి అంతర్గతంగా ఒక ప్రయోజనం ఉందనే ప్రాతిపదికమీద చూస్తే స్వతస్సిద్ధమైనదే కాక ఆత్మగృహీతమైన ఒక ప్రయోజనం బోధపడుతుంది. ఆత్మజ్ఞానం అనేదికూడ పారలౌకికజ్ఞానం జగత్తులో ప్రస్ఫుటిస్తూ ఉంటుం దనే ప్రాతిపదిక పైననే అర్థమౌతుంది. ఈ రెండు ప్రాతిపదికలనూ అంగీకరిస్తే తత్త్వశాస్త్రము చెల్లుబాటుగనూ, నమ్మదగినదిగానూ అయి జగత్తును గూర్చిన వ్యాఖ్యానానికి ఉపకరిస్తుంది.

ఇంతవరకూ మనం పరిణామాన్ని యాంత్రికంగా, తాత్త్వికంగా యోచించి చూచాము. యాంత్రికవివరణ కేవలం వ్యాఖ్యానానికి క్రిందిమెట్టు అనేది మనం తెలుసుకొన్నాం. ప్రఖ్యాతశారీరకశాస్త్రజ్ఞుడు హేల్డేన్ పరిణామాన్ని గురించిన యాంత్రికవివరణ యథార్థానికి దూరంగాను, అసంగతంగాను ఉన్నదనీ, అందుకు కేవలం వస్తునిర్మాణం వివరణపద్ధతికి ఆధారంగా తీసుకోవటమే కారణమనీ అభిప్రాయపడ్డాడు. ఎలాగంటే: శరీరమునందలి కాలేయపు నిర్మాణం తెలిసినంతమాత్రాన అది చేసే పనిరీతి బోధపడటం కష్టంగదా! పనినిబట్టి వస్తునిర్మాణం తెలియవచ్చునేమోకాని వస్తునిర్మాణాన్ని బట్టి అది చేసే పని నిర్ణయించడంమాత్రం కుదరని విషయం. శరీరంనుండి కొన్ని పదార్థాలు బయటికి రావటం, మరికొన్ని పదార్థాలను శరీరం తీసుకోగలగటం కేవలం శరీరంలో ఉండే అసంఖ్యాకములైన జీవకణువుల్లవల్ల శరీరపోషణకై జరుగుతుంది. ఈ అంశాన్ని ప్రయోజనసిద్ధాంతరీత్యా తలచిచూచినప్పుడే మనం గ్రహించగలుగుతాం. హేల్డేన్ ఒకచోట ఇట్లా అన్నాడు: "శారీరకశాస్త్రంలో జీవకణువులను గురించి యోచించేటప్పుడు మనం ప్రయోజనసిద్ధాంతరీత్యా చూడవలసి ఉంటుంది. ఎందుకంటే, వాటి గమనం యాంత్రికంగాగాని, యాంత్రికమైన ఏ ఇతరబహిరోజశ్శక్తిమూలానగాని మార్పు నొందేది కాదు. శారీరకశాస్త్రంలో సరియైన వివరణ శారీరక రసాయనవ్యాఖ్యానంవల్ల సమకూడటం కుదురనిది. అందుచేత శారీరకశాస్త్రంలో ప్రతివిషయం ప్రయోజనదృష్ట్యా వివరించవలసిఉంటుంది." ఇందుమూలాన జీవశాస్త్రపు మేరలలో యాంత్రికవ్యాఖ్యానానికి నిషేధము పెట్టిన ట్లెంచరాదు. కాని జీవశాస్త్రంలో యాంత్రిక వ్యాఖ్యానం ప్రయోజనార్థవ్యాఖ్యానానికి తరువాతిదే నని మాత్రం జ్ఞాపకముంచుకోవాలి. ప్రయోజనము పరివర్తకపరిసరాలను అనుసరించి రూపాంతరం చెందుతూఉండాలి. అసలు ప్రకృతిలోని ఆంతరంగిక ప్రయోజనస్పందనమే మనకు కనుపించే బాహ్యగమనాల క్రమాన్ని ప్రేరేపిస్తూ ఉంటుంది. అందుచేత ఆ ప్రయోజనదృష్ట్యా విషయాలను గ్రహించలేకపోతే అది మన పొరబాటౌతుంది.

పరిణామానికి సంబంధించిన జీవశాస్త్రసిద్ధాంతమునకు ప్రాతిపదికమైన యథార్థాంశాలను పరికించిచూస్తే ప్రాకృతికసంగ్రహణసూత్రంతోపాటు తదనుబంధమైన ప్రయోజనసూత్రంకూడా గోచరిస్తుంది: పరిణామక్రమం కేవలం ప్రయోజనపూర్వకం అని రుజువు చేయటం కొంత కష్టమైనప్పటికీ దాని క్రమం ఒక ప్రయోజనంకోసం గమించే ధోరణిలో ఉన్నదనటం సబబుగా ఉంటుంది. కొన్ని విషయాలు తీసుకొని చూస్తే ప్రయోజనపూర్వకంగా ఉన్నట్లు గోచరిస్తాయి కాని మరికొన్ని అంశాలు కేవలం బయటి పరిస్థితులనుబట్టే మారుతూ ఉంటాయికదా? అట్లా కేవలం బయటి పరిస్థితులనుబట్టి మారేవానికి ఏం ప్రయోజనం చెప్పగలం?

మార్క్యయర్ తెల్పిన భౌతికావసరము, డార్విను ఎక్కువగా ప్రాముఖ్యము నిచ్చే సెక్సుయల్ సెలెక్షను, జీవుల బుద్ధివలన జరిగే విశేషము—ఈ మూడు అంశాలూ సర్వసామాన్యంగా పరిణామగతిలో అంతర్భాగాలు. ఈ అంశాలు మనకు ప్రకృతిలో ఎప్పుడూ దర్శనమవుతూనే ఉంటాయి. అనేకరకాల పక్షులను తీసుకొనిపోయి ఒక తోటలో విడిచిపెట్టా మనుకోండి.

అప్పుడు ఒక పక్షి ఆకలి తీర్చుకోవటంకోసం ఎఱ వెదుకుతుంది. ఇంకొక పిట్ట మిథునక్రియకోసం పనికివచ్చే వేరొక పిట్టను చేరుతుంది. మఱియొక పక్షి తనకు గిట్టనటువంటి జీవి నొకదాన్ని హతమార్చడానికి చూస్తుంది. ఈ సందర్భంలో సార్వపండితుడు వ్యాఖ్యానిస్తూ ప్రతిజాతిపక్షీ తన సహజసిద్ధమైన ఆంతరంగిక స్ఫురణమువలన తనకు పనికివచ్చే ఆహారం వెతుక్కోగలిగియుంటుంది. ఆ ఆంతరంగికస్ఫురణ, ఆ పక్షి ఉత్పత్తికి పూర్వపు తరాలనుండి ప్రాప్తించే ప్రాకృతిక సంగ్రహణమహాత్మ్యము ననుసరించి ఉంటుంది. కాని ప్రాకృతికసంగ్రహణ పైక్రమానికి కేవలం బాధ్యత వహించేదిమాత్రం కాదు. జీవుని స్వయంకృషి పరిసర పరిస్థితుల ననుసరించి కొంతవరకు అందులకు కారణమాతుం దని చెప్పవచ్చు.

ఈ విధముగా ప్రకృతిలోని జీవుల స్వయంకృషి వలన జరిగే ఎన్నికయే ప్రయోజన మనుకొంటే, ఆపైన ప్రాకృతిక సంగ్రహణా, నేటివరకు దాని క్రమమూ సులభముగా వ్యాఖ్యానించవచ్చు. ప్రకృతిలో ప్రయోజనపూర్వకములైన అనేకమార్పులు, ప్రాకృతికసంగ్రహణప్రయోజనవాదమును మీరి చూస్తే, కేవలం ప్రయోజనవిరహితమైన జీవసంయోగములవలన కలిగినప్పటికీ, అవి ఏదో ఆకారణముగా యాదృచ్ఛికముగా తటస్థించినవేనని వార్డు శాస్త్రజ్ఞుని అభిప్రాయము. అటువంటి సమయాల్లో ఒక్కొక్క ప్రయోజనకరజీవోత్పత్తికి అనవసరంగా అపరిమితమగు కాలము సరిపుచ్చుకుంటూ ఉంటుంది. కాని జీవి తన స్వయంకృషివలన ఆ ఇబ్బందిని తగ్గించుకొని రాగలుగుతుంది. అయినప్పటికీ జీవుల మానసికవిశేషాలు జీవక్రమానికి సంభవించే అంశాలక్రింద పరిగణింప వీలులేదు. వాటిని జీవక్రమానికి ప్రాథమికాలుగనూ, వ్యాఖ్యానకరాలుగనూ పరిగణించవలసిఉంది. కాని సర్వసామాన్యంగా జీవక్రమంలో జీవుల మానసికరీతి అహీన మైన దని చెప్పవలసిఉంది.

మానవస్వభావాన్ని పరిశీలించినప్పుడు పై అంశం మనకు స్పష్టంగా గోచరిస్తుంది. పరిణామక్రమానికి ఒక విస్పష్టప్రయోజనం లేదని వాదించేవారు సహితం మనుష్యుడు బుద్ధిపూర్వకంగా ఒక ప్రయోజనంకోసం పనిచేస్తా డన్న విషయాన్ని కాదనలేక పోయారు. ప్రయోజనం ప్రయోజనవిరహితమైన పరిణామక్రమంలో తటస్థించే అంశముగానే వారు పరిగణిస్తూ వచ్చారు. కాని మనం ప్రయోజనం అనేదాన్ని ప్రయోజనపూర్వకమైన పరిణామక్రమానికి సంగతమైన అంశంగానే పరిగణించవలసిన అవసరాన్ని గమనించవలసిం దంటాము.

ఇక ప్రకృతిని వ్యాఖ్యానించడం కట్టిపెట్టి మానవుని, అతని మానసికప్రవృత్తిని విచారణచేసి చూస్తే పరిణామగతికో విస్పష్టప్రయోజనం ఉందన్న విషయం బాగా బోధపడుతుంది. ఈ సందర్భంలో మనం మానవుని, అతని మానసికప్రవృత్తిని ప్రకృతికి భిన్నాంశాలుగా గాక ప్రకృతిలోని అంతర్భాగాలుగా పరిగణించటం యుక్తము. మనం ఈ దృష్టిలో జీవశాస్త్రవివరణనుండి మానసికశాస్త్రవివరణకు దిగేముందు, వీటి రెండింటిలో గల భేదము ఆయా శాస్త్రాల విస్తరణకు సంబంధించినదేగాని క్రమానికీ, పద్ధతికీ ఎంతమాత్రమూ సంబంధించనిదని మనము గ్రహించాలి. అందుచేత భౌతికశాస్త్రము పరిమితమైన పరిధులలో, తన స్థానమునూ, కారణమునూ అన్వేషిస్తే, తత్త్వశాస్త్రము కొంచెము వెనుకకు పోయి, సర్వవిషయాలకే తుట్టతుది స్థానమూ, కారణమూ కనిపెట్టేందుకు ప్రయత్నిస్తుంది. మొత్తముమీద రెండిటి పద్ధతులూ ఒకటే. మానవుని అనుభవాలను నిష్పాక్షికంగా తెలిచి చూస్తే, మానవుని బుద్ధి, సంకల్పము, ప్రయోజనము అనేవి మూడూ కలిసి విశ్వానికి మన మిచ్చే వ్యాఖ్యానానికి ప్రాతిపదిక లవుతున్నాయి.

మానవుని,అతని బుద్ధిని పరిణామక్రమంలో అంశాలుగా పరిగణించినట్లయితే అతని తాత్త్వికజీవితంలో మఱియొక అంశముకూడ గోచరించకపోదు. పరిణామగతిలోని ఈ అంశాన్ని పరీక్షించినప్పుడు యథార్థవిషయాల్ని మాత్రమేకాక వస్తువుల విలువనుగుఱించిన భావంకూడ చూడవలసివస్తుంది. మానవుని బుద్ధికి యథార్థఅంశాలన్నీ ఏదో ఒక అవధికి సంబంధించిన విలువలు కలిగియున్నట్లుగా కనిపిస్తాయి. మానవుని తాత్త్వికమైన స్వయంజ్ఞానాన్ని పరిశీలించినప్పుడు ప్రయోజనాన్ని గుఱించిన భావం ప్రకృతిపరిశీలనలో కంటె మానవుని మానసికపరిశీలనలో అధికంగా ప్రదర్శితమైనప్పటికీ, ఆ ప్రయోజనభావం క్రమంగా విలువను గుఱించిన భావానికి ఎక్కువగా తావు ఇస్తూ ఉంటుంది.

పరిణామక్రమంలో సంగతిమయ్యే యథార్థాంశాల గణన మనకు మానవుని ప్రకృతిలోనే గోచరమాతుంది. దాని సహాయంవల్లనే మన మా యథార్థాం

శాల అంతర్యాన్ని అర్థం చేసుకోగలుగుతాము. తాత్త్వికాదర్శాలలో కాని, నైతికప్రకృతిలోకాని మానవునికి సంబంధించిన యథార్థవిషయాలు ఏ ఇతరఅనుభవానికైనా సచ్ఛాస్త్రీయతలో తీసిపోవు. అట్లాంటప్పుడు మన తాత్త్వికోద్దేశాల అభివృద్ధి పరిణామక్రమానికి సంబంధించిన యథార్థాంశాలపై తన ప్రభావము ప్రసరింపజేస్తుందంటే ఎలా? మరి ఈ తాత్త్వికోద్దేశాలు ఆ పరిణామక్రమంలోని అంశాలని ఒప్పుకున్నాము కదా?

ఈ ప్రశ్నలకు సమాధానము చెప్పాలంటే ఈ యథార్థాంశాల నిజస్వరూపక్రమాన్ని క్లుప్తంగానైనా అవగాహనచేసుకోవాల్సి ఉంది. మొదటగా నైతికాభివృద్ధిక్రమాన్ని మనం చూడాల్సి ఉంది. మనము నీతి అనేది సహజముగా క్రమంగా పరిణామగతిలో అభివృద్ధిచెందిన విశేషంగా తీసుకోవచ్చును. కాని అది ఎట్లా అభివృద్ధిచెందిందనే ప్రశ్నకు స్పెన్సరు మతమునకు చెందిన పరిణామవాదులు ఫలితోద్దేశాలు అనేవే గతానుగతికంగా విధోద్దేశాలనే వాటికి దారి తీశాయంటారు. అనగా ఒక జీవి చేసే ఒక పనివల్ల జీవసమూహానికో, జీవజాతికో కలిగే ఫలితాన్ని అనుసరించే ఆ పనియొక్క ఘనత నిర్ణయింపబడుతోంది. శాస్త్రపరిభాషలో చెప్తే తాత్త్వికానుభవము సాంఘికప్రతికారకత్వమునుబట్టి వ్యక్తినివసించే సంఘానికిన్నీ, ఆ వ్యక్తికినీ మధ్యేమార్గంలో నడుస్తూ ఉంటుందన్నమాట. ఆచారము నైతికరీతిని నిర్ణయిస్తూ ఉంటుంది. ఈ పై సిద్ధాంతంలో వ్యక్తికి వెనుక సమాజమనే ఓ అవధి ఉన్నదని తేలుతోంది. కాని విపులీకృతమైన వ్యక్తిస్వార్థమే సంఘస్వార్థముగా రూపాంతరం చెందటం తప్ప వ్యక్తిస్వార్థంగాని, తత్స్వార్థఫలితంగాని మానవుని తాత్త్వికజీవనాన్ని అతిక్రమించే విధిసూత్రగ్రహణానికి దారి తీస్తున్నాయా? లేదు. లోకంలో సమాజాచారాలకు వ్యతిరేకుడుగా ఉన్న వ్యక్తికే దృఢమైన విధినిర్వహణానుభావన కలుగుతోంది. తాత్త్వికశాస్త్రములో ఓ చిన్న వాక్యం తఱచుగా వినవస్తూఉంటుంది. ప్రవక్త అయినవాడికి తన మాతృదేశంలో తప్ప ఇంకెక్కడా గౌరవానికి కొఱతలేదు. తాత్త్వికశాస్త్రచరిత్రలో ఈ వాక్యంలోని సత్యం అనేకసార్లు రుజువైంది. ప్రవక్త అనేవాడికి సమాజం ఎట్లా ఉంటే బాగుంటుందో అనే విషయం, సమాజంలో అతని చుట్టుపట్ల ఏర్పడ్డ పరిస్థితులవల్లగాక అమాంతంగా అలా తట్టుతుంది—అదీ అంతే!

అసలు మానవుని నైతికప్రవర్తన పరిణామగతిలోని అంశమేనా? అనేది విచారణీయాంశము. పరిణామం ఒక క్రమగతిలో ఐక్యమును పాటిస్తూ ఉంటుందనుకొంటే పై ప్రశ్నకు అవుననే జవాబు వస్తుంది. కాని తాత్త్వికనిర్ణయాలు స్వతస్సిద్ధాలుగా ఉండవు; ఎల్లప్పుడు పరాశ్రయాలుగానే ఉంటాయి. వాటిని అట్లా ప్రత్యేకాపజ్ఞకాంశాలుగా ఎందుకు ఎంచుతామంటే ఒక సమాధానం లేకపోలేదు. మానవుడు తన జాతికి నీతి ఉండటంవలని ప్రయోజనం గుర్తించటంమూలాన నీతి అనేది దైవశాసనాన్ని అనుసరించి జరుగవలసిందని సమ్యక్కర్మలను నిర్వర్తించే బాధ్యతను, విధిని రోజురోజుకూ దృఢతరం చేస్తూ వచ్చాడు. అట్లాంటప్పుడు మానవుని నైతికజీవితంలోని యథార్థాంశాలు మానవమానసికశాస్త్రానికి సంబంధించిన యథార్థాంశాల శ్రేణిలోకి ఎట్లా రాగలవు?

వెస్టరు మార్కు పండితుడు అన్నట్లు ఒక విషయాన్నో, సందర్భాన్నో గురించి మనకు కలిగే నైతిక భావాలు ఆఖరికి ఆ విషయాలూ, సందర్భాలూ మనకు నచ్చటం వల్లనో, గిట్టకపోవటంవల్లనో కలిగే చిత్తోద్రేకము ప్రాతిపదికగా కలుగుతాయి. మనకు కలిగే అనుభూతివలన ఒక వస్తువు చల్లగా ఉందనో, వేడిగా ఉందనో చెప్పగలిగినట్లే, కొన్ని పనులు మంచి వనీ, మఱికొన్ని చెడ్డ వనీ చెప్పుకొంటాము. సుఖము, దుఃఖము అనేవికూడా మనకు కలిగే అనుభూతివలననే నిర్ణయించుకోగలుగుతాము. అందుచేత ఒక విషయం మంచిదనో, చెడ్డదనో చెప్పటంవలన తేలే దేమిటంటే: అట్లా నిర్ణయించే వ్యక్తికి సమ్మతము, లేదా అసమ్మతమును కలిగించే భావోద్రేకమే ఆ నిర్ణయానికి మూలకారణమని తేలుతుంది. 'సుఖాన్ని ఇచ్చే పనిమాత్రమే మంచి'దని వాదించే సఫలతావాదులుకూడ ఒకానొక ప్రత్యేకపు పని చేసినప్పుడు ఆ పనియొక్క నైతిక స్వభావాన్ని గురించి కేవలం తమ బుద్ధి కందినంతవరకే నిర్ణయం చేయగల్గుతారు. కాని సఫలతాసిద్ధాంతంలో మొదటినుంచీ పూర్ణవిశ్వాసం కలవానికైనా ప్రప్రథమ సూత్రం భావప్రకోపం (emotion) నుంచే ఆవిర్భవిస్తుంది. విభిన్నమైన వ్యక్తుల భావోద్రేకములు కాని, విభిన్నమైన జాతుల భావోద్రేకములు కాని చూచినప్పుడు అవి, వారి వారి బుద్ధి

విభవాలకంటే విస్పష్టంగా గోచరిస్తాయి. ఆయా భావో ద్రేకాల ననుసరించే వారి వారి నైతికప్రమాణాలు విస్తృత వైవిధ్యతతో ఏర్పడ్డాయి. ఆయా వైవిధ్యాన్ని వివరించగలటం మూలాననే ఈ సిద్ధాంతం మనకు నచ్చు బాటుగా ఉంది. పోగా ఈ సిద్ధాంతంవలన మిగిలిన పరిణామ క్రమానికీన్నీ, తత్త్వానికీన్నీ సన్నిహిత సంబంధం ఏర్పడటంమూలాన మన కది నచ్చటానికి ఇంకా ఎక్కువ అవకాశ ముంది. ఇంక మనం చేసే తాత్త్వికనిర్ణయాలన్నీ మన భావప్రకోపంలోంచే ఆవిర్భవిస్తాయి గనుక ఆ నిర్ణయాలు తెప్పులోనివి కావు అనడానికికూడ వీలులేదు. తర్కించి చూస్తే ఏరకపు నిర్ణయమైనా మన భావప్రకోపాన్ని దాటి ఉత్పత్తి కానేలేదుకదా? అందుకు ముఖ్యంగా ఉదాహరణ కాదగింది మనకు కలిగే రసానుభూతి. ఏదైనా సొంపైన కావ్యము విన్నప్పుడో, విలాసవంతిమైన చిత్రలేఖ నాన్ని చూచినప్పుడో మనకు రసానుభూతి కలగటం సహజం కదా? యిట్టి రసానుభూతికి అన్నప్పుడల్లా మన బుద్ధివిచక్షణ ఏమి పనిచేస్తుంది? అప్పట్లో మన కా ఆనం దాన్ని ప్రసాదించి మన కా అనుభూతి మేరలకు అందిం చేది మనలోనడిచే తాత్కాలికభావప్రకోపమేగదా? లేదా, ఈ కారణాలవలన మనం ఒకరు చేసిన పనిని మంచిదనో, చెడ్డదనో అన్నప్పుడు ఆ నిర్ణయం కేవలం భావప్రకోపంలోనుంచి వెలువడిం దనే కారణంచేత దాన్ని త్రోసివేసి కాదన గలమా?

ప్రకృతిలో నైతికాభివృద్ధిని విమర్శించినప్పటి కంటె మనలోకలుగు నైతికస్ఫురణమును చూచినప్పుడు వ్యక్తిని అతిక్రమించిన ఒకానొక పారలౌకికవిధి వ్యక్త మౌతూ ఉంటుంది. ఈ పారలౌకికవిధిని ప్రేరేపించేది సమాజము, లేదా జాతిభావమేనని పరిణామవాది అంటాడు. వ్యక్తినడపడికి సంబంధించిన ఈ విధినిషే ధాలు సమాజ మెట్లా ఉండాలి అనే ప్రాతిపదికమీదనే బయల్దేరుతూ ఉంటాయి. అట్లాంటి విధినిర్వాహణ బాధ్యత వ్యక్తిని మించి సమాజమునకంతటికీ స్ఫురించి నప్పుడు ఆవిషయప్రసక్తి తెచ్చి, అది పరిణామక్రమం లోని అంతర్భాగ మని, అది ప్రకృతినుండి మానవసమా జానికి, మానవసమాజంనుండి వ్యక్తికి సంక్రమించే అంశంగా పరిణామవాది సమర్థిస్తూ ఉంటాడు. ఈ వాదంలో సాపత్యం కుదరాలంటే, వ్యక్తిని అధి గమించి సమాజం ఎట్లా ఉందో అట్లాగే సమాజాన్ని అతిక్రమించిన మరో విశేషం ఉండితీరాలి. ఆ విశేషం ప్రకృతి అనుకొంటే దానికి వెనుక మరొకటికూడ ఉందేమో చూడవలెనుగదా! అట్లా ప్రకృతికి వెనుక ఉండే విశేషం దైవత్వమని ఆదర్శవాదులు అంటారు. కాని ఈ శాస్త్రీయఅనుమానం అచ్చటితో ఆగిపోతే, అక్కడితో ఎదుగూ బొదుగూలేక ఆగిపోతుంది. ఆపైన ఏమిచెప్పినా అదిఅంతా అగమ్యగోచరమే, మానవుని బుద్ధికి అందనిదే ఇంతవరకూను.

ఇంతకీ నైతికస్ఫురణకి ప్రధానలక్షణంగా కను పించేదల్లా అది ప్రతివిశేషానికీ ఓ విలువను కట్టడం, తాత్త్వికరహస్యాలను యోచించేటందుకు ఆ విలువ లను తీసుకోవటంలో ఉపకరిస్తుంది. నైతికనిర్ణేతలు విష యాల యథార్థతనుబట్టి చేసే నిర్ణయానికి తమ నిర్ణ యాలు పైమెట్టులో ఉంటారు. అంతేకాక నైతికనిర్ణ యాలే తుట్టతుది వనికూడ వాదిస్తారు. అది సహజమే. అయినా పరిణామసిద్ధాంతానికి విశ్వాన్వయం ఉన్న దన్నమాటమీద తీసుకొని చూస్తే విషయాల మూల్యం, విషయాల యథార్థత అనే భావాలు పారిమాణికశ్రేణి లోకి వస్తా యనిపిస్తుంది. అంటే రెండును ఒకేరీతివి కాకపోయినా వాటిలో తరతమ భేదా లున్నాయి. ఇందువల్ల ప్రతివిషయానికీ విలువ ఉండితీరా లని బోధ పడుతుంది. అయితే ఈ విలువవలన ఎవరికి ఉపయోగ ముంది? దేని విలువవలన దానికి ఉపయోగ ముం దను కొంటే నీతినియమము, స్వకీయమగు విధి, దాన్ని తన కొరకై తానే నిర్వహించుకోవలసిన బాధ్యత—ఇవన్నీ వెంటవెంటనే బయల్దేరుతాయి. కాని ఈ సిద్ధాంతము సరిపడలేదని రుజువైంది. ఇంక పోతే, విషయాల విలువ వలన సంఘానికి ప్రయోజనం ఉందనుకొంటే సాంఘిక బాధ్యత, సఫలతాసిద్ధాంతము మొదలైనవి బయల్దేరు తాయి. వెనుకటి చర్చలో ఈ వాదంకూడా యుక్తంగా వన్నెకెక్కలేదు. ఈ విధమైన యోచనవల్ల మనకు తేలేది ఏమిటంటే—వస్తువుల విలువకట్టడంమూలాన కూడ ప్రయోజనం లేదనీ, ఈ అసంఖ్యాకాలైన విలువ లకుమూలమైన గొప్ప విలువ ఇంకొకటి ఉందేమోననీ అనిపిస్తుంది. ఈ మూలమైన విలువనుగూర్చి తాత్త్వి కులు దైవమని వర్ణిస్తూ వచ్చారు కాని, ఆ మహా దంశస్వరూపాన్ని వివరించటంలో అసంఖ్యాకాభి ప్రాయా లున్నాయి. దైవమంటే మానవుని బుద్ధి కందని ఓ మహత్తరవిశేష మని కొందరూ, మానవ కృతాన్ని అధిగమించగల వ్యక్తితరశక్తి అని కొందరూ, ఉత్కృష్టతావిశేషత గల వ్యక్తిత్వమే నని కొందరూ ఎవరికి తోచినట్లు వారు అర్థం చెప్పుకొంటూ వచ్చారు. దైవాన్ని వ్యక్తితరశక్తిగా చిత్రించే

వారు వస్తువిమయవిలువను గుర్తించలేరు. ఎందుకంటే మన మిచ్చే విలువలు కేవలం మానవుని శక్తిమీదనే ఆధారపడి ఉంటాయి. మనము విలువలకు మూలమైన మూల్యాన్ని ఊహించినప్పుడుకూడ, ఆ మూలమూల్యానికి ఓమూల మానవతయున్నా ఉండితీరాలి. ఇంక కేవలం మన బుద్ధివిశేషాన్ని ప్రయోగిస్తే దైవమనేది ఓ మహత్తరమైన ఉత్కృష్టవ్యక్తిగా తలపోయగలగటం కష్టం. ఈ నిర్ణయానికి ఉపకరించే రుజువుకూడ దొరకదు. ఇందులో ఒక విశేషంకూడ ఉంది. మన బుద్ధివిశేషం చాలా పరిమితమైంది కావటం మూలాన, అలాంటి విశ్వవ్యక్తినిగురించి విశ్వాన్ని, దాని క్రమాన్నిగురించీ నిర్ణయానికి రావటంకూడ కష్టమేకదా! అందుచేత ఈ యోచన తప్పు అనటానికి కూడ అవకాశముంది. అయినప్పటికీ దీనిని సమర్థించే వాదమున్నూ లేకపోలేదు. మానవుడు ప్రకృతిలోని అంశము. మానవునిలో ప్రధానాంశము అతని బుద్ధి. అందుచేత ప్రకృతిగతమైన మానవుని బుద్ధి ప్రకృతినిజస్వరూపమునుండి వేరుగా యోచించటానికి అవకాశ మెక్కడ ?

ఇంతకీ మన కో పరిష్కారమార్గం ఉంది. మనం చేసే నిర్ణయాలు పారలౌకిక, తాత్త్వికఉపాధులమైనుండి బుద్ధివిశేషంతో ప్రకృతిపరిశీలనలో లీనమైపోవాలి. దైవము వ్యక్తేతర మనే వాదం కేవలం బుద్ధిబలంమీదనే ఆధారపడాలి. మనకు బయటికి అందే తర్కము కాక, బయటికి కారణము బోధపడక లోననుండి అది అట్లా ఉండాలి, ఇది ఇట్లా వుండాలి అని స్ఫురించే ఆంతరంగికజీవతర్కము ప్రధానమైనది. బయటికి కనుపించే తర్కము యుక్తిచమత్కారము, సత్యాసత్యముల మిశ్రమము వీటి అన్నింటిలో కలిసి మెలిసి యుండేది. కాని ఆ ఆంతరంగికతర్కము ఈ సంకుచితపరిమితులను దాటి అధిగమించే రహస్యము.

ఒక ప్రఖ్యాత శాస్త్రజ్ఞుడన్నట్లు అధికతర అధికతమ ప్రవృత్తులు కనిపించినకొద్దీ అల్పతర, అల్పతమ ప్రవృత్తులు శిరస్సు మోకరించి బలియై నశించిపోవాలి. ఆ మహాప్రకృతికి గల విశ్వమూల్యాన్ని అనుసరించే తదితరమైన వస్తువల విలువలు ఉంటూఉంటాయి. అట్టి అధికతమమూల్యాన్ని కనిపట్టడం మన సామాన్యమైన తర్కానికి అందేది కాదు. సరికదా, ఆచరణపూర్వకమైన జీవితంలోంచి సముద్భవమయ్యే ఆచరణీయకారణాన్వేషణవల్ల సిద్ధించే ఉత్కృష్టవిశేష మని 'కాంటు' తాత్త్వికుని అభిప్రాయము. వ్యక్తియోచన ఉంటే, శాస్త్రీయసంబద్ధత మారుతూ ఉంటుంది. అట్లాగే దైవమునుగురించిన యోచనకూడా. ప్రొఫెసరు రాయస్ అనేఆతడు మనము వర్ణించటం ఒక ఎత్తూ, విశ్వాన్ని మెచ్చుకోవటం ఒక ఎత్తూ అని అన్నాడు. విశ్వాన్ని వర్ణించేటప్పుడు దృష్టాంతానికి అందినా అందకపోయినా కేవలం తాత్త్వికమైన సిద్ధాంతం అవసరం అవుతుంది. కాని దాన్నే మెచ్చుకోవలసివస్తే మానవుని విభిన్నప్రకృతి అనే అద్దం పెట్టుకొని చూడవలసివస్తుంది. అందుచేత ప్రయోజనవాదమా, యాంత్రికవాదమా? అంటే తేలటం కష్టం. తార్కికదృష్టికల వారిలో బుద్ధిమీద సర్వవిధాలా ఆధారపడేవారు మానవునికీ, అతని బుద్ధికీ అందించే పరమసత్య మంటారు. కాని మానవుల సంయుక్తప్రకృతిమూలాన్నే అసలు సత్యం గోచరిస్తుందంటే, మనం ప్రయోజనవాదరీత్యా చూడవలసివస్తుంది. మానవుల సంపూర్ణప్రకృతిని చూస్తే అందులో అధికాంశము కేవలం తార్కికంగా నచ్చుబాటు అయేదిగా ఉండకపోగా వారికి కలిగే స్ఫురణ, వారికి కలిగే సంకల్పం, వారు చేసే పని-వీటి ననుసరించి ఉంటుంది.

అందుచేత పారలౌకికానుభూతి పరిపూర్ణసత్యానికి చేరువలోనిదిగా కనిపిస్తుంది. జీవితపు విలువలో నమ్మకం లేకపోతే, దాని రూపాంతరాలుగా వెలువడే స్ఫురణ, అనుభూతి, భావన, సంకల్పము, కర్మ —ఈ అంశాలకూ విలువలేదు. కాబట్టి, బుద్ధివిచారణకంటే అనుభూతి అనేదే వ్యక్తిభావానికి దగ్గరగా ఉంటుంది. అంతే కాదు—విశ్వానికి సంబంధించిన సమస్యకుకూడ అనుభూతే మూలాధారము.

కనుక ఈ చర్చలో విశ్వంలో ప్రకృతి పరిణామానికి వెనుక దాని ప్రయోజనం, దాని వెనుక జీవవ్యక్తి అనేవి గోచరిస్తాయి. ఈవిధంగా యోచించి అన్వయించుకొంటేనే మన పరిణామవాదం సార్థకంగా ఉంటుంది.

---

# ఆంధ్రదేశమునేలిన ప్రాచీనాంధ్రరాజ వంశముల చరిత్ర *

●

శ్రీ వంగోలు వెంకటరంగయ్య

ఇది అయిదు పెద్ద ఖండములుగ విభజింపబడిన చారిత్రకగ్రంథము. ఆ యైదుఖండముల నధ్యాయములును, కొన్నికొన్ని అధ్యాయముల ననేకప్రకరణ విభాగములును గలవు. గ్రంథము చక్కని శైలిలో విపులముగ, సుబోధముగ వ్రాయబడియున్నది. గ్రంథము పదిపుటలు గల యవతారికతో ప్రారంభించినది. ఈ యవతారికయందు ఆంధ్రదేశపు విస్తృతియు, అందలి ముఖ్యనదులు, పర్వతములును లోనగువిషయములు చర్చింపబడినవి. ఆయాకాలములలో నాంధ్రరాష్ట్రపు టెల్లల మార్పులును, విస్తృతులు లోనగు విషయములు సాధారణముగ చెప్పబడినవి. ఈ గ్రంథ మాద్యంతమును క్రీస్తుశకపు ౨౦౦ వ సంవత్సర ప్రాంతమునుండి ౬౨౫ వ సంవత్సర ప్రాంతముల కాలపు రాజవంశముల చరిత్రము నాకరించియున్నది.

ప్రథమఖండమున శాతవాహనవంశప్రశంసయు, విక్ష్వాకు వంశీయ పరిపాలనావిషయమును ఉన్నవి. కాలము క్రీ. శ. ౨౦౦ మొదలు ౨౬౦ వర కనడును. ఈ ఖండమున నయిదు అధ్యాయములును, రెండను బంధములును గలవు. నాల్గవ యధ్యాయ మేడు ప్రకరణములపై నున్నది. రెండవ ఖండమున పల్లవుల రాజ్యకాల ముభివర్ణితమైయున్నది. వీరి కాలవిస్తృతి క్రీ. శ. ౨౫౦ ప్రాంతమునుండి ౬౩౦ వత్సరములవరకు వ్యాప్తమైయున్నది. ఈ ఖండమున నెనిమి దధ్యాయములును, నొక యనుబంధమును గలవు. ఇందలి ప్రథమాధ్యాయము మూడు ప్రకరణములు కలిగియున్నది. మూడవ ఖండము క్రీ. శ. ౨౫౦ ప్రాంతములనుండి ౪౪౦ వరకు వ్యాపించియున్నది. ఇది నాలుగధ్యాయములపై నున్నది. మూడవయధ్యాయము నాల్గుప్రకరణములుగ నున్నది. ఈ ఖండమున బృహత్ఫలాయనులు, ఆనందులు, శాలంకాయనులు, మాఠర, లేక పితృభక్తులు లోనగు చిన్నచిన్న వంశావళుల యుదంతములు గలవు. నాల్గవ ఖండమున నేడధ్యాయములును, మూడనుబంధములును గలవు. దీనియందు విష్ణుకుండినవంశచరిత్రము విశదీకరింపబడియున్నది. అయిదవ ఖండము క్రీ. శ. ౩౫౦ ప్రాంతములనుండి ౬౩౦ ప్రాంతములదనుక వ్యాపించియున్నది. దీనియందు కళింగదేశపు ప్రాచ్యగాంగులును, శైలోద్భవు లను వంశీయులును, శరభపుర వంశీయులును, నలవంశీయులును వివరింపబడి ఆంధ్రదేశముతో వీరికి గలిగియుండిన సంబంధములు చెప్పబడియున్నవి. అయిదవ ఖండ మయినపిదప కొన్ని చిల్లర వంశావళుల వంశవృక్షము లనుబంధములుగ జేర్పబడియున్నవి. గ్రంథకర్తగారు దీర్ఘకాలము బహుశ్రమ కోర్చి నూర్లకొలది శాసనములను, అనేకగ్రంథములను, ఎపిగ్రాఫికాఖవారి నివేదికలను, భారతిత్యాది పత్రికల లోని వ్యాసములను పరిశీలించి సాధ్యమగునంతవరకు సమన్వయములను జేయుచు, అక్కరగలిగినచో స్వతంత్రాభిప్రాయములను విస్పష్టముగ వెల్లడించుచు ఇతర గ్రంథములతోను, ఆ గ్రంథకర్తలతోను, వ్యాసకర్తలతోను, పరిశోధకులతోను అభిప్రాయభేదము గలిగినపుడు అట్టి భేదముల [illegible]

* రచయిత: భావరాజు వెంకటకృష్ణరావు గారు, యం. ఏ., బి. యల్. ప్రకాశకులు: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండుసన్సు, మద్రాసు [illegible]

విషయనిర్ణయముల వాగు పారబడి రనియు తెలుపుచు ఈ గొప్పగ్రంథమును నిర్వహించియున్నారు. వీరి సొంతసిద్ధాంతములును కొన్నియూహలపై నాధారపడియున్నవి. అవసరము కలిగినపుడు మూలగ్రంథముల నుండి ప్రమాణవాక్యముల నుదాహరించియున్నారు. సంస్కృతశ్లోకాదులను, శాసనగతములగు కొన్ని వాక్యములను నాగరాక్షరములలో వేసిరిగాని ౫౩౨-౫౩౩ పుటలలో దూబగుంట నారాయణకవి పంచతంత్రములోని తెలుగుపద్య మొకటియు, దగ్గుపల్లి దుగ్గన్న నాచికేతోపాఖ్యానములోని పద్య మొకటియు పాదటీకలలో (foot-notes) కనుపరుప నక్కరగలిగి వాని తెలుగక్కరముల వేయక ఇంగ్లీషుననే వ్రాసిరి.

గుంటూరుజిల్లాలోని దై కృష్ణానదీలోయలలో నిరికిపోనియుండు నాగార్జునకొండ యావిష్కారము వీరికి ముఖ్యాధారముగ నున్నది. ఈ గ్రంథప్రథమఖండమున వివరింపబడియుండు ఇక్ష్వాకుల యుపవంశములకు ఈ నాగార్జునకొండయందలి ప్రతిశాయియు సాక్ష్య మిచ్చుచున్నటు లున్నది. ఈ ఇక్ష్వాకులు శ్రీమద్రామాయణములో ప్రశంసింపబడియుండు ఇక్ష్వాకుపరంపరలోని వారుగనే యున్నారు. ఏ ప్రాతకాలమునవో వీరిలో కొందరు దక్షిణాపథమునకు వలస వచ్చి ఆంధ్రులై ఆంధ్రరాష్ట్రపరిపాలకులై చెన్నలరారి కొంతకాలము వర్ధిల్లిరి.

ద్వితీయఖండగతపల్లవులును ఔత్తరాహోత్పత్తి గలవారుగ నగపడుచున్నారు. మొదుమిక్కిలి ప్రథమ పల్లవుడు ద్రోణపుత్రుడగు నశ్వత్థామకు మదని యను నప్సరయందు కలిగినాడట. అశ్వత్థామ బ్రహ్మచారి గదా! పల్లవులు భారద్వాజగోత్రజు లనియు చెప్పబడియున్నది. ప్రథమదశలో నీ పల్లవులు బ్రాహ్మణజాతిగ పరిగణింపబడినటు లున్నది (పుట ౧౪౪). తృతీయ ఖండములో వర్ణితమైన బ్రాహ్మణకుటుంబములు తరువాతి కాలమునను ఉన్నటుల గోచరించుచున్నది. విజయనగర సామ్రాజ్యములోని అనంతర్యాలోనగువా రెవరో? ఆంధ్రదేశముల చేరిన ఇక్ష్వాకులును [illegible] (పు. ౩౩).

పల్లవుల ప్రభుత్వకాలమునందలి విశేషములును, అంతకు పూర్వమున రాజ్యమేలిన శాతవాహనులను గూర్చియు విశేషముగ చర్చింపబడియున్నది. పల్లవ మనగా ఆకుచిగురు. ఈ వంశమువా రీబిరుదనామము నేల ధరించిరో స్పష్టపడలేదు. బహుశః ఈ శబ్దము పహ్లవ, లేక ప్రహ్నాః శబ్దవికృతియై యుండునా? అట్లగుచోడల వీరి యుత్పత్తిస్థానము విదేశీయమైయుండును. కాంచీపురము (కంచి) ఎల్లో పల్లవుల రాజధానియై కడు ప్రసిద్ధి కెక్కుటయేగాక మోక్షదాయకములని గణింపబడు అయోధ్యాదిసప్తకములో చేరినది. క్రీ. శ. ౨౩౩ ప్రాంతముల వర్ధిల్లిన వీరకూర్చపల్లవునినాటికి కాంచీపుర మేర్పడలేదట (పుటలు ౧౬౧, ౧౯౫, ౧౯౬, ౨౧౧ చూడుము).

పల్లవుల జర్చించుటలో చోళులు ప్రస్తావమునకు వచ్చి, ప్రథమదశలో చోళులును తెలుగునాటివారే యనియు, వారిమూలస్థానము కృష్ణాతుంగభద్రల కుత్తరపువైపున నుండిన దనియు, అచట చోళవాడి యనుపేరు గూడ గలిగియుండినదనియు ఈ గ్రంథమున నిరూపింపబడియున్నది (పు. ౨౮౮). పల్లవుల రాజ్యకాలమునకు ముందు చోళులు దక్షిణదేశమున నుండినదే లేదని స్పష్టముగ చెప్పబడియున్నది (పు. ౨౮౨). తరువాతి కాలములందే చోళులు అరవదేశమున ప్రవేశించి అరవచోళులుగూడ నయిరి. శిల్పశాస్త్రనైపుణ్యములు గల గొప్పదేవాలయాదులు ద్రావిడదేశమున చోళనిర్మితములగుటకు పూర్వమే ఆంధ్రశిల్పులు శైలవిహారాదులను రెండు మూడంతస్తులు గలవానినిగూడ నాంధ్రదేశపర్వతములందు నిర్మించి ప్రసిద్ధులైరి. ఈ శిల్పుల సంతతివారే చోళవాడిలోని చోళులతోకూడ ద్రావిడదేశమున చేరి యచట ప్రసిద్ధశిల్పులైరి. అజంతా, విజయవాడ (బెజవాడ), ఉండవిల్లి, భైరవకోన లోనగు ప్రదేశములందు విహారాదులును, గుహాగృహములును, అందలి చిత్రవిశేషములును ద్రావిడనిర్మితములు కావు. చోళ ప్రాభవ మరవమండలములందు విస్తరించుటకు కొన్ని శతాబ్దములకు పూర్వమే యివన్నియు నిర్మితములై వెలసియుండినవి.

పల్లవుల రాజ్యాంగపద్ధతులును స్వతఃపూర్ణములయి ఆశ్చర్యమును గొలుపగలవు. వీని వివరణములు ఈ గ్రంథముయొక్క ౩౦౯ నుంచి ౩౧౪ వరకు గల పుటలలో నివేదింపబడియున్నవి. ఏయే వృత్తులపై పన్నులు విధింపదగినదియు, ఏయే భూములు సర్వమాన్యములు (ఎట్టి పన్నులును చెల్లింపనక్కరలేనివి) ఇత్యాదివివరణములు జూపబడియున్నవి. ఇట్టివన్నియు నిందు వ్రాయబూనిన ఈ వ్యాస మతివిస్తారము కాగలదు. అందుచే వాని యాకరములుమాత్ర మిందు తెలుపబడినవి.

పల్లవుల గూర్చిన చర్చయు, విష్ణుకుండినుల గూర్చిన చర్చయు బహుదీర్ఘములై, తలస్పర్శులై అనన్యాపేక్షములుగ స్వతఃపూర్ణములై యున్నవి. ఈ గ్రంథరచనకొరకు వీరు పరిశీలించిన ప్రకటితాప్రకటిత శాసనసంఖ్య అనేకశతసంఖ్యాకమై యుండును. దీనికొరకు వీరు ఋణము కలుగజేసికొని అనేక గ్రంథశోధనయేగాక గ్రంథస్థములై చరిత్రాంకితములగు అనేక ప్రదేశములను స్వయముగ జూచుటకై ప్రయాణము చేసిరి. నాగార్జునకొండ శోధకముల దృష్టి కావిర్భవించినది మొదలు ఆంధ్రాన్నత్యమున కా కొండయు, అందలి శిల్పవిశేషములును మిక్కుటముగ వర్ణింపబడుచున్నవి. ఈ నాగార్జునకొండలో నొకభాగము శ్రీపర్వతము. కర్నూలు జిల్లాలో నుండు శ్రీశైలమే శ్రీపర్వత పర్యాయ మను భ్రాంతిని వీరు తొలగదోసినారు. ఈ రెండును వేరు వేరని సిద్ధాంతము చేసియున్నారు.

పల్లవసామ్రాజ్యాభివర్ణనమున త్రిలోచన పల్లవుని వీరవిక్రమపరాక్రమములు విరివిగా వర్ణింపబడియున్నవి. ఆ ప్రభు వందుకు తగినవాడుగనే యున్నాడు. (నెల్లూరికిని, ఈ త్రిలోచనునకును సంబంధ మున్నటుల ఆభాణకములు గలవు. ఇందలి మూలపేటలో వెలసియుండు మూలస్థానేశ్వరలింగము ఈ త్రిలోచన పల్లవ ప్రతిష్ఠ యను జనశ్రుతి గలదు. ఆ దేవునికి ముక్కంటేశ్వరు డని ఆ పల్లవునిపేర ప్రచారము కలదు.)

వంశులవారి మతమున ఆంధ్రులు, ఆంధ్రదేశము అనుటకంటె ఆంధ్రులు, అంధ్రదేశము అని హ్రస్వాకారముతో బలుకుటయే ప్రాచీనసిద్ధ మని తెలియుచున్నది. అటులున్నను అంధ్రశబ్దభవము ఆంధ్రము గావచ్చునుగదా. కావున అంధ్ర, ఆంధ్ర ప్రయోగముల వలన అర్థభేద మేర్పడదు. ఈ ఆంధ్రులకును, దక్షిణాపథమునకును మిక్కుటమైన సంబంధ మీ గ్రంథమువలన నేర్పడుచున్నది. వింధ్యదక్షిణదేశము దక్షిణాపథ మను ప్రమాణ గలదు. దీనివలన ఆంధ్రప్రాభవవ్యాప్తి తెలియుచున్నది.

శాలంకాయన చర్చలో వీరు బప్పా భట్టారక ప్రశంస చేయుచు ఇది యొక పురుషనామము కాదనియు, సామాన్యముగ దండ్రివలె గౌరవవాచకముగ నుండు నన్నారు. బప్పామహారా జొక డుండినటుల కొన్ని ఇతరాధారములవలన తెలియుచున్నది. నెల్లూరుజిల్లాలోని వెంకటగిరిసమీపమున బొప్పాపుర మను గ్రామమును గలదు. మన కాలముననే తిరువాన్కూరు సంస్థానమున దివాన్ పేష్కారుగ నుండిన ప్రసిద్ధపురుషులగు నాగమయ్యాగారి యింటి పేరు బొప్పావారు. ఇట్టి యుదాహరణముల సహాయముగ నీ 'బొప్పా'శబ్దము కేవలగౌరవవాచకముగాక యొకానొక ప్రసిద్ధపురుషుని పేరుగ నుండును. బొప్పామహారాజు పేరు శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారి ఆంధ్రుల చరిత్రమునను దగులుచున్నది.

వీరు శాసనగతములగు వంశవృక్షములను, కాలనిర్ణయములను కంట వత్తిపెట్టుకొని శోధించి న్యూనాతిరిక్తముల చక్కబరచి సమన్వయముల జేయుచు వచ్చిరి. ఈ విషయమున వీరు చేసిన పరిశ్రమ అమేయముగ నున్నది. ఇక ప్రాచీనగ్రామములయొక్కయు, విషయములయొక్కయు (జిల్లాలు, సీమలు) నామరూప వివరణములను నిర్ణయించి అవి ఇప్పటి యేయే గ్రామములు, విషయము లగునో అది యంతయు సశాకుపరీక్షవలె శోధించి వానివాని ఐక్యములను రూఢిజేసియున్నారు. స్థాలీపులాకన్యాయమున నొకటిరెండు చాలగలవు. పాకనాటి నిర్ణయ మొకటి. కమ్మనాటికి పాకనాటితో ఐక్యము సాధించినారు. కమ్మశబ్దము క్రముకశబ్దవికారమని దాని పరంపరనంతయు జూపిరి. క్రముక మనగా వక్క. వక్కయేగదా పోక. 'పోకా'శబ్ద ముచ్చారణసౌలభ్యముకొరకు పాక అయినది. గ్రామనామములలో ఇప్పటి ఒంగోలును పోకళ్ళు

సాజాత్యమని సాధించిరి. ఇది చిత్రముగ నున్నది. ఒంగోలు అనుట పోస్టాఫీసు రికార్డుమున నేర్పడి యుండును. వాడుకలో సంసారులు సంగవోలు అనుచుందురు. సంగవోలు=సంగప్రోలు. సంగశబ్దము తెలుగయినయెడల సంకాయపర్యాయముగ నుండును. సంస్కృతమునకైనచో తగరము, లేక సత్తుపర్యాయముగ నుండు నొక లోహము. తగరముగాని, సత్తుగాని ఈ సంగవోలుప్రాంతముల నెన్నడుగాని దొరకినటుల ఎవరును చెప్పుటలేదు. సంకాయలపాడు, గుమ్మడిపూడి, ఆముదాలపాడు లోనగు గ్రామనామములవలె అన్వర్థమై సంగమొక్కలు విశేషముగ వేయబడుచుండు గ్రామ మయియుండునేమో. తూర్పున సముద్రము; పశ్చిమట-నల్లమలకొండలు; ఉత్తరమున ఇప్పటి గుంటూరుజిల్లా దక్షిణభాగము (అనగా ఒంగోలు తాలూకా నరసారావుపేట తాలూకాలు); దక్షిణమున నెల్లూరుజిల్లాలోని పొదిలితాలూకా, కందుకూరుతాలూకాలు. ఈ యెల్లల నడుమ గుండ్లకమ్మనదికి ఇరుపార్శ్వములను ఉండు భూభాగము పాకనాటివిషయముగ నుండు నని వీరి అభిప్రాయము. ఈ పాకనాటికే పూంగినాడనియు, పూగినాడనియు, పూంగనాడనియు, పూగనాడనియు ఇన్నివిధముల వ్యవహారముండినది. ఈ రాష్ట్రమునకే క్రముకరాష్ట్ర మనియు పేరుండెనట. ఈ రాష్ట్రముయొక్క ముఖ్యపట్టణమునకు బహుశః పూంగప్రోలు అని పేరుండి అదియే కాలక్రమమున పామరజనమునోట ఇప్పటి 'ఒంగోలు' అయియుండు ననిరి. పూంగప్రోలు శబ్దమునకు ప్రాకృతభాషాసమముగాని, పైశాచిభాషాసమముగాని 'ఒఙ్గోలు' (Ongole) కావచ్చుననియు, తెలుగుమారి ఆ 'ఒఙ్గోలే' నేటి 'ఒంగోలు' అయియుండు ననియు దెలిపిరి. ఈ పూంగినాడు అను పాకనాటికి క్రముకరాష్ట్ర మని నామాంతరము. ఈ క్రముకరాష్ట్రవికారమే కమ్మనాడు. పూగి, పూంగి, పోక, పాక, క్రముక ఇత్యాదులు వక్కచెట్టుపేళ్ళు. ఇట్టి పాకనాటిని "వైరికపు పిల్లి! ప్రతిపలకవే అంటే ప్రేమకన్న"దను సామెతవలె "ప్రాఙ్నాడు" అనుచున్నారుగాని ఇది సరియైన వర్ణక్రమము కాజాలకయుండుటయేగాక సమాసమును ఏర్పడజాలదు. ప్రాఙ్నాడనగా తూర్పుదేశమని యర్థమగును. అది సరికాదు. పాకనాడనుట ప్రాచీనచరిత్రాంశముల కొప్పినది. ప్రసిద్ధమగు శ్రీనాథుని చాటువునందును "పాకనాడింటివాడవు బాంధవుడవు" అని యున్నదేగాని ప్రాఙ్నాడు లేదు.

ఈ పేళ్ళ మార్పులవిషయమున వినుకొండగూడ ఒక యుదాహరణము కాగలదు. ప్రాచీనమగు "విష్ణుకుండి"శబ్దమే వినుకొండగ మారి నిలిచిన దనిరి. ఇట్టి నామైక్యములు పెక్కులు సాధించిరి. గుండ్లకమ్మ యను నదికి బ్రహ్మకుండి యనియు, కుండి యనియు, కుండిప్రభా యనియు శాసనగతములగు పేళ్ళుండినటుల దెలిపిరి. నెల్లూరికడ నుండు ఉత్తరపినాకినీనదికి 'సుప్రయోగా'యను ప్రాచీననామ ముండినటుల మహాభారత, మార్కండేయపురాణ, బ్రహ్మాండపురాణ, వాయుపురాణ, మత్స్యపురాణ ప్రమాణముల జూపియున్నారు. సుప్రయోగాపినాకినీల యైక్యమును మొదట పండిత శ్రీ వేటూరు ప్రభాకరశాస్త్రిలవారు భగవదజ్జుకమున వెలువడించి రనియు దెలిపిరి.

గ్రామాదుల పేళ్ళనుగూర్చి చర్చించుటలో గుంటూరుజిల్లాలోని చేబ్రోలునుగూడ నొక యుదాహరణముగ జేసిరి. ప్రాతకాలమున దీనికి చేంబ్రోలు అనియు, తాంబ్రప్రస్థాన మనియు పేళ్ళుండినవట. 'చెంబు'అనగా ఎఱ్ఱని లోహము; దీని రూపాంతరమే 'కెంపు'. ఇత్తడి, కంచు లోనగువానివలెగాక రాగి స్వతంత్రమయిన ఖనిజము. అందుచేత ఇత్తడి, కంచు లోనగు మిశ్రలోహములు ఏర్పడుటకు ముందునుండి రాగియే విశేషవాడుకలో నుండి పాత్రసామానులు ఆ లోహముతోనే చేయుచుండిరి. ఆ కారణముచేతనే రాగిపర్యాయమయిన 'చెంబు'శబ్దము చెంబు అని మనము వాడుకొను పాత్రకు పేరై రూఢిఅయినది. మనమేకాదు, అరవవారును చెంబు అనియే ఆ పాత్రను చెప్పుదురు. హిందీయుర్దూభాషల వాడుకొను జాతులవారును మనము చెంబు అను పాత్రను 'తంబాలు' (తమాలు)అని తామ్రశబ్దవికృతిని నిలుపుకొని యున్నారు. (తాంబాళముగూడ నీజాతిలోనిది కాబోలు) అయితే ఆ గ్రామమునకు 'చేంబ్రోలు'

గాగియూరు అని పేరు వచ్చుటకు కారణ మేమో? పూర్వకాలమున నాప్రాంతమున రాగిగను లుండినవి కాబోలు. చేంబ్రోలు చేబ్రోలు అగుటయు, అక్కడ నుండి చేబోలు అగుటయు సుబోధకముగనే యుండ గలదు. (పుట ౨౨౫.)

ఇట్టి నామైక్యసాధనకు అక్షరసామ్యము ముఖ్యాధారముగ నగపడుచున్నది. ఇట్టి అక్షరసామ్యము నాధారపరచుకొని ఈ గ్రంథకర్తగారు గ్రీసు దేశస్థుడును, క్రీ. శ. ౨వ శతాబ్దమధ్యమున వర్ధిల్లిన టోలమీ (Ptolemy) యను శాస్త్రజ్ఞుని భూగోళవివరణమున ఉత్తరపినాకినీముఖద్వారప్రాంతముల "కొట్టిస్" అను గొప్ప యోడరేవుండినటుల జెప్పగా ఆ "కొట్టిస్" శబ్దమును పినాకినీముఖద్వారమునకు దాదాపు ఎనిమిది ఆమడ లుత్తరమునను, ఒంగోలునకు దాదాపు ఎనిమిది మైళ్ళు తూర్పునను సముద్రతీరమున నుండు కొత్తపట్టణముతో ఐక్యపరిచినారు. కొత్తపట్టణమునకు టోలమీ కాలమంతటి ప్రాచీనత్వము కలదా? ఇది కసుబా గ్రామమును కాదు. అక్కడికి రెండుమైళ్ళ దూరమున నుండు అకుల అల్లూరి మజరాగా నున్నది. ఒంగోలు ప్రాంతముల జనుల నానుడిమాటలలో నీ కొత్తపట్టణము ఒంగోలు మందపాటిరాజుల పరిపాలనములో నుండిన కాలములో ఏర్పడినటుల తెలియుచున్నది. మందపాటి రాజ్యపాలనకాలము దాదాపు ఇన్నూరేండ్లనాటిదిగ నుండవచ్చును.

ఆంధ్రము (ఆంధ్రము) ను, తెనుగు (తెలుగు) ను ఎట్లు సమానార్థకములై ఏకవస్తుద్యోతకము లయినవియో స్పష్టపడలేదు. ఆంధ్రము సంస్కృతశబ్దము; తెనుగు అచ్చుతెనుగుమాట. అవయవార్థమున నీ రెండుశబ్దములకు ఐక్యము నూహించుటకు "తెనుగు" తేనెవలె మధురమైన దని కాని, లేక "తెన్" అనగా దక్షిణముగాన దక్షిణమున వ్యాప్తికలిగిన దనిగాని అనుకొనినను ఆంధ్ర (ఆంధ్ర) శబ్దమునకు మధురపర్యాయమగు నర్థముగాని, దక్షిణపర్యాయమగునదిగాని రూఢిఅయియున్నవియా? అయితే ఆంధ్రము, తెనుగు అను రెండుపదములును సమానార్థకములయి ఏకార్థబోధకములయి యుండుటను వాగను శాసనుడును, కవిబ్రహ్మయు అంగీకరించినటుల వారల భారతమే ప్రమాణ మగుచున్నది. ప్రస్తుత గ్రంథకర్తగారును ఆంధ్రతెలుగుల ఐక్యము నొప్పియున్నారు. అయితే యేవిధముగగాని, యేకారణములచేతగాని యీ యైక్యము కుదిరినదియు తెలిపినటుల లేదు. ఏది ఆంధ్రమండలమో యందలి జనముయొక్క మాతృభాష తెలుగగుటచేత ఇది యొక లక్షణావృత్తిమూలమున ఆంధ్రమండలమునకు తెలుగునాడు (తెలింగాణా) అను పేరేర్పడియుండునా? తెలుగుబాసయందు లకారనకారము లొండొంటి స్థానములను మార్చుకొను చుండునని యొక పాదటీక (foot-note) యందు వీరు తెలిపియున్నారు. "లేత" యను పదమును ఉత్తర తెలుగు జిల్లాలోనివారు "నేత" యనుట గలదు. అది యెటులయ్యు నుండుగాక. సంస్కృతపదమగు నాంధ్రశబ్దమునకు "తెలుగు" శబ్ద మెట్లు పర్యాయపద మాయెనో?

ఈ గ్రంథమున చేర్కొనబడిన ఆంధ్రరాజులనేకులు అనేకాశ్వమేధములను, రాజసూయములను, మరియు నితరశ్రౌతక్రతువులను జరిగించినటుల ఈ గ్రంథము వలన దెలియుచున్నది. రాజసూయ మనగనే మహాభారతమునందలి ధర్మరాజరాజసూయము మొదలు గొప్ప యుద్ధ మొకటి ఆసన్నమై యుండెడిది. ఈ యాంధ్రసామ్రాజ్యపు సంగతియు నిందుకు విరుద్ధమైనదిగాక దీనియందును యుద్ధప్రక్రియలు దగులుచునే యుండినటులున్నది. ఇక అశ్వమేధమున నొక గుఱ్ఱమును విచ్చలవిడిగా విడిచి దానినడ్డగించినవారిపై యుద్ధము సాగించి దిగ్విజయము జేయవలసియుండగా ఈ యాంధ్రాశ్వమేధయాజులు దిగ్విజయము లెట్లు జేసిరోగదా! వీరు లోకోత్తరవీరులై అజేయులై యుండి రనుకొనవలయునా?

ప్రాచీనాంధ్రరాజులలో కొందరు శైవాభిమానులుగను, కొందరు వైష్ణవాభిమానులుగను నుండువారు. వారివారి మతాభినివేశములు వారివారి బిరుదావళులందు విదితము లగుచుండెడివి. శైవమతాభిమానులు పరమమాహేశ్వరులనియు, ఖట్వాంగ ధ్వజులనియు, వైష్ణవాభిమానులు పరమభాగవతులనియు తెలుపబడుచుండిరి. కొందరు "పరమబ్రహ్మణ్య" యను బిరుదమును వహించుచుండెరి. నలమహారాజు "బ్రహ్మణ్యుండై

బ్రహ్మోత్తరంబుగా ప్రజాపాలనము చేసినటుల వన్నయభట్టారకుడు భారతాంతర్గతనలచరిత్రమున దెలిపి యున్నాడు. బ్రహ్మణ్యు డనగా బ్రాహ్మణాభిమానియని యుండును. వారివారి మతాభిమానము లెట్టివైనను చోళపాండ్యుల కాలములందువలె ఆంధ్రులలో నంతగ మతద్వేష మగపడదు. కొందరు రాజులు బౌద్ధమతము నభిమానించి బౌద్ధులయినట్లును కలదు. (పుట ౫౬-౫౮)

గ్రంథమున ఒక్కొక్క ఖండము ముగియగనే సింహావలోకనముగ నా ఖండములోని ముఖ్యాంశములు సంక్షేపముగ వ్రాయబడియున్నవి. శాతవాహనులనుగూర్చి ప్రత్యేకముగ నొక ఖండ మీ గ్రంథమున లేకపోయినను పల్లవులకు పూర్వ మాంధ్రసామ్రాజ్యము వీరిదిగనే యుండినటులును, పల్లవులు వీరివెనుక ఆంధ్ర సామ్రాజ్యము నధిష్ఠించిరనియు, వీరికాలననే కాంచీపురము ప్రసిద్ధమైన దనియు తెలుపబడియున్నది. పల్లవు లేలిన రాజ్యము కొన్ని రాష్ట్రములుగ విభజింపబడి యుండినదనియు, ఒక్కొక రాష్ట్రముపై వ్యాపృత డను అధికారనామము గల అధికృతు డుండె ననియు, ఒక్కొక రాష్ట్రమును కొన్ని భోగములు, లేక విషయములుగ విభజింపబడియుండిన దనియు, ఒక్కొక భోగ మనేకగ్రామముల గలిగియుండినదనియు, కొన్ని కొన్ని గ్రామములకు ఇపుడు మనము కస్బాగ్రామము, మజరాగ్రామము అనినటుల గ్రామములకు కొన్నిటికి గ్రామటికము లను పేర మజరా లుండిన వనియు, అగ్రహారములు, దేవభోగము లీ గ్రామములో పరిగణింపబడక వేరుగ లెక్కింపబడుచుండిన వనియు, గ్రామాధికారులే యీ గ్రామముల సీమానిర్ణయములను చక్కగ జేసియుంచవలయు ననియు, గ్రామాధికారులు అధికృతుడు, ఆయుక్తకుడు, నైయోగికుడు, రాజవల్లభుడు లోనగు పేర్ల బరగుచు వారివారి అధికారములను పరస్పరవిరోధములు లేకుండ సాగించుచుండి రనియు, రాజులు చేయు భూదానము లోనగువానిని దెలుపు శాసనాదులు రహస్యాధికృతు డను మంత్రి వ్రాసి సిద్ధముచేయుచుండె ననియు, సాధారణముగ పైన జెప్పబడిన రాష్ట్రముల పరిపాలకులును (Rulers), సేనాధిపతులును రాజకుమారులు (Royal princes` గ నుందు రనియు, బ్రహ్మదేయదేవభోగప్రదేశములలోనికి సేనలు ప్రవేశింపకూడదనియు, ఉప్పుమీదను, చక్కెరమీదను పూర్ణాధికారము (మొనాపొలి) రాజుదిగ నుండిన దనియు, రాజులు రాజధర్మముల నెరిగి పరిపాలించుచు, ధర్మమహారాజనియు, ధర్మమహారాజాధిరాజనియు, ప్రజాశ్రయు డనియు, ప్రజారంజనపరిపాలనోద్యోగశత సత్రవ్రతదీక్షితుడనియు లోనగు సార్థకములగు బిరుదములు వహించుచు బహుదీర్ఘకాలములు దేశక్షేమ ప్రజాక్షేమ తత్పరులై రాజ్యభారముల నిర్వహించిరనియు తెలుపబడి యున్నది.

త్రిలింగశబ్దభవము తెలుగు అని యొక సిద్ధాంతము కలదు. ఆ త్రిలింగములు శ్రీశైల దాక్షారామ కాళహస్తిక్షేత్రము లని అప్పకవీయాదులు చాటుచున్నవి. ఈ గ్రంథకర్తగారి మతమున మూడవ లింగస్థానము కాళహస్తి కా దనియు, అది గోదావరీతీరమున నుండు కాళేశ్వర మనియు జెప్పిరి. శాతవాహనులు ఆంధ్రసామ్రాజ్యము నేలిన ప్రాతకాలమున ఆంధ్రదేశపు భాష ప్రాకృతభాషలలో జేరిన పైశాచిభాష ననుకరించినదై తద్వికారముగ నుండు ననిరి. ఆ పైశాచి వికృతియే నేటి జానుతెనుగై దేశభాషలందు లెస్సయై వెలుగుచున్నది. (డాక్టరు చిలుకూరు నారాయణరావుపంతులు గారును తెలుగుభాషాపూర్వోత్తరములను విచారించుచు తెలుగు పైశాచీభవమనిరి.) పైశాచీమిశ్రణము లేకుండ తెలుగుభాష క్రీ. శ. వార్గశతాబ్దమున నుండి అగపడుచున్నది. (పు. ౭-౯౪)

నాగార్జునకొండ ప్రాచీనాంధ్రదేశవిషయముల కొక కల్పవృక్షముగ నున్నటుల భావింపబడుచున్నదని ఇందు సూచింపబడియున్నది. నాగార్జునకొండ ఐక్ష్వాకప్రాభవముగూడ బయలుపడినది. ఏదియైన ప్రాతకాలపు విషయము ప్రసక్తమయినప్పుడు "ఓయబ్బ! ఇది ఇక్ష్వాకులనాటినుంచి యుండునదిరో" యను చాటువయు తెలుగుదేశమున గల దనిరి. ఈ నానుడి యే జిల్లాలో నున్నదిసుమా ?

పల్లవులకు బ్రాహ్మణాంకము వీరు సాధించి యున్నారు. అలాగుననే పల్లవపూర్వవర్తులయి ఆంధ్ర

దేశమున విరాజిల్లిన శాతవాహనులకు బ్రాహ్మణత్వము స్థాపించియున్నారు. (పు. ౩౬) శాతవాహనులలో మొదటివాడగు శాంతమూలుడు తన పేరునకు వాసిష్ఠీపుత్ర యని చేర్చుకొనుటయు, ఈతడు మాతరిగోత్రజురాలైన యొక బ్రాహ్మణస్త్రీని పెండ్లాడియుండుటయు నిందు కాధారములుగ జూపబడినవి.

విష్ణుకుండినవంశమున ప్రసిద్ధుడుగ నుండిన దేవవర్మ యను పురుషుడు తన బిరుదావళిలో "క్షత్రియావస్కందప్రవర్తితాప్రతిమవిఖ్యాతపరాక్రమస్య" అను నొక బిరుదునుగూడ వహించియుండుటచే ఈ విష్ణుకుండినులు క్షత్రియజాతికంటె ఉత్తమజాతివారనియు అర్థాత్ ప్రథమదశలో బ్రాహ్మణులుగ నుండియుండు రనియు ఊహింపబడియున్నది (పుట ౪౨౩).

పల్లవరాజులు ప్రాచీనదానశాసనములలో కొన్ని సర్వమాన్యాగ్రహారములుగ దానముచేయుచు అట్టివానిపై పదునెనిమిది ఫణాలవారి కట్టళ్ళ బాధయు లేకుండ నిచ్చినట్లున్నది. పదునెనిమిది ఫణాలవారనగ ఈ లి మొగలాయి ప్రభుత్వములోకూడ 'అఠారాబలుతా' అను పద ముండెనది. ఈ పదునెనిమిదియు గ్రామాధికారులు చాకలి మంగలి వెట్టి కుమ్మర వడ్రంగి పంచాంగి మొదలగునవి. వీరి పనులుగూడ దేవభోగబ్రహ్మదేయములపై మన్నింపబడియుండిన వట (పుట. ౨౪౯ ౩౧౨).

పల్లవసామ్రాజ్యచర్యయందే క్రీ. శ. ఆరేడు శతాబ్దప్రాంతములనాటి దశకుమారచరిత్రకారుడగు దండియొక్కయు, కిరాతార్జునీయకర్తయగు భారవియొక్కయు ప్రస్తావన వచ్చియున్నది.

విమర్శకదృష్టితో నే నీవ్యాసము నుపక్రమించినవాడను గాను. ఆంధ్రులనుగూర్చిన విషయములపై ఒక పంజాబీయుడో, యొక బంగాళీయో, యొక మహారాష్ట్రుడో, ఒక ద్రావిడియో, యొక ఆంగ్లేయుడో, జర్మనో, ఫ్రెంచియో చెప్పిన విషయముల నాధారపరచుకొనుచుంటిమి. తెలుగునాట బుట్టి తెలుగుతల్లి యొడిలో పెరిగి తీరిన తెలుగు యొడయు లొకరు ఇంతకాలమున కాంధ్రుల చరిత్రము నధికరించి యుద్గ్రంథ మొకదానిని రచియించినందుకు కడు సంతసించి వారి యుద్యమమున కొక చిన్న కానుకగ దీనిని వ్రాసితిని. ఇందలి న్యాసాతిరిక్తములు నావియే. ఈ గ్రంథము వలన ఆంధ్రుల విషయములగూర్చి ఆంధ్రుల కాంధ్రుడే దేశికుడై వెలయుచున్నాడు. ఒక్క యుదాహరణము చాలును. విష్ణుకుండినవంశములోని రెండవ మాధవశర్మగారి రాజ్యకాలము ౨౬ ఏండ్లా, లేక ౪౬ ఏండ్లా, లేక ౧౬ ఏండ్లా యని నిర్ణయించుట కాధారమయిన శాసన మొకటి కలదు. అందా రాజు రాజ్యకాలపరిమితి అక్షరములలో, లేక అంకెలతో నున్నది. ఆ యంకెలలో '౬' స్పష్టముగ నున్నది. మరియొకటి ౨౦ యా, ౩౦ యా, ౧౦ యా యను సందేహము కలిగినది. బంగాళీ శోధకు లొకరు '౧౦' యని నిర్ణయించిరి. జర్మనీ శోధకు లొకరు '౩౦' యనిరి. ఆంధ్రులగు మన గ్రంథకర్తగారు '౨౦' అని తీర్మానించుచు ఈ యంకెలపై సమ్మెటప్రేటులు లెస్సగ పడియున్నను ఇరువదియని తెలుపగల యంకెల జాడలు స్పష్టముగ తెలియుచున్నవని చెప్పగలిగిరి. (పుటలు ౪౦౫-౪౧౯-౪౪౨ చూడుడు.) ఇటులనే పరులు భిన్నాభిప్రాయగతు లయిన పలుతావుల వీరు ఇదమిత్థమని నిర్ణయించియున్నారు.

# ప్రేమ

శ్రీ నాళము కృష్ణరావు

గిరులమీదను, మబ్బుదొంతరలలోన,
కడలితరగలయందును, గహ్వరముల,
భూమిగర్భములోపల ప్రేమ జొచ్చు;
ప్రేమ చొరలేని చోటులు భూమి గలవె?

కాననంబుల, తారకాగణములందు,
తరణి చంద్రులయందు, పాతాళమందు
ప్రేమ ప్రవహించు నల్లెడ; వేయుయేల?—
ప్రేమ చొరరాని తావులు పృథివి లేవు.

గాలి కవియని నెలవుల గవియగలదు;
ఇరులు దూరని యిరవుల దిరుగగలదు;
కవియు రవియు గానని చోట్ల గాంచగలదు;
వలపు చనలేని సీమలు వసుధ గలవె?

కొంద రందురు దానిని గ్రుడ్డి దంచు,
పిరికిపంద యటంచును పిచ్చిదంచు;
ఎందరెన్ని విధంబుల నెంచనిమ్ము—
వలపు వారింప నేరికి వశము కాదు.

కంచుతలుపుల నడుమ బంధించి, దాని
విచ్చుకత్తుల పహరాల బెట్టనిండు;
వాని నన్నిటి నిట్టె పటాపంచ చేసి
ప్రేమ విహరించు నిచ్చలు విచ్చలవిడి.

ఒడిసి పులిమీన ఉయ్యాల లూగవచ్చు;
కూడి చిలువతో చెలగాట లాడవచ్చు;
అలుగుమొనమీద నాట్యంబు సలుపవచ్చు;
తొడరి నిప్పులగుండాన దూకవచ్చు.

ప్రణయవాహినీవీచీపరంపరలను
అడ్డువెట్టుట కెవరికి తరముకాదు;
ప్రేమ యెక్కడ దృష్టి సారించెనేని,
శిల రెక్కలు గట్టుక వాలగలదు.

ప్రేమ దేవుండు, ప్రేమయే విశ్వమెల్ల;
ప్రేమయే సృష్టి కంతకు ప్రాణంబు;
ప్రేమ యను వస్తు వొకటి లోపించెనేని,
లోకమెల్లను నల్లకల్లోల మగును.

---




శ్రీ మావిడిపూడి వెంకటరంగయ్య

ఈ నెలలో మనము మనరాష్ట్రమునుండి సంచారము ప్రారంభము చేయవలసినదిగా ఉన్నది. రాజ్యాంగపరిషదధ్యక్షుడు జూన్ ౧౭ తేదీన ఒక ఉపసంఘమును నియమించి, భాషాప్రయుక్తరాష్ట్ర సిద్ధాంతానుసారముగా ఆంధ్ర, కర్ణాటక, కేరళ, మహారాష్ట్రములను ప్రత్యేకరాష్ట్రములుగ నిర్మాణము చేయుటకు వీలున్నదా? ఉజ్జాయింపుగా వాటి సరిహద్దులు ఏలాగు ఉండవలెను? వాటిని నిర్మించుట వలన ఏర్పడు ఆర్థికపరిపాలనఫలితములు ఎట్టివిగ నుండును?—అన్న విషయములను పరిశీలించి నివేదిక నొకదానిని సమర్పించవలసినదిగా కోరెను.

## ఆంధ్రరాష్ట్రము

అప్పటినుండి "ఆంధ్రరాష్ట్రము త్వరలోనే రాగలదా? అది ఎప్పుడు వచ్చును? దాని హద్దులేవి?" అను విషయములనుగురించి ఆంధ్రులలో కొందరు మాటలాడుకొనుట మామూలయ్యెను. కాని ఈ ప్రశ్నలకు ఎవ్వరును సమాధానము చెప్పదగిన స్థితిలో లేరు. ఉపసంఘము చేయబోవు విచారణలలో పాల్గొనుటకు ఆంధ్రసంస్థలేవియు ఇంకను కావలసిన ప్రయత్నములు చేయుచున్నట్లు అగుపడదు. త్వరలో ఆంధ్రరాష్ట్రము వచ్చునని అనుకొనుటకుకూడ అవకాశము కనుపించుటలేదు. ఉపసంఘనియామకము జరిగినంతమాత్రమున రాష్ట్రము సిద్ధించు నని నమ్ముట తెలివితేనితనము.

## అనవసర ఉపసంఘము

ఆంధ్రరాష్ట్రనిర్మాణమునకు వీలున్నదా అన్న విషయమునుగురించి ఆలోచించుటకు ఉపసంఘ మొకటి అవసరమే లేదు. భాషాప్రయుక్తరాష్ట్రసిద్ధాంతమును ఎన్నిసంవత్సరములక్రిందటనో కాంగ్రెసువారు అంగీకరించిరి. ఇప్పటికికూడ వారు ఆ సిద్ధాంతమును ఆమోదించుచునే ఉన్నారు. అట్టి స్థితిలో రాష్ట్రనిర్మాణమునకు వీలున్నదా అని వితర్కము చేయుటలో అర్థము లేదు. ఆచరణలో పెట్టుటకు వీలులేని సిద్ధాంతములు సిద్ధాంతములు కాజాలవు. నిజముగా కాంగ్రెసులో పలుకుబడి గల ప్రముఖులు కొందఱు ఆంధ్రరాష్ట్రనిర్మాణమునకు ప్రతికూలురుగ నుండుటవలననే ఇట్టి ప్రశ్న యొకటి పరిశీలించవలసివచ్చినది. ఈ విషయమై మన క్రొత్తగవర్నరుజనరల్ వైఖరి అందరికిని తెలిసినదే. నాలుగురోజులక్రిందట మద్రాసురాష్ట్రమునకు ప్రధానమంత్రియైన రామస్వామిరెడ్డియారుగారు హోసపేటలో ఉపన్యాసము చేయుచు, తానుకూడ భాషాప్రయుక్తరాష్ట్రవిభజనసిద్ధాంతమునకు అనుకూలుడైనను దానిని ఆచరణలో పెట్టుటకు ఇది తగిన సమయము కాదనియు, ఇంతకంటె ఎక్కువ ప్రధానములగు విషయములను ఆలోచించుటయందు కాంగ్రెసుప్రభుత్వమువారు నిమగ్నులై ఉన్నారనియు, కాశ్మీరము, హైదరాబాదుసమస్యలు పరిష్కారమగువరకు భాషారాష్ట్రనిర్మాణమును వాయిదావేయుట అవసర

మునియు, చిన్న చిన్న భాషారాష్ట్రముల నేర్పరచుట అసందర్భమనియు, అట్టి రాష్ట్రములకు పరిపాలన ఖర్చులు భరించుటకుకూడ శక్తిసామర్థ్యము లుండ వనియు, స్వలాభపరులును ఉద్యోగకాంక్ష గలవారును అగు పట్టణములలోని కొందరు ధనికులుమాత్రమే ఇట్టి విభజనను కోరుచున్నా రనియు, సామాన్యప్రజలందరు దీనిని కాంక్షించుచున్నారని అనుకొనరాదనియు ఉద్ఘాటించిరి. దీనినిబట్టి ఆంధ్రరాష్ట్రనిర్మాణవిషయమై అధికారవర్గములో ఎట్టి అభిప్రాయము ప్రబలియున్నదో స్పష్టము కాగలదు. ప్రధానమంత్రిపదవిలో ఉన్నవారు ఇట్టి అభిప్రాయమును వ్యక్తపరచుచుండగా, రాష్ట్రనిర్మాణము త్వరలో జరుగునని అనుకొనుట సాహసమే కదా? రెడ్డిగారి మాటలలో ఎంతటి పరస్పరవైరుధ్య మున్నదో అందరును ఊహించవచ్చును. సిద్ధాంతమునకు అనుకూలురట! కాని దానిని అమలులో పెట్టుటకు సమయము రాలేదట! సత్యము మాట్లాడవలె ననుట మంచి సిద్ధాంతమేకాని కాలానుసారముగ సత్యము మాట్లాడవలె నను వాక్యములో ఎంతటి అర్థమున్నదో అంతటి అర్థమే ప్రధానమంత్రిగారి వాక్యములలో ఉన్నది. సిద్ధాంతమందు వీరికి విశ్వాసము లేదు. కాని అట్లు చెప్పుటకు జంకుచు వారు ఈవిధముగ మాట్లాడుచున్నారు. వీరి మాటలలో మరియొక అసందర్భముకూడ ఉన్నది. కాశ్మీర, హైదరాబాదుసమస్యలు పరిష్కారమగువరకు మరి ఏవిషయములనుగురించియు ఆలోచించుటకు వీలు లేదట! ఈ సమస్యలు పరిష్కారమగుటకు కొన్ని తరములు పట్టును. ఇవి పరిష్కారమగుట యనగా హిందూమహమ్మదీయసమస్య పరిష్కారమగుటయే. కాని మహమ్మదీయులు ద్విజాతిసిద్ధాంతమును పూర్తిగ విసర్జించినప్పుడుగదా ఇది పరిష్కారమగుట! వారు దానిని విసర్జించినారని అనుకొనుటకు కారణము లేవియు కనిపించుటలేదు. అప్పటివరకు కాంగ్రెసు ప్రభుత్వమువారు తక్కిన సంస్కరణములను చేయకుండుట రాజనీతి కాదు. దానిమూలమున దేశములో వారికి గల పలుకుబడి తగ్గిపోవును: ప్రజలలో అసంతృప్తి వృద్ధిగాంచును. ఏ సంస్కరణమునుగురించి ప్రస్తావన వచ్చినను కాశ్మీర హైదరాబాదుసమస్యలు పరిష్కారమగువరకు వాటిమాట ఎత్తుటకు వీలులేదని జవాబు చెప్పుట అధికారులకు అలవాటైనది. ఈ విషయమును ఆంధ్రులందరు గమనించవలెను.

ఆంధ్రరాష్ట్రముయొక్క సరిహద్దులను ఉత్తరోత్తరా మరియొక సరిహద్దుసంఘము నిర్ణయించు ననియు, ప్రస్తుతము రాజ్యాంగపరిషదధ్యక్షుడు ఏర్పరచిన ఉపసంఘము ఈ సరిహద్దులను ఉజ్జాయింపుగా నిర్ణయించిన చాలు ననియు అధ్యక్షుడు సూచించియున్నాడు. 'ఉజ్జాయింపుగా నిర్ణయించుట' అన్న మాటలకు అర్థము లేదు. ఉద్రేకపూరితములైన వాదోపవాదము లన్నియు ఇట్టి నిర్ణయముచేయుటలోకూడ బయలుదేరును. కనుక ఈ విషయములో రెండే మార్గములు అనుసరణీయములు. ఇదివరకు కాంగ్రెసువారు ఏయే జిల్లాలను ఆంధ్రరాష్ట్రములో కలిపిరో, ఏయే జిల్లాలు ఆంధ్రరాష్ట్రకాంగ్రెసుకమిటీ అధీనమందున్నవో వాటినే ఆంధ్రరాష్ట్రముగ నిర్ణయించుటయు, వివాదాస్పదములగు ప్రదేశములనుగురించి సరిహద్దుసంఘము పరిష్కరించవలయు నని విధించుటయు ఈ మార్గములు. ఉజ్జాయింపుహద్దులను సూచించుటకు ఉపసంఘ మక్కరలేదు. గనుక ఉపసంఘము వారు పరిశీలించవలె నని రాజ్యాంగపరిషదధ్యక్షుడు చేసిన ఆదేశాలలో రెండు అనవసరములు. రాష్ట్రనిర్మాణమునకు వీలు తప్పక ఉన్నది; దాని ఉజ్జాయింపు సరిహద్దులను ఇదివరకే కాంగ్రెసువారు నిర్ణయించియున్నారు. కనుక ఏలాటి ఉపసంఘము లేకయే ఆంధ్రరాష్ట్రనిర్మాణము జరుగవచ్చును. వెంటనే జరుగదగిన పనిని ఆలస్యముగ చేయుటయే ఈ ఉపసంఘముయొక్క ఫలితము.

కంటనీళ్ళను తుడుచుటకై ఈ ఉపసంఘనియామకము జరిగినదని అనుకొనుటకు ఇంకొక హేతువుకూడ కలదు. ప్రత్యేకఆంధ్రరాష్ట్రమును నిర్మించు అధికారము గవర్నరు జనరలుది గాని రాజ్యాంగపరిషదధ్యక్షునిది కాదు. ఇంగనై నియమింపబడు ఉపసంఘమును అతడు నియమించుట సబబు. ఈ మార్గమును అనుసరించుటకు బదులు అధ్యక్షుడు ఉపసంఘమును నియమించుట కాలవిలంబనము చేయుటయేగాని వేరుకాదు.

రాజకీయరంగములో విపరీతమగు ఆందోళన లేనిది ఏ ఉద్దేశము సాధించుటకును వీలుండదు. ప్రజాస్వామ్యము గల దేశములలో ఇది మరింత అవసరము. ఆంధ్రులలో ఇంతవరకు రాష్ట్రనిర్మాణమునుగురించి నిజమైన ఆందోళన లేదు. రాష్ట్రనిర్మాణమునకు విరుద్ధముగ ప్రధానమంత్రియు, తక్కిన మంత్రులును మాటలాడుచున్నప్పుడు ఆంధ్రమంత్రులు నోరు మూసికొని ఉండుట; ఆంధ్రనాయకులు ఈ విషయమై ఇంతవరకు కలిసి పనిచేయకుండుట; శాసనసభలలోని ఆంధ్రులయందు ఇందునిమిత్తమై ఏలాటి సంచలనము లేకుండుట; ప్రజలు సభలు గావించి ఆందోళన చేయకుండుట—ఈలక్షణములను పరిశీలించినప్పుడు వెంటనే ఆంధ్రరాష్ట్రము రాగలదని చెప్పుటకు ఎవడు సాహసించును? కాశ్మీరుహైదరాబాదుసమస్య లున్నవని మన రాష్ట్రములోని మంత్రులుగాని, కేంద్రములోని నెహ్రూమంత్రివర్గముగాని వారివారికి అభిమానములైన సంస్కరణములను చేయుటలేదా? ప్రత్యేక ఆంధ్రరాష్ట్రనిర్మాణము వారి అభిమానమునకు గురిగాకయున్నది. అందుచేతనే అధ్యక్షుని ఉపసంఘనియామకము.

మొత్తముపైన ఆంధ్రులకు సంబంధించిన వ్యవహారములను న్యాయముగ పరిష్కరించుటయందును, వారి గౌరవప్రతిష్ఠను నిలబెట్టుటయందును ఆంధ్రమంత్రులు తగిన శ్రద్ధ వహించుట లేదనియు, శాసనసభలోని ఆంధ్రసభ్యులు ఔదాసీన్యమును వహించియున్నారనియు చెప్పకతప్పదు. చెన్నపట్టణములోని ఆంధ్రుల విద్యావిషయములో ఇది బాగుగ స్పష్టమగుచున్నది. ఇచ్చట నాలుగులక్షల ఆంధ్రు లున్నారు. కాని ఆంధ్రభాషలో విద్యను నేర్చుకొనుటకు తెలుగుపిల్లలకు ఎట్టి అవకాశములు లేకున్నవి. దీనికి తోడు ఈ మధ్య విద్యామంత్రియగు శ్రీ అవినాశలింగం చెట్టిగారు మద్రాసులో తమిళమే ప్రాంతీయభాష అని ప్రకటించిరి. క్రొత్తగా స్థాపింపబడిన స్త్రీల కళాశాలలో తమిళమునకు, మలయాళమునకు అవకాశములు కల్పింపబడినవిగాని తెలుగునకు కల్పింపబడలేదు. ఇట్టి అన్యాయములు ఎన్నో జరుగుచున్నవి. లేమకాఆఫీసులలో ఫారములన్నియు తమిళములోనే ఉన్నవి. కాని మన మంత్రులు ఈ లోపములను, అన్యాయములను చక్కబెట్టుటకు ఏలాటిప్రయత్నము చేయకున్నారు. శాసనసభ్యులుకూడ ఏమియు మాటలాడుటలేదు. అధికారమును నిలబెట్టుకొనుటయందుమాత్రమే మంత్రులకును, శాసనసభ్యులకును శ్రద్ధ ఉన్నదేగాని ప్రజల సౌకర్యములను వృద్ధిచేయుటయందు వారికి ఎట్టి ఆసక్తియు లేదని స్పష్టమగుచున్నది. ప్రజలలో చైతన్యముండినగాని ప్రజాస్వామ్యవిధానము సఫలము కాజాలదు. ఆంధ్రప్రజలలో అట్టి చైతన్యమింకను కనుపించు జాడలు ఏవియు లేవు.

విద్యాసంస్కరణవిషయమున శ్రీ అవినాశలింగంచెట్టిగారు ప్రకటించుచుండు మార్పులను పరిశీలించినప్పుడు మదరాసురాష్ట్రములోని మంత్రివర్గము సమిష్టిబాధ్యతవిధానము ననుసరించి ప్రవర్తించుచున్నదా అన్న విషయమై ఒక సందేహము కలుగుచున్నది. రాష్ట్రములందును, కేంద్రమందును మంత్రివర్గము లన్నియు సమిష్టిబాధ్యత గలవిగ నుండవలెనని అందరు అంగీకరించియున్నారు. ఏప్రభుత్వశాఖయందుగాని నూతనపద్ధతులను ప్రవేశపెట్టినపుడు దానికి సంబంధించిన బాధ్యతను మంత్రులందరు వహించవలసినదనియు, అందుచేతనే మంత్రులందరు ఒక ప్రధానమంత్రియొక్క నాయకత్వమున ఒకేకాలమున పదవుల నధిష్ఠించుటయు, అవసరమైనప్పుడు అందరును ఒకేకాలమున రాజీనామా ఇచ్చుటయు జరుగవలెననియు సమిష్టిబాధ్యతకు ప్రధానలక్షణముగ నున్నది. కాని ఈమధ్య హిందీభాషవిషయమై శ్రీ అవినాశలింగం చెట్టిగారు మొట్టమొదట ఒక ప్రకటనను చేసి తర్వాత దానినిమార్చిరి. మొదటి ప్రకటనలో హిందీభాష తమిళ జిల్లాలలోనివారు చదువవలసినది లేదనియు, ఆంధ్ర కర్ణాటక కేరళ జిల్లాలలోనివారే దానిని చదువవలెననియు చెప్పిరి. తర్వాత కొంతకాలమునకు ఈ విభేదమును రద్దుచేసి తమిళజిల్లాలలో కూడ హిందీభాషను చదువవలెనని ప్రకటించిరి. ఇదంతయు వారు వ్యక్తిబాధ్యత ననుసరించి చేయుచున్నారా, లేక మంత్రివర్గమంతటియొక్క సమిష్టిబాధ్యతమీద చేయుచున్నారా? అను విషయము విమర్శింపదగియున్నది. ఏ మంత్రికి ఇష్టము

వచ్చిన మార్పులు ఆ మంత్రి చేయుచున్నయెడల ఒక ప్రణాళిక ననుసరించి కాంగ్రెసుప్రభుత్వమంతయు నడవవలె నను విధానమును వదలివేయవలసివచ్చును. కాని ఇది ప్రజాస్వామ్యవిధానమునకు విరుద్ధమైనది. ఎన్నికల సమయమందు కాంగ్రెసుపక్షమువా రొక ప్రణాళికను ప్రకటించుటయు, దానిప్రకారము తాము పరిపాలించునట్లు వాగ్దానముచేయుటయు, ఆకారణము చేత ప్రజలు వారిని ఎన్నుకొని అధికారములో ఉంచుటయు జరుగవలె నని అందరు చెప్పుచున్నారు. కాని ఏ మంత్రికి తోచినట్లు ఆ మంత్రి ప్రవర్తింపసాగిన యెడల ప్రజాస్వామ్యమునకు బదులు నిరంకుశపాలనము ఏర్పడును. శ్రీ అవినాశిలింగం చెట్టిగారి పద్ధతులు ఈ మార్గమునే అనుసరించుచున్నవి.

ఈ దోషము మంత్రులందరిలోకూడ కొంతవరకు కనుపించుచున్నది. సామాన్యులు చేయు ప్రసంగముల కును, మంత్రులు చేయువాటికిని ఒక గొప్ప భేద ముండవలెను. మంత్రులు ఏ మాట లనిన ఆ మాటలను చెప్ప రాదు. ఏదైన ఒక సంస్కరణమునుగురించి వారు వారి అభిప్రాయమును వ్యక్తపరచినపుడు అది మంత్రివర్గ మంతయు కలిసి ఆలోచించి తేల్చుకొన్న అభిప్రాయముగ నుండవలెను. అది ఆచరణలో ఉంచుటకు తగిన దనియు, ఉంచబడు ననియు తేలిన అభిప్రాయముగ నుండవలెను. కాని మన మంత్రులు ఈ క్రమము ననుసరించుట లేదు. ప్రజలలో ఏవేవో ఆశలను కల్పించుట వారికి మామూ లగుచున్నది. మంత్రులు చెప్పు మాటలు వ్యర్థములు కావనియు, అవి కార్యరూపమును పొందుననియు ప్రజ లనుకొనుటలో ఆశ్చర్య మేమియు లేదు. "దున్నినవాడిదే భూమి" అను సూత్రము తాము అనుసరించుటకు సిద్ధముగా ఉన్నట్లు సంవత్సరమునుండి ఇప్పటి మంత్రులలో అనేకులును, ముఖ్యముగ రివిన్యూమంత్రియు చెప్పుచు వచ్చిరి. కాని గతమాసములో కాంగ్రెసుఅధికార వర్గమువారు ఈ సూత్రమును అంగీకరించలే దనియు, భూస్వాములకు వ్యవసాయదార్లు ఇచ్చు శిస్తులు, మక్తాలుమాత్రమే నిర్ణయింపబడుననియు ఒక ప్రకటనను మారుమూలలలో ఎక్కడనో ప్రకటించిరి. కాని పైసూత్రమును పదేపదే మంత్రులు ఉపయోగించి నందున భూస్వాము లనేకులు సొంత వ్యవసాయమును ఆరంభించి రైతులకు జీవనోపాధి లేకుండ చేయ మొదలుపెట్టిరి. అనేకజిల్లాలలో రైతులు భూములను వదలిపెట్టుచున్నారు. భూస్వాములు బలాత్కరించియో, కోర్టులకు వెళ్లియో వారి భూములను స్వాధీనపరచుకొనుచున్నారు. చట్టవిరుద్ధములగు చర్యలు పెరిగిపోవుచున్నవి. తమ బాధ్యతను గుర్తించక మంత్రులు ఇష్టము వచ్చినట్లు ప్రసంగము చేయుటయే దీని కంతకు కారణము. మాటలాడినప్పుడుకూడ మంత్రివర్గ మంతయు కలిసి తీర్మానించుకొనిన అభిప్రాయములను, క్రియారూపము ధరించు అభిప్రాయములను వారు వ్యక్తపరచవలయునే గాని, గొంతెమ్మకోరికలవలె నుండు అభిప్రాయములను వ్యక్తపరచరాదు. ఆకాశములలో భవనములు కట్టు ప్రయత్నములో వా రుండరాదు.

## హై ద రా బా దు

ఇండియాహైదరాబాదులమధ్య జరుగుచుండిన సంప్రతింపులన్నియు భగ్నములైనవి. తక్కిన సంస్థానములవలె హైదరాబాదు ఇండియాలో చేరుటకు నైజాం ఇష్టపడడాయెను. అతనిని లొంగదీయుటకు దండముతప్ప ఉపాయాంతరము లేదని గతసంచికలో సూచించబడెను. రెండువిధములగు దండోపాయములలో యుద్ధోపాయమును ప్రయోగించుటకు ఇండియా ప్రభుత్వమువారు సిద్ధపడియుండలేదు. ఆర్థికదిగ్బంధము గావించి, ఏ వస్తువులుకూడ హైదరాబాదులోనికి వెళ్లకుండ చేయుటకు వారు ఏర్పాట్లు గావించుచున్నారు. ఇండియా హైదరాబాదులకు మధ్య రాకపోకలన్నియు ఇందుమూలమున స్తంభించిపోవును. అప్పుడు నైజాం ఇండియాప్రభుత్వమువారి షరతుల నంగీకరించు నన్న ఆశ కలదు. కాని యుద్ధము లేక ఈ ఉపాయ మొక్కదానితో అతనిని పూర్తిగ వశపరచుకొనుట సాధ్యమగునా అన్నది విమర్శించదగిన విషయము. ఆర్థిక స్తంభనమువలన బాధపడువారు హైదరాబాదుసంస్థానములోని హిందువులే. హిందువుల దుస్థా ణము లన్నిటికి సీళ్లు వేసి వాటిని వశపరచుకొనుట జరి

గను, వారి వశమందుండు ఆహారాదిపదార్థములనుకూడ సైజాంఉద్యోగస్థులు వశపరచుకొనెదరు. ఏదో ఒక విధమున హిందువుల సంఖ్యను తగ్గించి మహమ్మదీయుల సంఖ్యను వృద్ధిచేయుటయేగదా రజాకార్ల తత్వము. ఎందరు హిందువులు ప్రాణములు కోల్పోయిన అంత లాభము తమకు కలుగునని వారి అభిప్రాయము. అట్లు వినాశముగాంచిన హిందువుల స్థానములలోనికి ఇండియానుండి మహమ్మదీయులను రప్పించి, హిందువుల భూములను వారి కిచ్చి హైదరాబాదులో మహమ్మదీయులు అధికసంఖ్యాకు లగునట్లు చేయుటయే రజాకార్ల ఉద్దేశము. ఆర్థిక స్తంభనమువలన ఇట్టి పరిణామము తప్పదు. నష్టపడువారును, ప్రాణములు కోల్పోవువారును హిందువులే. కాని కాసరకు ఆర్థిక స్తంభన మొక్కటే దానిపైననే ఇండియాప్రభుత్వము వారు ఆధారపడియుండుట శ్రేయస్కరమా ? అన్న సంశయము కలుగకమానదు. రజాకర్లు సాయుధులై సరిహద్దుగ్రామములలో ప్రవేశించి దౌర్జన్యమును చేయుచున్నారు. అనగా వారు యుద్ధములోనికి దిగుచున్నా రని అర్థము. మన ప్రభుత్వము యుద్ధముచేయుటకు వెనుదీయుచున్నను వారు యుద్ధము ప్రారంభించుచున్నప్పుడు మన ప్రభుత్వము యుద్ధములోనికి దిగుట తప్పగలదా ? అట్టివారిని తరిమివేయుటకై మూడుమైళ్ల దూరము మన సైన్యములు హైదరాబాదులోనికి ప్రవేశించవచ్చునని మన ప్రభుత్వమువారు ఇటీవల నిర్ణయించిరి. అనగా కొంతవరకు ఇది యుద్ధ మారంభించుటయే. కాని ఈ దాగుడుమూతల యుద్ధము ఎంత కాలము జరుగగలదు ? తుదకు ఇది మామూలు యుద్ధ మగుట తప్పదు.

ఆర్థిక స్తంభనమువలన నష్టపడువారు హిందువులనియు, ఎప్పటికో ఒకప్పటికి యుద్ధము తప్పదనియు స్పష్టపడినప్పుడు వెంటనే యుద్ధమును ప్రకటించుట లాభకరమని అనేకులు అభిప్రాయపడుచున్నారు. భారతరాజకీయవేత్తలలో నొకరును, రాజ్యాంగపరిషత్సభ్యులలో ప్రముఖవర్గమునకు చెందినవారును అగు కుంజ్రూ ఈమధ్య ఇట్టి అభిప్రాయమునే తెలిపియున్నాడు. ప్రస్తుతము హైదరాబాదులోని హిందువులు పేరునకు బ్రతికిఉన్నారుగాని, వారు అనుభవించుచుండు బాధలకు మితిమేరలు లేవు. చావు తప్పనప్పుడు నానాబాధలు పడి చచ్చుటయా, యుద్ధమూలమున ఒకే దెబ్బకు చచ్చుటయా అన్నదే వారి సమస్య. ఇట్టి స్థితిలో మరి ఆలోచించక హైదరాబాదుతో యుద్ధమునకు దిగుటయే ఉత్తమమార్గమని తోచుచున్నది. యుద్ధములు, రక్తపాతములు లేక ధర్మమును స్థాపించుట వాంఛనీయమే. కాని అది సాధ్యము కాదేమో. ధర్మదేవతకూడ నరబలిని కోరెడువాడేమో. ౧౯౪౭ ఆగస్టు ౧౫ తేదీకిపూర్వము మతకలహములలో పంజాబు, బొంబాయి, బీహారు, బెంగాలు మొదలగు రాష్ట్రములలో ప్రాణములు కోల్పోయిన లక్షలాది ప్రజలు, ౧౫ తేదీ తర్వాత పాకిస్థానునుండి కాందిశీకులుగా ఇండియాలోకి ప్రయాణముచేయుచు యమయాతన లనుభవించి మృత్యువుపాలైన లక్షలకొలది పురుషులు, స్త్రీలు——వీరి మూలముననే మనకు స్వరాజ్యము లభించినది. స్వరాజ్యమును నిలబెట్టుకొనుటకు కూడ రక్తపాతము తప్పదేమో !

## బర్మా

ఒక మనదేశమందేగాక ఏషియాఖండపు దేశములన్నిటియందును ప్రస్తుతపు పరిస్థితులు అతిక్లిష్టములుగను, సంక్షోభహేతువులుగను ఉన్నవి. మనతోపాటు బర్మాదేశముకూడ కొంతకాలము బ్రిటిష్‌వారి పాలనకు లోబడి కొన్ని మాసములక్రిందట సర్వస్వాతంత్ర్యము కల రాజ్య మయ్యెను. కాని స్వరాజ్యము ప్రాప్తించిన నిమిషముననే తమ కష్టములన్నియు నివారణమగుననియు, తమ దేశము కలియుగవైకుంఠముగ మారుననియు అనుకొన్నవారు ఆదేశమందు మన దేశమందు ఉన్నట్లు అనేకు లున్నారు. కాని ఒక దేశములోని ప్రజ లనుభవించు కష్టములన్నిటికి పరాయిప్రభుత్వ మొక్కటియే కారణము కాజాలదు. అట్టి ప్రభుత్వము అంతరించినవెంటనే కష్టములన్నియు నివారణ మగునని అనుకొనుట ఒక భ్రమ. బర్మాలో అట్టి భ్రమకు లోనైనవా రనేకు లున్నారు. ఇతరదేశములలో ఉన్నట్లు అచ్చటకూడ కమ్యూనిస్టుపార్టీకి చెందినవారు కొందరు కలరు. వారు వారి పార్టీసిద్ధాంతముల నను

పరించి, ఈ భ్రమకు లోనైనవారి నందరిని చేరదీసి, అల్లరుల మూలమున ప్రభుత్వాధికారమును సంపాదించుటకు ప్రయత్నించుచున్నారు. ఈ పరిస్థితులను గమనించి జూన్ మాసముమధ్య బర్మాప్రధాని ఒక ప్రకటన చేయుచు తానుకూడ కమ్యూనిస్టుసిద్ధాంతములయందు అభిమానము కలవాడనియు, రష్యాతో సన్నిహితసంబంధ మేర్పరచుకొనుటకు సిద్ధముగ నున్నాడనియు, బర్మాలో సాహుకారీవిధానమును జమీందారీవిధానమును అంతరింపజేసి కర్షకులయొక్కయు, కార్మికులయొక్కయు సౌభాగ్యమును వృద్ధిచేయ సమకట్టియున్నట్లును చెప్పెను. బర్మా బ్రిటన్లమధ్య ఇదివరకు ఒక ఒడంబడిక జరిగియున్నది. బర్మావారికి బ్రిటిష్వారు కొంత ఆర్థిక సహాయము చేసియున్నారు. ఇంకను చేయుటకు సిద్ధపడియున్నారు. ఇట్టి పరిస్థితులలో బర్మాప్రధాని రష్యాదేశముతో సంబంధము కలిగించుకొనుటకు పూనియున్నాడన్న వార్త బ్రిటిష్అధికారవర్గములో కొంత ఆందోళన కలిగించెను. బర్మాకు తాము చేయదలచుకొన్న సహాయమును చేయుటకు వీలుండదను అర్థము స్ఫురించునట్లు బ్రిటిష్ప్రధానమంత్రి కొన్ని మాటలు చెప్పెను. బ్రిటిష్వారు బర్మాపరిశ్రమలలో అనేకకోట్ల రూపాయలను ఉపయోగించియున్నారు. ఈ మూలధనమంతయు పోవునేమో అన్న భయము వారిని పీడించుచున్నది. ఇదిగాక, ఇంగ్లండునుండి ఆస్ట్రేలియాకు వెళ్ళు మార్గమం దుండు దేశములన్నియు తమ అనుచరవర్గములో నుండుట బ్రిటిష్వారికి ఎంతో అవసరము. దీనికి అన్యథాగా బర్మావారు ప్రవర్తింతురన్న భీతి వారిని ఇప్పుడు పట్టుకొనియున్నది. కనుక రెండుదేశములమధ్య కొన్ని సంప్రదింపులు జరిగినవి. కమ్యూనిస్టుప్రభుత్వమును స్థాపించుటగాని, రష్యాతో సన్నిహితసంబంధము ఏర్పరచుకొనుటగాని తన ఉద్దేశము కాదని చెప్పి బర్మా ప్రధాని బ్రిటిష్వారికి కొంత సంతృప్తిని కలిగించెను. కాని ఆర్థికవిధానములో బర్మాదేశమందు సోషలిస్టుసిద్ధాంతముల ననుసరించిన మార్పు లనేకములు రానున్నవనియు, ఇవి వచ్చినగాని దేశమందు పరిస్థితులు నిలకడబడయజాలవనియు చెప్పవచ్చును.

## మలయా

గత రెండువారములమధ్య బర్మాకు పొరుగునం దుండు మలయాద్వీపకల్పములోకూడ సంక్షోభపరిస్థితులు ఏర్పడెను. ఈ దేశములో మలయాజాతివారికంటె విదేశములనుండి వచ్చిన చైనావారియొక్కయు, భారతీయులయొక్కయు సంఖ్య ఎక్కువ. ఇది బ్రిటిష్వారి పాలనలో నున్న దేశము. ఇందు రబ్బరు, తగరము చాల ఎక్కువగ దొరకును. ఈ పరిశ్రమలలో చాలభాగము బ్రిటిష్ సాహుకార్లయొక్కయు, చైనా వర్తకులయొక్కయు అధీనమం దున్నది. మలయాజాతివారు, భారతీయులు చైనావారిలో అనేకులు కూలి పని చేసి జీవించుచుండువారు. వారికి లభించు కూలి చాల తక్కువ. సాహుకార్లు విస్తారలాభమును గడించువారు. ఈ కారణముచేత కమ్యూనిస్టుఉద్యమము ఇచ్చట కొంత బలపడెను. సాహుకారీవిధానమును నాశముచేయుటయేకదా ఆ ఉద్యమముయొక్క ఉద్దేశము ! వారు జూన్మాసములో కార్మికులను ఉద్రేకపరచి, అల్లరులను లేవదీసి, సాహుకార్లనేకులను హత్యజేసి, శాంతిభద్రతలకు భంగము కలిగించిరి. వారిని అణచుటకు పోలీసులు సమర్థులు కానందున సైనికదళమును బ్రిటిష్వారు ఉపయోగించుచున్నారు. రెండవ ప్రపంచ యుద్ధకాలమందు మలయా జపాన్వారి స్వాధీనమయ్యెను. అప్పుడు అచ్చటి సామాన్యజను లనేకులకు ఆయుధములు లభించెను. బర్మా, ఇండో చైనా, ఇండొనీషియాలలోకూడ సామాన్యప్రజ లనేకులు ఆయుధోపేతులై అల్లరులలో సులభముగ పాల్గొనుచుండుట కిది యొక ప్రబలకారణము. మన దేశములోకూడ ఆయుధములను సంపాదించి దౌర్జన్యమునకు దిగుచుండు వారి సంఖ్య అధికమగుటకు ఇదియే కారణము. అల్లరులను అణచలేకపోయిరను కారణముచేత కాబోలు ఇదివరకు గవర్నరుగ నుండిన వానిని తొలగించి బ్రిటిష్ప్రభుత్వమువారు మరియొక గవర్నరును నియమించిరి. కమ్యూనిస్టుల ఉపద్రవము మరింత వృద్ధియగు సూచనలు కనపించుచున్నవి. వీరిలో అనేకులు చైనానుండి వచ్చినవారు. వీరిలో ఒక శాఖవారు సయాందేశములో పనిచేయుచున్నారు.

## ఇండో చైనా

శయాందేశమునకు ఆవల ఫ్రెంచిపరిపాలనకు లోబడిన ఇండోచైనాదేశ మున్నది. ఇదికూడ రెండవ ప్రపంచయుద్ధకాలమున జపానువారి వశమయ్యెను. వారికి పరాజయము కలుగునాటికి అచ్చట స్వాతంత్ర్యోద్యమ మొకటి బయలుదేరెను. దానిని లేవదీసి నథి హో అనువాడు నాయకుడైన వైట్‌మిన్‌పార్టీ— ఇతడు వైట్‌నాం ప్రజారాజ్యమును స్థాపించి దానికి అధ్యక్షు డయ్యెను. ఇదిగాక ఇండోచైనాలో (౧) కంబోడియా, (౨) కొచ్చిన్ చైనా, (౩) లేస్ అను రాష్ట్రములు మూడు గలవు. ఇచ్చట స్వాతంత్ర్యోద్యమము అంత బలవత్తరముగ లేదు. అందుచేత ఫ్రెంచివారు ఈ రాష్ట్రములపై తమ అధికారమును స్థాపించి, వైట్‌నాం ప్రజారాజ్యమునుకూడ వశపరచుకొనజూచిరి. కాని ప్రథమములో వారి కది సాధ్యము కాలేదు. అందుచేత వారు హోతో ఒడంబడిక చేసికొనిరి. తర్వాత క్రమక్రమముగ వారు వారి సైన్యములను, విమానబలమును వృద్ధిజేసికొని ఒడంబడికకు విరుద్ధముగ ప్రవర్తించి వైట్‌నాంరాజ్యమునుకూడ లోబరచుకొన తీర్మానించుకొనిరి. ఈ కారణముచేత సుమారు ౨౦ నెల నుండి హోకును, ఫ్రెంచివారికిని యుద్ధము జరుగుచున్నది. ఫ్రెంచివారికి కొన్ని విజయములు లభించినను వారు వైట్‌నాంను పూర్తిగ జయించలేకైరి. అందుచేత వారు భేదోపాయమును ప్రయోగించి, హో ప్రజలందరికిని నాయకుడు కాడనియు, అతని అధికారమును అంగీకరంచనివారు అనేకు లున్నారనియు, అతడు కమ్యూనిస్టుపార్టీవా డనియు, రషియావారికి మిత్రు డనియు ప్రచారము గావించి తుదకు అతనికి పోటీగా మరియొక ప్రభుత్వమును వైట్‌నాంలోని కొన్ని ప్రదేశములందు గతమాసములో స్థాపించి, దానితో సంప్రతింపులు ప్రారంభించియున్నారు. కాని ఈ ప్రభుత్వమును వైట్‌నాంలోని ప్రజ లెందరు అనుసరింతురో చెప్పజాలము. కాని తేలినది ఏమనగా— బ్రిటిష్‌వారు మన దేశములో చీలికలను ఏర్పరచినట్లు ఫ్రెంచివారు వారి అధికారమును నిలబెట్టుకొను ఉద్దేశముతో చీలికలను కల్పించుచున్నారు. కమ్యూనిస్టుల మూలమున కలుగనున్న ఉపద్రవమును అణచివేయుటయే తమ ఉద్దేశమని ఫ్రెంచివారు ప్రచారము గావించుచున్నారు. తమ సామ్రాజ్యాధికారమును నిలబెట్టుకొనుటయే వారి ప్రధానోద్దేశము.

## ఇండోనీషియా

ఇండోనీషియాలోకూడ పరిస్థితులు స్వాతంత్ర్యోద్యమమునకు ప్రతికూలము లగుచున్నవి. ఇచ్చట డచ్చివారు పరపాలకులుగ నుండి, రెండవ ప్రపంచ యుద్ధములో జపానువారిచేత దెబ్బలు తిని, దేశమును వదలి పారిపోయిరి. అప్పుడు స్వరాజ్యోద్యమ మచ్చట ప్రబలెను. యుద్ధము ముగిసినతర్వాత ఈ ఉద్యమ నాయకులు ఇండోనీషియన్ ప్రజారాజ్యమును స్థాపించిరి. తర్వాత కొంతకాలమునకు డచ్చివారు వచ్చి, వారి అధికారమును పునఃప్రతిష్ఠ చేసికొనుటకు యత్నించిరి కాని అది సఫలము కాలేదు. అందుచేత వారు ౧౯౪౭ మార్చిలో ప్రజారాజ్యాధికారులతో ఒడంబడిక చేసికొనిరి. కాని అటుతర్వాత వారు క్రమక్రమముగ వారి సైన్యములను వృద్ధిజేసికొని యుద్ధమునకు దిగి ప్రజారాజ్యములో కొంతభాగమును వశపరచుకొనిరి. అప్పుడు ఆ రాజ్యాధికారులు భద్రతా సంఘముతో సంబంధము కలిగించుకొని యుద్ధవిరమణము జరుగు ఏర్పాటులను గావించిరి. పేరునకు యుద్ధవిరమణము కలిగినేగాని డచ్చివారు యుద్ధము ఆపినవారు కారు. అందుచేత గత జనవరిలో ప్రజారాజ్యమువారు డచ్చివారితో ఒక ఒడంబడిక చేసికొని కొన్ని షరతులకు విధిలేక అంగీకరించిరి. ఈ ఆరునెలల నుండి డచ్చివారు అనేకకుట్రలు పన్ని, దేశమందు చీలికలను కల్పించి, చిన్నచిన్న రాజ్యము లనేకములను సృష్టించి, ప్రజారాజ్యముయొక్క బలమునకు ఎక్కువ నష్టమును కలిగించిరి. ప్రస్తుతము ప్రజారాజ్యము దుస్థితిలో ఉన్నది. కాని ఆ రాజ్యాధికారులు లొంగిపోవుటకు ఇష్టపడుట లేదు. గోరిల్లాయుద్ధమునకు సంసిద్ధులుగ నున్నారు. ఈమధ్య రషియాతో రాయబారములు కూడ చేసిరి. కమ్యూనిస్టులు కొంత ప్రాబల్యమును సంపాదించగలిగిరి. డచ్చివారు వారి సామ్రాజ్యాధికారమును వదలుకొనుటకు ఇష్టపడని కారణముచేతనే

ఇండోనీషియాయందు కమ్యూనిస్టుప్రచారము, అధికారము బలవత్తర మగుచున్నవి.

## చైనా

జూన్ మాసములో చైనాదేశమందు కమ్యూనిస్టులకు, జాతీయప్రభుత్వమునకు మధ్య జరుగుచుండిన అంతర్యుద్ధము మరింత తీవ్రరూపము ధరించెను. జాతీయప్రభుత్వసైన్యములు అనేకప్రదేశములందు పరాజయము గాంచి, అనేకపట్టణములను కోల్పోయెను. కమ్యూనిస్టులు బహుఉద్ధృతముతో యుద్ధము చేయుచున్నారు. వారి ధాటికి జాతీయప్రభుత్వము నిలబడ గలదా అను సంశయము పుట్టుచున్నది.

## కమ్యూనిస్టుల వ్యాప్తి

మొత్తముమీద ఈ నెలలో కమ్యూనిస్టుల వ్యాప్తి అధిక మయ్యెనని చెప్పవలసియున్నది. చైనాలో జాతీయప్రభుత్వము యొక్క అసామర్థ్యము, ఇండోనీషియా, ఇండోచైనా, మలయాలయందు సామ్రాజ్యతత్వము, బర్మాలో ప్రజల తొందరపాటు—ఈ ఆధిక్యమునకు ముఖ్యకారణములు. ఈ ప్రాబల్యమునకు మరియొక కారణముకూడ ఉన్నదని విమర్శజ్ఞులు ఊహించుచున్నారు. రషియావారు పశ్చిమయూరపులోను, పశ్చిమజర్మనీయందును వారి అధికారమును వ్యాపించుటకు చేసిన ప్రయత్నము లన్నియు ఈమధ్య విఫలము లయ్యెను. ఇటలీ ఎన్నికలలో కమ్యూనిస్టులకు సంపూర్ణాధికారము రాలేదు. ఫ్రాన్సులో కమ్యూనిస్టు పార్టీయొక్క ప్రాబల్యము వృద్ధియగు చిహ్నములు లేవు. పశ్చిమజర్మనీలో అమెరికా, బ్రిటన్, ఫ్రాన్సుల వారు వారి అధికారమును స్థిరపరచుకొనిరి. అందుచేత రషియావారు వారి దృష్టినంతను ఏషియాఖండములోని దేశములవైపు త్రిప్పి, బర్మా మొదలైన ప్రదేశములలోని కమ్యూనిస్టుపార్టీలకు ఎక్కువ సహాయము చేయుచు తీవ్ర ప్రచారము గావించుచున్నారు. అతికష్టముమీదగాని పశ్చిమయూరపులో సంపాదించుటకు సాధ్యముకాని అధికారము, ప్రాబల్యము ఏషియా ఖండపు దేశములలో సులభముగ సంపాదించవచ్చునని రషియావారు నిశ్చయము చేసికొని ఉన్నారు. వారి ఆర్థికసహాయము ఏషియాదేశములలోని కమ్యూనిస్టుపార్టీలకు ప్రస్తుతము ఎక్కువగ లభించుచున్నది. కమ్యూనిస్టులకు ఈదేశములలో ప్రస్తుతము గల ఆధిక్యమునకు ఇదియే ముఖ్యకారణము.

## మధ్యప్రాచ్యము

మధ్యప్రాచ్యములోని పాలెస్టయిన్ సమస్య శాంతియుతముగ పరిష్కారమగు సూచనలు కనుపించుటలేదు. యూదులు వారి ప్రత్యేకరాజ్యమును స్థాపించుకొనిరి. ఆ రాజ్యమును వినాశముచేయుటకు చుట్టుపట్లనున్న అరబ్బీరాజ్యము లన్నియు యుద్ధములోనికి దిగి, ఇరవైఅయిదు రోజులు యుద్ధముచేసినతర్వాత భద్రతామండలి ప్రతినిధియగు కౌంటు బెర్నడాట్ ఇరుపక్షములవారిని తాత్కాలికయుద్ధవిరామమున కంగీకరించునట్లు చేసెను. ఈ విరామము జూలై ౧౧వ తేదీతో అంతమగును. ఈ మధ్యకాలములో రెండుపక్షములవారు శాశ్వతమైన రాజీకి వచ్చునట్లు చేయుటకు బర్నడాట్ విశ్వప్రయత్నములను గావించుచున్నాడు. కాని రాజీ కుదురునని తోచదు. యూదులు రెండు ప్రధానషరతులవిషయమై పట్టుబట్టియున్నారు. వారు స్థాపించిన ఇస్రేల్ రాజ్యము స్థిరముగ నుండవలెననుట మొదటి షరతు; విదేశములలో నుండు యూదులు ఈ రాజ్యములోనికి నిరాటంకముగ వచ్చి కాపురము చేయగలిగియుండుట రెండవ షరతు. కాని ఈ రెండు షరతులకు తాము ఎన్నటికిగాని అంగీకరింపమని అరబ్బీరాజులు ఆర్గురు చెప్పుచున్నారు. ఒకవేళ వారంగీకరించదలచినను వారి ప్రజలు అంగీకరించరు. తమ్ము కాదని రాజులు అంగీకరించినయెడల ప్రజలు వారిని రాజ్యభ్రష్టులుగ చేయ సమకట్టియున్నారు. ఇట్టి పరిస్థితులలో రాజీ కుదురుట సాధ్యము కాదు. సర్వస్వాతంత్ర్యము లేనట్టి సామాన్య రాష్ట్రాధికారముతో యూదులు తృప్తిపడినయెడల అరబ్బీరాజులు వారితో రాజీ చేసికొనెదరు.

తాత్కాలికయుద్ధవిరామమును మరికొంత కాలము పొడిగించుటకు కూడ బర్నడాట్ ప్రయత్నములు చేయుచున్నారు కాని ఇందుకు అరబ్బీలు సమ్మతించజాలరు. అటో ఇటో ఏదో ఒకటి శీఘ్రకాలములో తేలవలెనని వారి ఉద్దేశము.

## జర్మనీ

జర్మనీవిషయమై అమెరికా బ్రిటన్ ఫ్రాన్సు బెల్జియం హాలెండు లక్సెంబర్గుదేశములమధ్య జరుగు

చుండిన, లండన్ సభ జూన్ నెలలో ముగిసెను. ఈ ఆరు రాజ్యముల ప్రభుత్వములు కొన్ని ప్రధాననిర్ణయములకు సమ్మతించినవి. జర్మనీపరిశ్రమ లన్నిటికి 'రూర్' రాష్ట్రము కేంద్రము. అచ్చట ఉత్పత్తియగు బొగ్గు, ఇనుము, ఉక్కు, యంత్రములు—వీటి సహాయముననే జర్మనీ ఇదివరలో ముందుకు రాగలిగెను. ఇట్టి అవకాశము జర్మనులకు ఇకమీదట ఉండరాదనియు, ఈ పరిశ్రమలన్నిటిని పై ఆరురాజ్యముల ప్రతినిధుల యాజమాన్యమున జరుపవలయు ననియు వీరు నిర్ణయించుకొనిరి. ఇదిగాక, జర్మనీకంతకు సంపూర్ణాధికారము గల కేంద్రప్రభుత్వ మేర్పడరాదనియు, అట్టి ప్రభుత్వముండబట్టియే హిట్లరు ఇతరదేశముల స్వాతంత్ర్యమును అపహరించగలిగె ననియు, అట్టిప్రమాదము ఇకమీదట రాకుండుటకు సంపూర్ణాధికారము లేని 'ఫెడరల్' ప్రభుత్వము స్థాపితము కావలె ననియు వీరు చేసిన నిర్ణయములలో రెండవది. వీటిమూలమున రష్యావారి నుండి ఫ్రాన్సువారికి ఏదైన ప్రమాదము సంభవించిన యెడల ఫ్రాన్సును రక్షించుటకు బ్రిటన్ అమెరికాలవారు హామీ ఇచ్చిరి. రెండవ ప్రపంచయుద్ధమునకు ఫలితముగ జర్మనీ నాలుగు ముక్కలుగ చీలిపోయె ననియు, వాటిలో తూర్పుజర్మనీని రష్యావారును, పశ్చిమజర్మనీలోని మూడుముక్కలను బ్రిటిష్, అమెరికా, ఫ్రాన్సువారును పాలించుచున్నారని చదువరు లెరుగుదురు. పై సభయొక్క నిర్ణయముల ఫలితముగ పశ్చిమజర్మనీలోని మూడుముక్కలు కలిసి ఒక ప్రత్యేకరాజ్యముగ ఏర్పడును.

ఇదిగాక చెలామణివిషయమైకూడ కొన్ని మార్పులను బ్రిటన్ అమెరికా ఫ్రెంచివారు గావించిరి.

పై నిర్ణయముగాని, చెలామణిమార్పులుగాని రష్యావారికి ఎంతమాత్రము ఇష్టము లేదు. పశ్చిమ జర్మనీనంతయు ఒక్కటిగ జేసి, అక్కడి పరిశ్రమల యొక్కయు, అయిదుకోట్ల ప్రజలయొక్కయు సహాయమున బ్రిటన్ అమెరికా ఫ్రాన్సులవారు రష్యాపై యుద్ధప్రయత్నములను చేయుచున్నారని రష్యావారి అభిప్రాయము. అందుచేత వారు తూర్పుజర్మనీలో తమ బలమును స్థిరపరచుకొను ప్రయత్నములో ఉన్నారు.

## బర్లిన్

తూర్పుజర్మనీలో బర్లిన్‌నగర మున్నది. ఇది జర్మనీకంతకు ప్రధానపట్టణము. దీనికి గల పేరుప్రతిష్ఠలు మరే పట్టణమునకు లేవు. మనకు ఢిల్లీ ఎట్టిదో జర్మనులకు బర్లిన్ అట్టిది. కాని ఇదికూడ రెండవ ప్రపంచయుద్ధానంతరము నాలుగు భాగములుగ పంచబడినది. అనగా పట్టణమునకంతకు ఒకే పరిపాలన ముండుటకు బదులు నాలుగు పరిపాలనలు ఏర్పడినవి. తమ వశమం దున్న భాగములలో బ్రిటన్, అమెరికా, ఫ్రాన్సువారు క్రొత్త చెలామణిని ప్రవేశపెట్టిరి. దీనికి రష్యావారు అంగీకరించలేదు. ఈ విషయమై వాదోపవాదములు ప్రబలి తుదకు పశ్చిమజర్మనీనుండి బర్లినుకు మధ్య రాకపోకల నన్నిటిని రష్యావారు ఆపివేసిరి. బర్లిన్‌చుట్టు నూరుమైళ్ళ ప్రదేశమున రష్యావారి పాలనకు లోబడిన తూర్పుజర్మనీ ఉన్నది. ఈ నూరు మైళ్లను దాటినగాని పశ్చిమజర్మనీనుండి బ్రిటిష్‌వారు, అమెరికన్లు, ఫ్రెంచివారు వారికి లోబడియుండు బర్లినుకు వచ్చుటకు వీలులేదు. వారికి లోబడిన బర్లిన్‌లో ఇరవైలక్షల జర్మనులు ఉన్నారు. రాకపోకలకు ఆటంకము కలిగినందున ఈ రెండులక్షుల జనమునకు కావలసిన ఆహారాదిపదార్థములు వచ్చుట దుస్సాధ్య మయ్యెను. ఆకాశవిమానములద్వారా కొంత సప్లయి జరుగుచున్నది గాని ఎంతకాలము ఇది జరుగగలదు? బర్లినునుండి బ్రిటిష్‌వారిని, ఫ్రెంచివారిని, అమెరికన్లను తరిమివేయుటకు రష్యావారు పన్నిన పన్నాగమే ఇదంతయు. ఇట్టి సందర్భములో వీరు బర్లిన్ వదలి పారిపోయినయెడల వీరి ప్రతిష్ఠకు భంగము కలుగును. రష్యన్లకు భయపడి పారిపోయి రను అభిప్రాయము ప్రపంచమందంతట వ్యాపించును. పారిపోక, అచ్చటనే ఉండవలె ననిన రష్యావారు ప్రయాణవిషయములో కల్పించిన ఆటంకము లన్నియు రద్దుకావలెను. యుద్ధమూలమునగాని ఇవి రద్దుకావని తోచుచున్నది. కనుక జర్మనీలోని పరిస్థితులు మూడవ ప్రపంచయుద్ధమునకు దారి తీయుచున్నవని అనుకొనుటలో పొరబాటేమియు లేదు. పాశ్చాత్య నాగరకతయందును, ఇటీవల అభివృద్ధి గాంచిన వారి శాస్త్రాభివృద్ధియందును ఒక గొప్ప లోప మున్నది. నిరంతరము యుద్ధసన్నాహముల యందే నిమగ్నులై ఉండుట ఈ లోపము. దీనిమూలమున వారికేగాక ప్రపంచమునకంతకు ప్రమాదము సంభవించుచున్నది. ఆధునికపాశ్చాత్యనాగరకతయును, ప్రపంచశ్రేయస్సునకును ఏలాటి పొందికయు కలుగజాలదు. ప్రపంచములోని ప్రస్తుతకాలపు సంక్షోభమునకంతకు ఇదియే ప్రధాన హేతువు. (1-7-'48)

# కలగూరగంప

## స్వతంత్రభారతమున మతబోధన

ప్రపంచములో ఉత్తమములగు మూడు మతములకు భారతదేశము పుట్టిల్లు. మహమ్మదీయులచే తరుమగొట్టబడిన పారశీకులకు నిలువ నీడ నిచ్చినది మన దేశము. నిరాటంకముగా తమ మతమును ప్రచారము చేసికొనుచు, అన్యులను తమ మతములోనికి మార్చుకొనుచున్న క్రైస్తవమిషనరీలకు స్వేచ్ఛ నిచ్చినదీ దేశము. మహమ్మదీయమతమునకు హృదయపూర్వక స్వాగత మిచ్చినదీ దేశము. విద్యాలయములలో మతబోధ ఉండవలెనా, లేదా అను ప్రశ్న అట్టి భారతదేశములో విచారింపబడుట శోచనీయము. తత్పర్యవసానము విశేషముగా విషాదమయము. రాజ్యాంగ నిర్మాణసభ్యుల కమిటీ ఈ విధముగా వ్రాసినది:

"భారతీయులమైన మేము, భారతదేశమును స్వతంత్రప్రజాస్వామికమైన రిపబ్లిక్‌గా చేయవలెనని స్థిరముగా సంకల్పించి........ప్రభుత్వముయొక్క ధనసహాయముతో స్థాపింపబడు విద్యాసంస్థలలో ప్రభుత్వము మతబోధన చేయరాదని తీర్మానించుకొనుచున్నాము." (మూడవభాగములో, ౧౬ వ సెక్షన్, పుట ౧౦.)

గృత్సమద, విశ్వామిత్ర, వామదేవ, అత్రి, భారద్వాజ, వసిష్ఠ, కణ్వ లను సప్త వైదికఋషి కుటుంబములు; యాజ్ఞవల్క్య, సనత్కుమారాది ఉపనిషన్మునులు; మను, పరాశరాదిధర్మశాస్త్రశాసకులు; కపిల, పతంజలి, గౌతమ, కణాద, జైమిని, బాదరాయణు లను షడ్దర్శనవిధాతలు; మైత్రేయ వేదవ్యాసాది పురాణఋషులు; శంకర, రామానుజ, మధ్వాచార్యులు; వల్లభ, చైతన్య, నానక్ మొదలగు మతప్రవర్తకులు, రామమోహన్‌రాయ్, దయానందసరస్వతి, స్వామివివేకానంద, అనిబిసెంటులు—వీరందరు సల్పిన మహత్తరకృషికి ఫలిత మిదియేనా? మతబోధ మాన్పుటయే వీరి యత్నములకు పరమావధిగా నేడు కన్పించుచున్నది. దాదాపు పదివేలసంవత్సరములనుంచి భారతదేశచరిత్రపరిణామమును గమనించిన, దాని కంతకు ఫలిత మిదియేనా? ఈ పవిత్రభూమిలో బుద్ధమహావీరులు తమతమ మతముల నిందులకే స్థాపించినారా? జ్ఞానాన్వేషులై, ఎడారులను, అడవులను దాటుచు చీనాదేశమునుంచి మన దేశమునకు వచ్చిన యాత్రికులు ఈవిధముగా మన దేశస్థితి పరిణమించుననియే వచ్చినారా? మన దేశములో హిందువుల దేవాలయములు, యూదుల సినగాగ్‌లు, క్రైస్తవుల చర్చీలు, మహమ్మదీయుల మసీదులు నున్నవి. ఇవన్నియు ఎందుల కున్నవి?

తర్వాతి సెక్షన్‌లో ఈక్రిందివిధముగా నున్నది:

"ప్రభుత్వ సహాయమున నడుపబడు విద్యాసంస్థలోగాని, లేక ప్రభుత్వ మామోదించిన విద్యాసంస్థలోగాని చదువుకొనుచున్న విద్యార్థి ఆయా సంస్థలలో నుండు మతబోధనకు, తన కిష్టము గాకపోయినచో, వెళ్ళనవసరములేదు."

మన దేశములో అనేకమతములుమాత్రమేగాక, వివిధమతానుయాయుల మధ్య విభేదములు, తగాదాలు కలవు. ఇట్టి పరిస్థితులలో మతబోధన సలుపుట కష్టమని తోచవచ్చును. మహాభాష్యములో భగవాన్ పతంజలి యనినట్లు, భిక్షుకు లున్నారని వంట మానెదమా! పంటను తినివేసి పాడుచేయు మృగము లున్నవని విత్తనములు చల్లుట మానెదమా!

ఈ రాజ్యాంగపద్ధతిప్రణాళికను తయారుచేసిన మహామహులగు న్యాయవేత్తలు ప్రభుత్వముయొక్క స్వాధీనములో అమలుజరుపబడు ప్రవృత్తులనుంచి దీనినిమాత్రమే తీసివేయుట కేల తలపెట్టిరో ఆశ్చర్యముగనే యున్నది. భారతదేశమున పలురాష్ట్రములలో వివిధవిధములగు ఆహారపద్ధతు లున్నవి. ఈవిభేదాలనుంచి కూడ వివాదములు బయలుదేరుట నేడుగూడ మనము చూచుటగలదు. శాకాహారము, మాంసా

హారము అను విభేదము లున్నను, మద్రాసులోని హోటళ్ళలో అరవమెస్సు (Mess) లని, ఆంధ్రమెస్సులని, ముస్లిం క్రైస్తవ మెస్సులని కలదు. ఈ క్లిష్టసమస్య ఉండుటచేత, ఇట్టి సంస్థలలో నుండువారికి ఆహారమీయబడరాదని ప్రభుత్వము శాసింపవచ్చునని అనగలమా ? లేక ఎవరకు కావలసిన ఆహారమును వారే కొసగుట ఉచితమా ?

మన దేశములో వివిధభాషలు లున్నవి. భాషాభేదముకూడ వివాదహేతువుగానే పరిణమించినది. భాషావిభేదాలుగాని, వివాదహేతువులుగాని కానట్టి భాషయే ప్రభుత్వముచే ఆమోదింపబడునా ? దుస్తులలోకూడ వివిధప్రాంతాలలో భేదాలు చాల ఉన్నవి. దీనివలనకూడ అభిప్రాయభేదాలు, తగాదాలు బయలుదేరినవి. ఒకేఒకవిధమైన వస్త్రవిధానమే దేశమంతటా ఉండవలెననిగాని, వివాదాలు లేకుండ ఉండవలెనని నగ్నవిధానమే అవలంబింపబడవలెనని కాని శాసించుట లేదుగదా ! ఇదేవిధముగా అనేక విషయాలలో విపరీతముగా విభేదా లున్నను, తన్మూలకమైన వివాదా లున్నను ప్రభుత్వము వానిని నిషేధించుట లేదు.

ఆహారము, భాష, వస్త్రము అనునవి అత్యవసరములని, వీనిలో దేశమంతటా ఒకేవిధమగు వస్త్రభాషా ఆహారాదులు కుదురవని, అందుచేత వీనిలో నానాత్వము తప్పదని అనవచ్చును. కాని భౌతికశాంతికి వస్త్రాహారాదు లెంత అవసరమో, మానసికశాంతికి మత మంతకన్న నెక్కు డవసర మని జ్ఞప్తియం దుంచుకొనవలయును. మత మక్కరలేదని నాస్తికు లన్నచో, వస్త్రాహారాదు లనవసరములని యోగులు పలుకగలరు. నాస్తికుని అవసరములు యోగుల అవసరములకన్న మిన్న లని యే ప్రభుత్వము శాసించలేదు. ఒకని అవసరములను కాపాడదలచి మరొకని శాంతిభద్రతలను నాశనము చేయ వలనుపడదు.

వ్యక్తిగతస్వాతంత్ర్యమునకుకూడ పరిమితి కలదు. సానికొంపలను తీసివేయుటకు, త్రాగుడును మాన్పుటకు, పారిశ్రామికుల కాలము నిర్ణయించుటకు వ్యక్తిగతస్వాతంత్ర్యమే ప్రమాణీకృతము కాగలదా ?

త్రాగుడు, వ్యభిచారము మొదలగు దుష్ప్రక్రియలను ఉన్మూలించురీతిగా, మతమునుకూడ ఉన్మూలించకుండ, ఈ ప్రసిద్ధన్యాయవేత్తలు ప్రభుత్వము నిర్వహించవలసిన పనులలో మతబోధన ఒకటి అని నిర్వచించిన బాగుండెడిది.

భారతదేశవిద్యాసంస్థలలో ఈ నాయకులు బుద్ధునితోను, క్రీస్తుతోను పోల్చదగిన మహాత్మాగాంధి యొక్క అనుయాయులు, అనుచరులు నై, మతబోధనను తీసివేయుట మిగుల శోచనీయము. విషాదమయము.

పదవ షెడ్యూలులోని 3వ సెక్షనులో, 3వ సబ్ సెక్షనులో మతబోధన చేయుటకు పూర్తిగా అవకాశములు కల్పింపబడినవని వాదించవచ్చును. కాని ఈ షరతుప్రకారము విద్యార్థియొక్క అంగీకారము లేనిదే అతనికి మతబోధన చేయరాదని యుండుటచే మొదటి సందేహమే యున్నది. క్రైస్తవమిషనరీలచే స్థాపింపబడిన విద్యాసంస్థలలో, క్రైస్తవేతరుడు అంగీకరించినను, బైబిలుపాఠమును విన వీలగునా ? వినవచ్చునా ? రామకృష్ణమఠము స్థాపించు సంస్థలో అన్ని మతములకు చెందిన ఒకేఒక మతబోధనను వినుటకు వీలగునా ?

ఒకమతమువారు స్థాపించు సంస్థలో మతాంతరులకు ఆయా మతములను గురించి బోధచేయుటకు అవకాశము లుండునా ?

షెడ్యూలులో 3వ సబ్ సెక్షనును వివరముగా ప్రభుత్వమే వ్యాఖ్యానించవలెను.

పూర్ణముగా వ్యక్తిస్వాతంత్ర్య మున్నను Working Hours కానప్పుడు సిగరెట్లు కాల్చవచ్చు నన్నట్లు మతబోధన చేయవచ్చునని వైకల్పికముగా పలుకతగునా ?

సి. కున్హాన్ రాజా.

('వేదాంతకేసరి' నుండి పో. సు. శాస్త్రి అనువాదము)

---

## ఆర్తరక్షణ

(పద్య-నీతికథ)

ఎవ రా మానుషుఁ డేగుచుండె ద్రుతిమై
నేకాంగియై రథ్యయం
దవరోధవ్రజ ముత్తరించి ఘనకృ
త్యాలోచనోద్రేక సం
భవదృక్తేజవిరాజదాస్యవిధుఁడై,
వార్ధక్యముఁ ద్రొక్కి, తా
సవరింపంజనుఁ గర్జ మెద్దియొ ప్రశం
సాభాజనం బయ్యెడుఁ !

ఈ విభావరి నాతని హృద్రథాంగ
మెందుఁ బొందగు వీక్షించుచుంద మనుచుఁ
గ్రిందుఁజూన దివిఁ దారకాబృంద, మతఁడు
చనెడు నగరంపు టంద మేచంద మనిన.

ప్రత్యూషసమయజాగ్రన్మానవానీక
 సమ్మార్జితాగారసంచయములు
సమయసంకలితహృచ్ఛాంతిప్రదాన మ
 జ్జనభోజనాదివిస్ఫారితములు,
నిజకృత్యనుష్ఠాననిష్ఠాసమార్జిత
 స్ఫీతసౌఖ్యాస్పదజీవితములు,
నఖిలవాంఛాప్రదాయకకార్యవేశ్మసం
 ఘటితమానవలోక్యకార్యతతులు
నగుచు సంపద్విపచ్ఛట లమరుచుండఁ
గొసరి హర్షవిషాదముల్ గూడిమాడఁ
బ్రాజ్యరాజ్యేందిరాశిరోరత్న మనఁగ
దనరెఁ గాహళభువి రాజధాని యగుచు.

భూమికాచ్ఛాదితంబు తత్పుణ్యమూర్తి
వఱలు నన్యజనాజ్ఞాతఫణితి నిశల
నాత్మరూపం బొరు లెఱుంగ టనుచితం బ
టంచు జనతతిబాధ లిట్లరయు నతఁడు.

వ. అతఁ డట్లేగుచుండుతఱి సంభ్రమాద్భుత భయావహంబగు నుచ్చైర్నాదం బొండు శ్రోత్రగోచరం బయ్యెను. తోడ్తో —

అశనివితతి నవని యద్రుఁగాక గిద్రుఁగాకఁ
గొంకు లేని ధైర్యకుధరమునుట,
నాతఁ డంత దుర్భయాక్రాంతమతిగాక
నాలకించి రూపు నరయ నిలచె.

ఏమని నొడుగుదు ? నెవరో
భామిని వలకేల నొండు పట్టి కలంగన్
ధీమతినిఁ గదిసి యెటుఁ జన
నేమియు నేమంబు లేమి కెంతయుఁ దలఁకన్.

అది విని ప్రాజ్ఞుఁ డమ్మరో ! న
 యంబె భయంబు ? నయంబు మీఱ ని
ద్దొదవిన కుందు సందియము
 నొందకఁ దెల్పుము, మచ్ఛరీరముల్
దుదియగుఁగాక, నీ వ్యథను
 ద్రోలెదఁ గ్రాలెద నన్న, సాధ్వియున్

బదరుచు 'అన్న ! దొంగ !' లని
 బంధురగద్గదఖిన్నకంఠయై.

చెలఁగి త్రుటిని మృత్యుజిహ్వాగ్రభయదమై
మెఱయు హేతివితతిఁ దఱిసె దండు,
తాఁడిఁ దన్ను వారిఁ దల దన్ను మేల్ దంట
నచటఁ దారసిల్లు టరయలేక.

వారలఁ బొడగని క్రేల్మిడిఁ
జేరువ భుజగమును ముంగి చెనకెడు ధాటిన్
గెరెను దుపాకితో ఘో
రారవభీతాష్టదిగ్గజావళుఁ డగుచున్.

ఎవరహో దంతఖడ్గమత్తేభఘటలు
వ్రీడ లేదె నిరాయుధస్త్రీని దాఁకఁ ?
శౌర్యమయ్యెనుగాదె మీ క్రౌర్యపటిమ !
కానిచో నిల్చి యుసురులఁ గాచికొనుఁడు.

క్షుద్రజనకంతలుంతనాకుంఠితప్ర
చండభుజదండముండితోద్దండు లగుచు
ఖండనం బొనరించుట పాడిగాని,
తగునె యిబ్భంగి సాధ్విపై దండువిడియ ?

అని ఘోషింపఁగ, ఘూర్ణహృద్వనఘులై
 యా ధూర్తు లప్పట్టునన్
బని సాధించు టతథ్య మంచు చెఱఁగి, యా
 పై డాయఁగా నోడి, గొ
బ్బునఁ బాదప్రతిభాప్రదర్శకులునై
 పోఁబొచ్చి 'నీనాఁటి కీ
పని చాల్, జీవము దక్కె' నంచు నపు డా
 ర్వన్ శ్వానసంఘాతముల్.

వెలఁదిదండ నొండు వేత్రఖండము లేదు,
క్రాలు మనకు హేతిజాల మనుచు,
వెన్ను చూపనయ్యెఁ జిన్ని తుపాకికి
మేటి యేది వస్తుకోటి ననఁగ.

ఒక్కెడ శస్త్రవితతి నొరుల నేచఁగఁ దాఁగె,
నొక్కెడ డడిద మెత్తి యొడ్లఁ గాచె,
నుర్వి వస్తునిచయ ముపయుక్తమునఁ జేసి
యుచ్చనీచగతుల నొలయుఁగాదె ?

చిట్టా రామకృష్ణరావు



# విమర్శనము



## ఆంధ్ర హోమియోపతి ఔషధ విజ్ఞానము

గ్రంథకర్త: వేమవరపు వేంకటరమణశర్మగారు, కపిలేశ్వరపురము, తూర్పుగోదావరి జిల్లా. డెమ్మీ సైజున ౭౦౦ పుటలకు పైబడిన గ్రంథము. వెల ౧౨ రూ.

ఇప్పుడిప్పుడే, దేశములో క్రమముగా పలుకుబడి సంపాదించుకొనుచున్న 'హోమియోపతి' వైద్యవిధానమునుగురించిన సమస్తవిషయములు, ఈ వైద్యములో వాడు రకరకాల మందుల లక్షణములు, వాటి ప్రయోగ ఫలితములును ఈ గ్రంథములో సయుక్తికముగా, సప్రమాణముగా, సులభమైన భాషలో వివరింపబడినవి. ఈ వైద్యములో అభిమానాదరము లున్నవారు తప్పక చదువదగి యున్నది. 'హోమియోపతివైద్యసర్వస్వ' మని దీనిని గ్రంథకర్త పేర్కొనుటలో అతిశయోక్తి లేదని గ్రంథావలోకనము ఋజువుచేయుచున్నది.

## జాతీయ విజ్ఞానము

ఆంధ్రరాష్ట్రకాంగ్రెసువారి ఆదేశాదరములతో విజయవాడలోని జాతీయవిజ్ఞానపరిషత్తువారు ప్రచురించిన ప్రత్యేకసంచిక ఇది. సంచికాసంపాదకులు ఏటుకూరు వెంకటనరసయ్యగారు. వెల 3 రూ.

రాజకీయములతోపాటు సారస్వతవ్యాసంగము లందుగూడ యథాశక్తి పాటుపడి జాతీయవిజ్ఞానమును పెంపొందింపజేయవలె నన్న మహదాకాంక్షతో రాష్ట్రకాంగ్రెసువారు తలపెట్టిన ప్రయత్నము ప్రశంసనీయ మనుటకు సందేహము లేదు. ఈ ఉద్యమముతో వారు సాధించదలచిన ఉద్దేశ్యము లేవో ఆచార్య రంగాగారు ఈ సంచికకు వ్రాసిన 'ప్రస్తావన'లోను, సంచికచివర సంపాదకులు వ్రాసిన 'స్వవిషయము'లోను విశదముగా తెలుపబడియున్నవి. దేశములో ఉన్న సుప్రసిద్ధరచయితలు చాలమంది వ్రాసిన వివిధ వ్యాసములతో ప్రస్తుతసంచిక వారి తొలియత్నముగా వెలువడి, క్రమశః వారి ఆదర్శములకును, ఆశయములకును తప్పక అందుకొనగల దన్న ఆశను రేకెత్తింపజాలి యున్నది.

## చింతచిగురు చిన్నది

కావ్యకథానిక. కవి: యం. ఆర్. బి. నర్సింహారావుగారు. విలాసము తెలియదు. వెల అర్ధరూపాయి.

భావనలోను, భావములలోను, భావవ్యక్తీకరణలోను ఏదోకొంత ప్రత్యేకత గలవాడుగాను, కట్టుబాట్లకు లొంగనివాడుగాను కనిపించుచున్నాడీ కవి. దానికి కవితారచనయు, దీని కనుబంధముగా 'శిశిరపత్రాలు' అని జోడించిన భావఖండికలును ప్రత్యక్షసాక్ష్యములుగా నున్నవి. ముఖపత్రచిత్రముకూడ భావస్ఫోరకముగా నున్నది.

## విశ్వజ్యోతి

గ్రంథకర్త: చల్లా లక్ష్మీనారాయణశాస్త్రి గారు, తెలుగుపండితులు, బోర్డుహైస్కూలు, పొన్నూరు. వెల ౧ రూ.

శుద్ధోదనుని తనయుడైన సిద్ధార్థుడు తపస్సిద్ధిచే బుద్ధుడైన యుదంతమును వస్తువుగా తీసికొని, ఆర్నాల్డు మహాకవి వ్రాసిన బుద్ధుని చరితమును, తిరుపతి కవుల 'బుద్ధచరిత్ర' ప్రబంధమును ఆధారముగా గొని ప్రాచీనలక్షణపద్ధతితో వ్రాసిన ఆరంకముల నాటక మిది. కళాశాలలలో పాఠప్రవచనములకై ఉద్దేశింప బడిన ఈ నాటకము అందుకు అన్నివిధములా అర్హత గలదై యున్నది.

### మంగళప్రభాతము

రచయిత: మహాత్మాగాంధీ. అనువాదకులు: వేమూరిఆంజనేయశర్మగారు. ప్రాప్తిస్థానము: కమ్మర్షియల్ లింక్సు, విజయవాడ. వెల ౬ అ.

సత్యము, అహింస, బ్రహ్మచర్యము, అస్తేయము, అపరిగ్రహము, అస్పృశ్యత, సర్వమతసమానత్వము—మొదలైన విషయములపై గాంధీగారి వ్యాసములకు ఇది అనువాదము. అనువాదము సాఫీగా, సహజముగానే ఉన్నదిగాని, ఈ వ్యాసములకు గల ఆకరములను, 'మంగళప్రభాత'మన్న పేరు పెట్టుటకు గల కారణమును అనువాదకులు తెలిపియుండినచో బాగుండెడిది.

## గ్రంథ స్వీకారము

### ప్రద్యుమ్నాభ్యుదయము

కవిసార్వభౌమ రవివర్మ విరచిత సంస్కృతనాటకమున కనువాదము. అనువాదకులు: కోట సుందరరామశర్మగారు. ప్రకాశకులు: కోట యజ్ఞరామశర్మగారు, చింతలపూడిపాలెం, మచిలీపట్నము. వెల రూ. ౧-౮-౦

### An Outline of Indian Art

ఆంగ్లము. రచయిత. వి. రాజేశ్వరరావుగారు, అడ్వొకేటు, ఏలూరు. వెల రూ. ౧-౮-౦.

---





తుని:—ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు కమిటీ ఎక్కువ మెంబరును, తుని యూనియన్ బోర్డు ఎక్సు-ప్రెసిడెంటును, పురప్రముఖులలో నొకరును, అగు శ్రీ చల్లా వెంకట్రావుగారు, తమ 75 వ సంవత్సరమున 9-6 48 తేదీని తునిలో స్వర్గస్థులైరి.

Printed and Published by S. Sambhu Prasad, at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St., G. T., Madras. Editor—S. Sambhu Prasad.




# లిప్టన్స

## అంటే అర్థం
## మంచి టీ

LTX-181T6